

















శ్రీరస్తు

శుభమస్తు　　　　　　　　　　అవిఘ్నమస్తు

# భావయామి వేంకటేశమ్

## సంపుటి-1

### ఎన్నుకోబడిన
### అన్నమాచార్యుల సంకీర్తనలకు
### మున్నుడి

మరియు

### భావామృతం వివరణ

రచన
**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**
M.Tech.

# భావయామి వేంకటేశమ్

**సంపుటి-I**

**మొదటి ప్రచురణ**
**జులై 2010**

**రచన**
**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**
M.Tech.
**Cell: 9393021360**

**వెల : అమూల్యం**

**ప్రతులకు :**
**ఫ్లాట్ నెం. 5, ప్లాట్ నెం.61, సిద్ధార్థ నగర్,**
**హైదరాబాద్ - 38. ఫోన్ : 093930 21360**

**డి.టి.పి. & ప్రింటింగ్ :**
**కె. మురళీ కృష్ణ**
**9848 51 51 09**





## అన్నమాచార్యులవారి
## 602వ జయంతి సందర్భంగా భక్తితో

ఆ.వె॥ ఇష్టదేవతలను యెల్లర భావింతు
'వేంకటేశ్వరునిగ, వేడుకొనెద
అన్నమయ్య కృతికి అత్యంత సులువైన
వివరమీదలంతు విజ్ఞులార!

**- రచయిత**



## అంకితము

చం॥
హరివెలయింపగా నరిగి ఆయన నందక ఖడ్గ మీభువిన్
వరముగ రూపుదాల్చి నుతి బాడెను కమ్మని కీర్తనంబులన్
వరదుడు "అన్నమయ్య" హరి భక్తుడు యందరి మోక్షదాతయున్
గురువుగనెంచి అంకితము కోరిక తీరగ నిత్తు నీకృతిన్.

# భావయామి వేంకటేశమ్

## సంపుటి I

### అన్నమయ్య కీర్తనల విషయ సూచిక

# ప్రార్థన

కం॥ శ్రీహరి శరణము గోరిన
శ్రీహరణము మొట్టమొదట చేయును ఆపై
శ్రీహరి 'లేదేమో' నని
'శ్రీహరి విముఖులను' జేయు చిత్తము గాల్చున్

మ॥ తరమే!! నేర్వగ వానిలీల అవనిన్ దారిద్ర్య భీభత్సముల్
కురియన్ జేయును కంటినీరమిడుచున్ కూల్చున్ గదా ఆశలన్
నరులే నాటికి నేర్వలేరు భ్రమలో నాబోంట్లు దూషింతురున్
శరణంబీవని కాళ్ళుపట్టి విలపించంగా తనే దిక్కగున్.

కం॥ శ్రీ వేంకటేశ! ఈశా!
రావే రక్షింప నన్ను లక్షీరమణా!
నీవే దిక్కని నమ్మితి
లావొక్కింతయును లేదు రారా తండ్రీ!





సీ॥ మలమూత్ర గ్రస్తమౌ "మాయ దారి తనువు"
నిచ్చావు కంపాయె నెందుకయ్య!
ఏ రోజు కారోజు దరిజేరె 'యములాడు'
తెల్లారునో లేదొ తెలియదాయె!
'ఆర్గురు శత్రువుల్' అదిరించి బెదిరించి
నన్నోడ గొట్టుచు నలిపిరయ్య!
ఆశలు దీరక పాశమై బంధించె
తెగవాయె! నేనైన తెంపనాయె!

ఆ.వె॥ ధ్యాసనిలువదాయె, ధ్యానంబు రాదాయె!
భక్తికుదరదాయె, బాధలాయె!
జాలి సుంత నీకు కలుగదాయెను ప్రభూ!
వెఱ్ఱి వాడనయ్య వేంకటేశ!

శా॥ ఏముందిందని ఎందరెందరని నన్ హేయంబుగా బల్కియున్
ఏమైనన్ వ్రతమట్లు వేంకటపతిన్ ఈరీతి కీర్తించెదన్
శ్రీ మంతుండగు శేషశైల విభునిన్ సేవించెనా యన్నమ
య్యేమాత్రంబు కుశంక లేక నిదిగో ఏ నెంతు నీదారినే.

చం॥ అనవరతంబు పాడుటకు నందిరికిచ్చెను అన్నమయ్యతా
ననుపమమైన కీర్తనలు ఆ హరినెంచుచు వేంకటాద్రి వా
సునివలె శ్రీనివాసునిగ చూడమరెవ్వడు సాటి?మ్రొక్కెదన్,
వినుడు మురారి సత్కృపను వీటికి 'మున్నుడి'నెంచి చెప్పదన్

తే॥ వేంకటాద్రికి సమమైన 'పెద్ద' నెలవు
విశ్వమందున లేదురా వెదకి చూడ
వేంకటేశ్వరు బోలిన వేల్పెవండు?
మునుపులేదురా, రాబోదు ముందుముందు.

ఉ॥ సంకట హరియే పనిచి 'చావు' నొసంగుట కుద్యమించినన్
అంకిలి సెప్పనెవ్వరికి ఔను మహీతలినా విరించియున్
శంకరుడాది దేవతలు సాయము జేతురె? కల్ల,యందుకే
వేంకటనాథునే శరుణు వేడెద తప్పుల నెంచుకుండుకై.

## ముందు మాట (సంపుటి-I)

"మాయా మేయ జగంబు నిత్యమని సంభావించి"....అని హరిశ్చంద్రుడు కాటికాపరియై వేదాంతం తెలుపుతాడు. మన మాతృభాష అయిన ఈ తెలుగు ఎంత అద్భుతమైన భాష అంటే, ఎంత చెప్పినా తక్కువే అవుతుంది. పై వాక్యంతో నా ముందుమాట ఎందుకు మొదలు పెట్టానంటే....

భగవానుడు తిప్పుతున్న ఈవిశ్వాన్ని మాయ ఆవరించి, సత్యం అసత్యంగాను, అసత్యం సత్యంగాను గోచరిస్తుంది. మిధ్య అయిన వన్నీ నిజాలుగా భావించి మనకు మనమే 'ధనం' అన్నదాన్ని సృష్టించుకొని దానితో పొందగలిగే సుఖాలన్నీ నిజంగా సుఖాలు కాదని, నివురు కప్పిన నిప్పులా,దుఃఖమే సుఖమనే వేషంలో వచ్చినదని, దానిని నమ్మరాదని పెద్దలు ఏనాడో చెప్పారు. పంచమ వేదమయిన భారతంలో చెప్పినదే 15 వ శతాబ్దిలో తాళ్ళపాక అన్నమాచార్యులవారు అద్భుతమైన తెలుగు కీర్తనలలో చెప్పారు.

తెలుగులో ఆ మహానుభావుడెందుకు చెప్పారంటే...తెలుగులో ఒక చిన్నమాటలో ఎంతో గొప్పభావం తెలుపవచ్చును. ఒకే అక్షరాన్ని రకరకాలుగా పలికి రకరకాల అర్థాలు వచ్చేట్లు చేయువచ్చును. ఉదాహరణకి 'ఆ' అనే అక్షరం గమనించండి. 'ఆ' అంటే 'అది' అని అర్థం. ( 'ఆ' పుస్తకం ఇటివ్వు). 'ఆ' అంటే 'ఏమిటి'? అని అర్థం ('ఆ' ఏమన్నావు ఇంకోసారి చెప్పు).'ఆ' అంటే 'అవును' అని అర్థం. ('ఆ' నేనూ సభలో వున్నాను). ('ఆ') అంటే ప్రశ్నార్థకం ('ఆ' అలా అయిందా?)

మళ్ళీ ఇంకొక్కసారి ఈ ముందుమాటలోని మొదటి వాక్యం గమనించండి. 'వేదాంతం తెలుపుతాడు'-అన్న వాక్యంలో తెలుపుతాడు అంటే తెలియజేస్తాడు అనే కదా! అర్థం. తెలుపు ఒక రంగు. తాడు, కట్టటానికి ఉపయోగపడే ఒకనూలు. రెండూ కలిపితే తెలుపుతాడు (తెలియజేస్తాడు) అయింది.





ఇంత విశాల పరిధి వున్న భాష కాబట్టే తాళ్ళపాక అన్నమాచార్యుల వారు తన కీర్తనలకు ఈభాషనెన్నుకొన్నారు. అన్నమయ్య సంకీర్తనలలో దైవస్తుతి కీర్తనలు కొన్ని సంస్కృతంలో వున్నా అవి సంఖ్యలో చాల తక్కువ, జన ప్రియత్వంలో ఎక్కువ.

దేశభాషలందు తెలుగులెస్స- అని శ్రీ కృష్ణ దేవరాయలు ఊరకనే అనలేదు. సంస్కృతం నుంచి ఆవిర్భవించినా తనదైన శైలిలో జాను తెలుగుగా రూపు దిద్దుకొని పల్లెల్లో నాట్లు వేసుకొని నేటికీ అజరామరంగా ఉన్నది జానపదుల తెలుగు. కాకపోతే నేటి ఇంగ్లీషు వ్యామోహం వల్ల బలహీనమై నాబోటి వాడి పద్యానికే తాత్పర్యం వ్రాయాల్సిన అగత్యం ఏర్పడింది.

అన్నమయ్య కీర్తనలకు భావం వ్రాయాలని నేను నిశ్చయించుకొని ఒకరి సలహా అడిగితే. తెలుగు కీర్తనలకి వివరణ అవసరమా అన్నట్లు మాట్లాడారు. పరమాత్మ దశావతారములను అచ్చతెలుగులో పాడిన అన్నమయ్య కీర్తనలు చూడండి. దీనికి సరి అయిన అర్థం (భావం) 'నాకు తెలుసా' అని ఎవరికి వారు మనస్సులో ప్రశ్నించుకోండి. దీక్షితులు నిజమే చెబుతున్నాడని మీకు తప్పక అనిపిస్తుంది. అన్నమాచార్యులవారి కీర్తనలు అంతతేలికగా కొరుకుడు పడవు.

సంస్కృత, తెలుగు నిఘంటువుల సహాయంతో మాత్రమే నేను ఈ నా సంకల్పం నెరవేర్చానని చెప్పటానికి నేనేమాత్రం సిగ్గు పడటం లేదు.

"ఎందరో మహానుభావులు అందరికీ వందనములు" ...అని అన్నారు త్యాగరాజ స్వామి. అన్నమాచార్యుల వారి సంకీర్తనలను సంరక్షించి, పరిశోధించి, పరిశ్రమించి, తగిన రాగములను కట్టి, సంకీర్తనలుగా పాడి, తాము ధన్యులవుటే కాక కోట్లాది మంది నాబోటి సామాన్య సంగీత ప్రియులను నిత్యమూ ఆనందపరుస్తున్న పెద్దలైన వారందరికీ పాదాభివందనలు. పిన్నలైన వారికి ఆ పెద్దవారంతటి వారు కావాలని శుభాశీస్సులు.

ఒకమాట... నిష్ణాతులు, వాగ్గేయకారులు, సంగీత విద్వాంసులు, సాహితీవేత్తలు, ఎవరో ఒకరి వారు కారు. వారు అందరివారు. అట్లాగే వారి కీర్తిప్రతిష్ఠలు వారివే కాదు అందరివీ. మా అన్నమయ్య, మా ఘంటసాల, మా బాలమురళి, మా లతా మంగేష్కర్, మా మహమ్మద్ రఫీ,... వీరికి జాతి కుల మత వయో బేధాలతో పని లేదు. కీర్తిశేషులైనా వీరు మాహృదయాలలోనే వున్నారు. రేపు మేములేకపోయినా వారు మా హృదయాలలోనే వుంటారు.

అందుకని నేను ఈ నా ప్రయత్నంలో ఎవ్వరెవ్వరి శ్రమనో, కష్టార్జితాన్నో, ఈ రచనను మెరుగు పెట్టటానికి ఆ'శ్రమ' ఉపయోగించుకొని వుంటే, వారికివే నాకృతజ్ఞతలు. వారందరి సహకారంతోనే ఈకృతి సాధ్యమయిందని మనస్ఫూర్తిగా చెబుతున్నాను.

నా రచనలు పుస్తకంగా నా మిత్రుల కివ్వటంలో నాకు అది భగవత్సేవ అనే భావనే కాని వేరే చింతన లేదు. డబ్బుకి నేనెన్నడూ సరస్వతిని అమ్మలేదు, అమ్మనుగాక అమ్మను.

నాలాగే ఇతరులుకూడ ఆలోచించక పోవచ్చు. వారి కష్టాన్ని వారు ప్రతిఫలరూపంలో ఆశించవచ్చును. నేను ఉపయోగించుకొన్న అన్నమయ్య కీర్తనలు వారి శ్రమ ఫలంగా వెలుగులోకి వచ్చి ఉండవచ్చును. అప్పుడు వారికి ఇందులో నేను వారి కష్టాన్ని దోచుకున్న భావన కలుగవచ్చును. మనందరికి గురువైన తాళ్లపాక గురుపుంగవులను చూచి నన్ను మన్నిస్తారని నా ఆకాంక్ష, విన్నపము కూడా. ఈ రచన చేయాలనే ఆలోచన పుట్టించిన బ్రహ్మ, శ్రీ ఎమ్.వి.ఎల్.ఎన్. మూర్తి గారు. ప్రోత్సాహాన్నిచ్చింది డా॥ బి.వి.ఎస్.ఆర్. మూర్తిగారు. సహకరించింది ఎందరో మహానుభావులు. అందరికీ నా కృతజ్ఞతాభివందనలు.





ఇకపోతే మున్నుడి ప్రతికీర్తనకి కావాలా? దాంట్లో పద్యం ఎందుకు? అనే ప్రశ్నలుత్పన్నమయ్యాయి. మున్నుడి అంటే ఉపోద్ఘాతం లేక అవతారిక. మున్నుడి తెలుగు మాట కాబట్టి దాన్నే ఎన్నుకొన్నాను. కీర్తన వైశిష్ట్యం తెలిపే ఉద్దేశ్యంతోనే ప్రతికీర్తనకి మున్నుడి చెప్పాను. ఇక ప్రతి కీర్తనకి ఒక పద్యం చెప్పటానికి కారణం మాత్రం పద్యాలపై నా ప్రేమ స్ఫురింప చేయటమే కాక, అన్నమాచార్యుల వారిని నా ఇష్ట దైవమైన వేంకటేశ్వరుని కీర్తించటమే.

భావామృతంలో కీర్తనని ప్రతి చరణంలోని ప్రతిమాటను వివరించాలని నా ఆశయం. అందుకనే పేరా లుగా విడివిడిగా వ్రాశాను. ఏ చరణాన్నయినా తేలికగా అర్థం చేసికొనవచ్చును.

నాకు ఆత్మానందం కలిగించిన ఈ నా ప్రయత్నం అనంతంగా సాగుతూనే ఉంటుంది. నా తుదిశ్వాసదాకా. ఎందుకంటే రోజుకి ఒకకీర్తన చేసినా అన్నమయ్య కీర్తనల కన్నీ భావం వ్రాయాలంటే నా జీవితకాలం చాలదు. అలా చాలకూడదనీ, ఈ నా అన్నమాచార్యారాధనలోనే వేంకటేశ్వరుని కీర్తిస్తూనే నా కలంతో పాటు శ్వాస కూడా ఆగిపోవాలని నా నిరీక్షణ.. నా ఆకాంక్ష.

నా వెబ్‌సైట్ **www.geetadeeksha.com** లో నా ఇతర రచనలు చదివి ఆనందించి నన్ను ఆశీర్వదిస్తారని ఆశిస్తాను.

**Note :** ప్రతి సంపుటిలోను ముందుమాట అంకితం యథాతథంగానే ఉంటాయి.

**1-1**

## మున్నుడి

శ్రీ వేంకటేశ్వరుడు సర్వాంతర్యామియైన ఆ పరమాత్ముడు. భగవంతుడైన ఆయన కరుణ అనంతమైనది. మనభక్తిలో లోటు ఉండవచ్చును గాని ఆయనకు తన భక్తులపైచూపించే వాత్సల్యానికి మాత్రం ఏనాడు కొఅత ఉండదు ఈ మాట సోదాహరణంగా వివరిస్తున్నారు అన్నమాచార్యులవారు.

**కం॥ ఎనలేని ప్రీతి యితనికి**
**వెనుకాడడు 'చక్ర' మెత్తు విష్ణుడు తానై**
**మన భక్తి కొరత గానీ**
**అని చెప్పెను అన్నమయ్య ఆదిమ కృతిలో.**

**రాగం : లలిత**

శ్రీపతి యీతడుండగా, జిక్కిన వారి నమ్ముట
తీపని మీసాల మీది, తేనె నాకుట సుండి ॥శ్రీపతి॥

తలచినంతటిలోనె-దైవమెదుట గలడు
కొలువనేరని యట్టి-కొరతే కాని
యిల నరులగొలుచు- టెందో కోకలువేసి
బలుకొక్కెరల వెంట- బారాడుట సుండి ॥శ్రీపతి॥

శరణన్న మాత్రమున-సకల వరములిచ్చు
నిరతి మరచినట్టి- నేరమే కాని
పొరి నితరోపాయాన- బొరలుట గాజు బూస
గరిమ మాణికమంటా-గట్టు కొంట సుండీ ॥శ్రీపతి॥





చేతమొక్కితే జాలు- శ్రీవేంకటేశుడు గాచు
కాతరాన సేవించని -కడమే కాని
యీతల నిదిమానిమ- రెన్ని పుణ్యాలు సేసినా
రీతి నడవి గాసిన -రిత్త వెన్నెల సుండి. ॥శ్రీపతి॥

**భావామృతం :**

శ్రీ వల్లభుడైన ఇతడుండగా తక్కిన వారిని నమ్మటం మధురమైన తేనె కావలసినంత వుంటే మీసాలకి అంటుకొన్న తేనెని నాకి సంతోషించటం లాంటిదే సుమా!

తలచు కొన్నంత మాత్రాన ఎదుటనిలిచే దైవం ఆస్వామి.భక్తితో కొలువలేని మనదే లోపం. ఈయనకు మ్రొక్కక నరులను కీర్తించుట తెల్లని వస్త్రములను ఒక చోట ఆరబెట్టి కొంగల గుంపువెంట భ్రమతో తిరుగుటయే సుమా!

శరణుకోరినంతమాత్రాన స్వామి సకల వరములను ప్రసాదిస్తాడు. ఆశక్తి లేక ఆయనను మరచిన మనదే నేరం.ఏవేవో ఇతర సాధనలతో కోరికలు పొందాలను కోవటం మాణిక్యం అని భ్రమించి గాజుపూసను దాచుకోవటమే సుమా!

చేతులారా మ్రొక్కితే చాలు శ్రీ వేంకటేశ్వరుడు రక్షించగలడు. చాంచల్యంతో భ్రమించి ఆయనను పూజించని మనలోనే లోపం కానీ ఇంకేముంది? అది మానివేసి మరేవేవో పుణ్యకార్యాలను చేసినా అడవిగాచిన వెన్నెల వలె నిరుపయోగమై పోతుంది సుమా!

**1-2**

## మున్నుడి

ఏ విధంగా భావించిన ఆవిధంగా కనిపించే వాడే భగవంతుడు. రామదాసు గారికి శ్రీరామచంద్రమూర్తిగా, తుకారాంకి విఠలునిగా, రామకృష్ణ పరమహంసకి కాళీ మాతగా గోచరించినది చరిత్ర చెప్పే సత్యమే. "యద్భావం తద్భవతి" అన్నారు పెద్దలు. అన్నమాచార్యులు వేంకటేశ్వరుని గోపాలబాలునిగా భావించి అతిమధురమైన కీర్తన చెప్పారు. అమృతంజాలు వారే ఆకీర్తన నభూతో నభవిష్యతి.

**ఆ.వె॥ భావయామి వేంకటవిభో! సదా నీవు**
**శరణమీయ వయ్య కరుణ బూని**
**అన్నమయ్య వినిచె నమరమౌ కీర్తన**
**బాలకృష్ణ లీల ప్రస్తుతించి.**

**రాగం : యమన్ కళ్యాణి**

భావయామి గోపాల బాలం మమ
స్సేవితం తత్పదం చింతయేయం సదా ॥భావయమి॥

కటిఘటిత మేఖలా ఖచిత మణిఘంటికా
పటల నినదేన విభ్రాజమానం
కుటిల పదఘటిత సంకుల శింజితే నతం
చటుల నటనా సముజ్జ్వల విలాసం ॥భావయామి॥

నిరతకరకలిత నవనీతం బ్రహ్మాది
సురనికర భావనా శోభితపదం
తిరువేంకటాచల స్థితమనుపమం హరిం
పరమపురుషం గోపాలబాలం ॥భావయామి॥





**భావామృతం :**

నా మనస్సులో గోపాల బాలుడైన చిన్ని కృష్ణునిగా (వేంకటేశుని)నేను అభిప్రాయపడుచున్నాను. అందుచేత ఆ పదములను ఎల్లవేళలా ధ్యానించుటకు కోరుచున్నాను. ఆరాధించుటకు పూనుకొనుచున్నాను.

నడుమునకు బిగించిన మొలత్రాటిలో మణులు, ఘంటలు గుచ్చబడినవి. అవి మనోహరమైన ధ్వనిని చేయు చున్నవి. ఒక పాదం నిలువుగా మరియొక పాదము వంకరగా నిలబడుట చేత కదలి పాదములకు బంధించిన గజ్జెలు ఘల్లు ఘల్లున శబ్దం చేస్తున్నవి. అందుచేత ఆ నటనా విలాసము సముజ్జ్వలమై సమ్మోహనమై విలసిల్లినది.

ఎల్లప్పుడూ చేతిలో వెన్నముద్దతో శోభిల్లే ఆ మనోజ్ఞమూర్తి, బ్రహ్మాది దేవతలు భావనాప్రపంచమున ఆరాధించు పదద్వయం కలిగియున్నాడు. సాటిలేని తిరువేంకటా- చలాధీశుడైన ఆ శ్రీహరియే పరమపురుషుడైన శ్రీకృష్ణ భగవానుడు. ఆయనే ముద్దులొలికే గోపాలబాలుడు.

**1-3**

## మున్నుడి

అచ్చతెలుగు పదాలతో అత్యద్భుతంగా భగవంతుని పది అవతారముల వాడని అన్నమయ్య వర్ణిస్తున్నారు. దైవము ప్రకృతి అయితే దయ్యము వికృతి అని తెలుగు భాష పద విన్యాసం. ఆ కోవలోనే దైవమైన మన వేంకటేశ్వరుని పెద్ద భూతమని వర్ణిస్తున్నారు తాళ్ళపాక 'స్వామి' ఆ భూతం అన్ని భూతాల వంటిది కాదు. పట్టుకొంటే (మనపై దయ కలిగి) ఇక వదలదు. అది పదిరకములైన భూతం అని చలోక్తిగా ఆ'గరుడ వాహనుని వర్ణిస్తున్నారు. ఒకటికి పది సార్లు చదివినా అర్థం కాని అచ్చతెనుగు కీర్తన ఇది.

**కం॥ అచ్చ తెనుంగున జెప్పెను**
**ముచ్చటగా అన్నమయ్య మురహరి రూపుల్**
**మెచ్చిన అవతారములుగ**
**మచ్చుకి మతికెక్కదాయె మాటొకటైనన్.**

**రాగం : వరాళి**

పుడమి నిందరి బట్టె- భూతము కదు
బొడవైన నల్లని - భూతము. ॥పుడమి॥

కినిసి వోడ మిం -గెడి భూతము
పునుక వీపు పెద్ద -భూతము
కనలి కవియు చీ-కటి భూతము
పొనుగు సోమపు-మోము భూతము ॥పుడమి॥

చేట కాళ్ళ మిం-చిన భూతము
పోటు దారల పెద్ద-భూతము
గాటపు జడల బిం-కపు భూతము
జూటరి నల్లము-సుగు భూతము ॥పుడమి॥





కెలసి బిత్తలే తిరి-గేటి భూతము
పొలుపు దాంట్ల పెద్ద-భూతము
బలుపు వేంకటగిరి-పయి భూతము
పులుగు మీది మహా-భూతము ॥పుడమి॥

**భావామృతం :**

ఇది చాల ఎత్తుగా, నల్లగా ఉండే పెద్ద భూతము ఈభూమి మీద, వారూ వీరనే తేడాలేకుండా అందరినీ పట్టుకొన్న భూతము.(సర్వులను అనుగ్రహించు దైవము నల్లగా చాల ఎత్తుగా ఉండే దైవము)

అగ్రహించి ఓడను సైతం మ్రింగగల భూతం ఇది, (మత్స్యావతారంలో పెద్ద తిమింగిలం అయ్యాడా శ్రీహరి). వీపున ఒక ఎముక చిప్ప (పుఱ్ఱె) గల పెద్ద భూతము ఇది, (కూర్మావతారంలో ఎముక డిప్పవున్న తాబేలైన శ్రీహరి). కోపించి వ్యాపించిన చీకటి వంటి (తామసంగల) భూతం ఇది, (నల్లని వరాహ రూపం దాల్చిన ఆగ్రహ రూపుడైన శ్రీహరి). ఇది ఎగసిపడే ప్రతాపము వెదజల్లు ముఖముకల భూతము, (గొప్ప పరాక్రమం ప్రస్ఫుటమయ్యే సింహరూపియైన నరసింహుడు).

చేటలవంటి పెద్ద కాళ్ళు ఉన్న భూతం ఇది, (పాదాలతో మూడు లోకాలను కొలిచిన వామనమూర్తి శ్రీహరి). యుద్ధనిపుణుడైన జగజ్జెట్టి యైన భూతం ఇది, (ఇరవై యొక్క మార్లు యుద్ధంలో రాజుల్ని దునిమిన పరశురాముడు). జడలు కట్టి సంచరించిన ధైర్యశాలి భూతం ఇది,

(వీరుడైన జడధారియైన శ్రీరాముని అవతారం దాల్చిన శ్రీహరి). ఈమాయదారి భూతం నల్లని ముసుగు (దుస్తులు)వేసికొన్నది, (నీలాంబరధారియైన బలరాముడు శ్రీహరియే).

పూని,దిశమొలతో సంచరించే భూతం ఇది, (కావాలని నగ్నముగా సంచరించిన బుద్ధుడైన శ్రీహరి). వడివడిగా అడుగులేయ గల భూతంఇది, (వేగంగా పరిగెత్తు అశ్వము నెక్కిన కల్కిఅవతారుడు). సమున్నతమైన శ్రీవేంకటాద్రిపై నుండే భూతం ఇది, (శ్రీవేంకటాచలపతియైన శ్రీహరి). పక్షి మీద తిరుగాడుచుండు భూతము ఇది. (గరుడవాహనుడైన శ్రీమన్నారాయణుడు ఈ మహానుభావుడు).

**1-4**

## మున్నుడి

సర్వేశ్వర్యుడైన పరమాత్మను నేతచీరలు వీధి వీధికి తిరిగి అమ్ముకొనే వ్యాపారిగా వర్ణించుచున్న అన్నమాచార్యుల వారి చమత్కారం పరిశీలించండి.

పరమాత్మను చేనేత చీరలమ్మే వ్యాపారిగాను, ఆయన భార్య లక్ష్మి బంగారు పూతపూసిన చీరెలను చూపించి లోభపెట్టి వ్యాపారం వృద్ధిచేసే 'భాగస్వామి'గాను వర్ణించుచున్నారు.

ఒకసారి ఆ వ్యాపారి బేరానికి అలవాటు పడితే ఇక జీవులు ఈ మాలసంతలలో తిరుగుతూ కర్మ అనే ధనం ఖర్చుచేస్తూ ఆయన నిర్ణయించిన ధరకే కొనుక్కొంటూ ఆ'బేహారి' వ్యాపారం నిరంతరం కొనసాగేట్లు చేస్తున్నారు.

**ఉ॥ చీరెలు మాలసంతకడ చేసెను బేరము వేంకటేశుడున్**
**మారెను శ్రీరమామణియు మాయలు చేసెడి వాని జోడుగా**
**ఔర! తలంప జాలుదురె! అన్యులు? సాధ్యము అన్నమయ్యకే**
**మీరిన తత్త్వబోధనము మీరలు జూడరెయెంచి చెప్పితిన్**

**రాగం : వరాళి**

వాడల వాడల వెంట- వాడెవో వాడెవో
నీడనుండి చీరలమ్మే-నేత బేహారి ॥వాడల॥

పంచభూతములనెడి - పలువన్నె నూలు
చంచలపు గంజితోడ - చరిసేసి,
కొంచెపు కండెల నూలి - గుణముల నేసి
మంచి మంచి చీరలమ్మే - మారు బేహారి ॥వాడల॥

మటు మాయముల దన - మగువ పసిడి నీరు
చిటిపొటియలుకల - జిలికించగా
కుటిలంపుజేతలు - కుచ్చులుగా గట్టి
పటవాళి చీరెలమ్మే - బలుబేహారి ॥వాడల॥





మచ్చిక జీవులనేటి - మైలసంతలలోన
వెచ్చపు కర్మధనము - విలువచేసి
పచ్చడాలుగా గుట్టి - బలు వేంకటపతి
ఇచ్చకొలదుల నమ్మే- ఇంటి బేహారి ॥వాడల॥

## భావామృతం

అన్ని వాడలలోను, వీధివీధి తిరిగి చీరెలమ్ముకొనే ఆ నేత చీరెల 'బేరగాణ్ణి' చూడండ్రా!

ఆ బేరగాడికి భూమి, గాలి, కాంతి, నీరు, ఆకాశము అనే పంచభూతములే పంచవన్నెల నూలుపోగులు. అవి సదా సంచలనంగల వగుటచే ఆ నూలుపోగుల్ని చాంచల్యం అనే గంజితో గట్టి పరచి, త్రిగుణములు (సత్త్వరజస్తమో గుణములు) అనే కండెలకు చుట్టి వాటితో మంచి మంచి చీరెలు నేసి మారుబేరానికి అమ్ముకోవటం ఆయన అలవాటు.

ఆ బేరగాని ఇల్లాలు మహామాయలమారి. ఆవిడ లేనిపోని చిరుకోపం ప్రదర్శిస్తూ (చిలకరిస్తూ) అందరినీ లోభపరచి కుటిలపు నడతలు కలుగునట్లు చేసి సహకరిస్తుంటే, ఆ వ్యాపారి కుచ్చులు కుచ్చులుగా కట్టి, నిలువు అడ్డము పట్టెలుగల ఆ చీరెలను చమత్కారంగా అమ్మేస్తున్నాడు.

ఇక చూడండి. ఆ బేరగాడి మాయకు అలవాటుపడి మాలసంతలలో తిరుగుతూ జీవులందరూ చేరుతున్నారు. వారి వారి కర్మలు అనే ద్రవ్యాన్ని ఖర్చు చేయిస్తూ ఆ వేంకటేశ్వరుడు అనే ఆ ఇంటింటి బేరగాడు తన ఇచ్చ వచ్చినట్లు అమ్మేస్తున్నాడు. (సర్వ భూతములయందు స్థితుడై అందరినీ మాయలో ముంచే ఆ బేరగాడిని కాదనే శక్తి ఏ ప్రాణికీ లేకుండా పోతోంది)

1-5

## మున్నుడి

గొబ్బిళ్ళు పెట్టి స్త్రీలు బాలికలు నృత్యం చేస్తూ గొబ్బిపాటలు పాడే సంప్రదాయం అనాదిగా తెలుగునాడులో ఉన్నది. అందులో కూడా వేంకటరమణుని శ్రీకృష్ణునిగా భావించి, స్వామి లీలలను గొబ్బిపాటలలో చెప్పటం ఒక్క అన్నమాచార్యుల వారికే సాధ్యమైన సిద్ధి. అద్భుతమైన ఈ కీర్తన చూడండి.

**ఆ.వె॥ గొబ్బిపాటలందు కొలిచెను శ్రీపతిన్**
**అన్నమయ్య పాట అద్భుతంబు**
**కంసవైరి పొగడు కాంతల నృత్యాలు**
**కనుల దోచు సుండి!! కల్లకాదు.**

**రాగం : యదుకుల కాంభోజి**

కొలని దోపరికి గొబ్బిళ్ళో యదు
కులస్వామికిని గొబ్బిళ్ళో ॥కొలను॥

కొండ గొడుగుగా గోవుల గాచిన
కొండాక శిశువుకు గొబ్బిళ్లో
దుండగంపు దైత్యులకెల్లను తల
గుండు గండనికి గొబ్బిళ్లో ॥కొలను॥

పాప విధుల శిశుపాలుని తిట్టుల
కోపగానికిని గొబ్బిళ్ళో
యేపున కంసుని యిదుముల బెట్టిన
గోపబాలునికి గొబ్బిళ్ళో ॥కొలను॥





దండి వైరులను తరిమిన దనుజుల
గుండెదిగులునకు గొబ్బిళ్లో
వెండిపైడియగు వేంకటగిరిపై
కొండలయ్యకును గొబ్బిళ్ళో ॥కొలను॥

**భావామృతం :**

కొలనిలోని దోపిడిదొంగ (చీరలెత్తుకెళ్లి గోపికల మాన చోరునకు) గొబ్బిళ్ళు. యదుకుల సార్వభౌముడు కూడా అయిన స్వామికి గొబ్బిళ్ళు.

కొండ (గోవర్ధనగిరి) గొడుగుగా పట్టి పిడుగుల వర్షపు కుండపోతనుంచి గోవులను (అమాయకులను) రక్షించిన చిన్నారి బాలునికి గొబ్బిళ్ళు. దుర్మార్గులైన రాక్షసాంతకుడైన గండరగండనికి గొబ్బిళ్ళు.

మేనత్త కొడుకైన శిశుపాలుడు పాపవర్తనమున చేయు దూషణముల (సహించి నూరు తిట్ల తరువాత క్రోధియై చక్రంతో తలనరికిన) కోపగానికి గొబ్బిళ్ళు. విజృంభించి కంసుని నానా తిప్పలు బెట్టిన గోపాలబాలునికి గొబ్బిళ్ళు.

ధైర్యముతో శత్రువులను (అసహాయ శూరత్వంతో పగవారిని) వెళ్ళగొట్టిన దనుజుల గుండె గాబరాగానికి (వాళ్ళ గుండెల్లో అలజడి రేపిన వానికి) గొబ్బిళ్ళు స్వర్ణ రజితములకు నెలవైన వేంకటాద్రిపై వెలసిన కొండలరాయడు శ్రీ వేంకటేశ్వరునికి గొబ్బిళ్ళు.

**1-6**

## మున్నుడి

శ్రీకృష్ణపరమాత్మ ప్రోక్తమైన భగవద్గీత యందలి సాంఖ్యయోగమును సరసమైన తెలుగు కీర్తనలో ఇమిడ్చి మధురంగా ఆలపిస్తున్నారు అన్నమాచార్యులవారు. పామరులకు కూడ అర్థమయ్యే పదజాలంతో భగవద్బోధ వివరించటం తాళ్ళపాక ఆచార్యులవారికే సాధ్యం.

**కం॥ ఈ విధి భగవద్గీతను**
**ఏవారికి చేతనౌను ఇటు చెప్పంగన్**
**ఆవల వేంకటపతికిన్**
**సేవగనా అన్నమయ్య చెప్పెను వినుడీ!**

**రాగం : బౌళి**

దేహినిత్యుడు - దేహము లనిత్యాలు
ఈహల నామనసా - యిది మరువకుమీ ॥దేహి॥

గుది పాతచీర మాని-కొత్తచీర గట్టినట్టు
ముదిమేను మాని దేహి-మొగి గొత్తమేను మోచు,
అదన జంపగలేవు -ఆయుధము లీతని
గదిసి యగ్నియు నీరు-గాలియు జంపగలేవు ॥దేహి॥

ఈతడు నరకువడ-డీతడగ్ని గాలడు
ఈతడు నీటమునుగ-డీతడు గాలి బోడు,
చేతనుడై సర్వగతుండౌ-చెలియించదేమిటను
ఈతల ననాదియాత-డిరవు గదలడు ॥దేహి॥





చేరి కానరానివాడు-చింతించరాని వాడు
భారపు వికారాల-బాసిన వాడీ యాత్మ,
అరయ శ్రీవేంకటేశు-నాధీన మీతడని
సారము దెలియుటే-సత్యం జ్ఞానము ॥దేహి॥

**భావామృతం :**

ఆత్మ శాశ్వతమైనది. దాని నివాసమైన శరీరం అశాశ్వతం. కోరికల నెలవైన నామనస్సా! ఈమాట మరువ వద్దు.

మనిషి, కట్టు కొన్న పాతబట్టను వదలి క్రొత్తబట్ట దాల్చినట్టు ముసలి తనువును వదలి వేసి కొంగ్రొత్త తనువును ధరిస్తుంది ఈ ఆత్మ. ఏ ఆయుధమూ దీనిని చంపలేదు, నిప్పుకాల్చలేదు, నీరు తడపలేదు, గాలి ఎండించలేదు, పూని ఊపిరాడకుండా చేసి చంపలేరు ఈ ఆత్మను.

ఈ ఆత్మ ఖండించబడదు,అగ్నిలో దహనం కాదు, జలంలో మునిగిపోదు, గాలికి ఆరిపోదు. చైతన్యం కల ఈ ఆత్మ ప్రతి చోట వ్యాపించి ఉన్నాడు.ఏమైనా చింతించదు.వీడు అనాదియైన వాడు.సనాతనుడైన ఈ ఆత్మ తనచోటు వదలడు.ఉన్న చోటునే ఉంటాడు.

ఈఆత్మ ఇంద్రియములకు వ్యక్తము కాదు. ఇతడు మనస్సు యొక్క భావనకు అందదు.ఆరు రకముల వికారములకు వశ్యుడు కాని వాడు.పరిశీలించగా ఈఆత్మ శ్రీవేంకటేశ్వరుని ఆధీనుడై ఉంటాడనే సారాంశమును గ్రహించుటే నిజమైన జ్ఞానము.

**1-7**

## మున్నుడి

భగవంతుని దయ పొందాలంటే అతి సులభమైన మార్గం శరణాగతి. ఓ వేంకటనాథా! అనాథరక్షకా! శరణు అంటే నాడు గజేంద్రుని, ప్రహ్లాదుని రక్షించినట్లు పరుగు పరుగున వచ్చి రక్షిస్తాడు. ఎంత రమ్యంగా అన్నమాచార్యుల వారు శరణాగతి పాడుతున్నారో చూడండి.

**చం॥ శరణని వేంకటేశ్వరుని సన్నుతి గొల్చెను అన్నమయ్య తాన్**
**పరులకు సాధ్యమౌనె! ఇటు పాడగ వేల్పుల గంటి ముంగిటన్**
**నిరుపమ వైభవం బెసగ నిల్పెను ఈ కృతి జూడరే అహో!!**
**వరమిది జన్మధన్యమగు పాడరె యెల్లరు నాదుతోడుతన్**

**రాగం : జంఝూటి**

శరణు శరణు సురేంద్ర సన్నుత-శరణు శ్రీసతివల్లభా
శరణు రాక్షస గర్వసంహార-శరణు వేంకటనాయకా ॥శరణు॥

కమలధరుడును-కమల మిత్రుడు
కమల శత్రుడు పుత్రుడు,
క్రమముతో మీ కొలువుకిప్పుడు
కాచి నా రెచ్చరికయా ॥శరణు॥

అనిమిషేంద్రులు మునులు దిక్పతు
లమర కిన్నెర సిద్ధులు,
ఘనతతో రంభాది కాంతలు
కాచినా రెచ్చరికయా ॥శరణు॥





ఎన్నగల ప్రహ్లాద ముఖ్యులు
నిన్ను కొలువగ వచ్చిరి
విన్నపము వినవయ్య తిరుపతి
వేంకటాచల నాయకా ॥శరణు॥

**భావామృతం :**

దేవేంద్రునిచే సన్నుతింపబడెడి ఓ శ్రీనాథా! శరణు శరణు. ఓ రాక్షస గర్వనాశకా! శరణు శరణు. ఓ వేంకట నాయకా! శరణు శరణు.

విష్ణుమూర్తి, సూర్యభగవానుడు, చంద్రుడు,కుమారుడైన చతుర్ముఖుడు మీ యొక్క సన్నిధిని వరుసలో నిలిచి రక్షకులవలె హెచ్చరికగానున్నారు.

సురేంద్రుడు, మహర్షులు, దిక్పాలురు, దేవతలు,కిన్నెరులు, సిద్ధులు, ఆడంబరం ప్రదర్శించు రంభాది దేవకాంతలు, మొదలైన వారు వరుసలో హెచ్చరికగానున్నారు.

అగ్రగణ్యులైన ప్రహ్లాదుని వంటి ప్రముఖులు నిన్ను పూజించుటకు వచ్చిరి. ఓ తిరుపతి వేంకటేశ్వరా! మా మొరలను ఆలకింపుము ప్రభూ! శరణు శరణు.

1-8

## మున్నుడి

వైరాగ్యం జొప్పించి అన్నమాచార్యుల వారు సంకీర్తన పాడితే శ్రీ వేంకటేశ్వరుడే చలించి పోయాడేమో అనిపిస్తుంది. మన బోటి సామాన్యులకు హృదయ తంత్రులు తెగిపోతాయేమో అనిపిస్తుంది. క్షణకాలంలో సమాప్తమయ్యే జీవితాన్ని శాశ్వతమని నమ్ముకొని భోగవాంఛతో అంతులేని పాపములను పేర్చుకొంటూ, ఏనాటికీ జీవన గమ్యం తెలియని వారికి, ఇంతకన్నా చెప్పేదేముంది?ఇక ఈరోగానికి మందేముంది?

**కం॥ జరిగింది జరుగనున్నది**
**పరులెరుగరు వేంకటేశు మందొక్కటియే**
**మరులూరు మనసు నణచును**
**వరమై ఆ అన్నమయ్య వైరాగ్యమిడెన్.**

**రాగం : ముఖారి**

వెనకేదో ముందరేదో-వెఱ్ఱినేను నా
మనసు మరులుదేర-మందేదొకో! ॥వెనకేదో॥

చేరి మీదటి జన్మము-సిరులకు నోమేగాని
యే రూపై పుట్టుదునో-యెఱగ నేను,
కోరి నిద్రించ బరచు-కొన నుద్యోగింతు గాని
సారె లేతునో లేవనో-జాడ దెలియ నేను ॥వెనకేదో॥

తెల్లవారినప్పుడెల్లా-తెలిసితిననే గాని
కల్ల యేదో నిజమేదో-కాన నేను,
వల్ల చూచి కామినుల-వలపించే గాని
మొల్లమై నామేను-ముదిసిన దెఱగా ॥వెనకేదో॥





పాపాలు సేసి మఱచి-బ్రదుకుచున్నాద గాని
వైపుగ జిత్రగుప్తుడు-వ్రాయు టెరుగ
ఏపున శ్రీవెంకటేశు-నెక్కడో వెతకే గాని
నా పాలిదైవమని-నన్ను గాచు టెఱగ ॥వెనకేదో॥

**భావామృతం :**

నా జీవనయాత్రలో వెనుక ఏమి జరిగినదో ముందు ముందు ఏమి జరుగనున్నదో మందమతినైన నేనేమి ఎరుగుదును? ఓ చిత్తమా! అనేక విషయాలపై వ్యామోహం పెట్టుకొనే నీ రోగానికి మందు ఏమున్నది?

ముందు రాబోయే జన్మలో సర్వసంపన్నుడ నవాలని ఇప్పుడే ఎన్నో నోములు నోచుచున్నాను. కాని నావెఱ్ఱితనం గురించి ఏమి చెప్పుదును? ఏరూపంతో పుట్టెదనో ఎఱుగను కదా! బాగుగా నిద్రించవలె ననియత్నింతును గాని నిద్రలేచెదనో లేదో నేను ఎరుగను కదా!

ప్రతి దినము తెల్లవారాక నిద్రనుండి లేచి ప్రపంచమును గాంచి నిద్ర పోకమునుపు అనుభవమును తలచుకొని సర్వమూ తెలిసినది అనుకొందును. కాని గాఢనిద్రలో ఈప్రపంచమేమైపోయినదో ఎరుగను. సుషుప్తిలో లోకమే శూన్యమైన ఆ స్థిది నిజమా? లేక మేల్కొన్నప్పుడు, శాశ్వతముగా కనబడుచున్న ఆస్థితి నిజమా? నేను సత్యముల నెరుంగని పిచ్చివాడను. అవకాశమును బట్టి కామాతురలైన స్త్రీలు నాపై వలపులు గొనునట్లు చేయుచున్నారు.కాని నాశరీరము ముదుసలియైనదని గ్రహించ నైతిని కదా!

ప్రతిదినము అనేక పాపముల నొనరించి వాటిని విస్మరించి బ్రతుకుచుంటిని గాని నాపాపముల చిట్టా వ్రాయు చిత్రగుప్తుడు యముని ఆజ్ఞ పైవాటిని లెక్కించుచున్నాడని ఎరుగజాలను కదా! శ్రీవేంకటేశ్వరుడు ఎక్కడో ఉన్నాడని తెలివిమాలి వెదుకుచుంటిని గాని నాపాలిదైవమై నన్ను వెన్నంటే ఉన్నాడని గ్రహించకుంటిని కదా! ఎంత మందమతిని!!

**1-9**

## మున్నుడి

షోడశోపచారములతో అతిధిని దేవునిగా భావించి పూజించాలని పెద్దలు చెబుతారా. కాని ఆ షోడశోపచారములేమిటో చాలమందికి తెలియదు.తెలిసినా సక్రమమైన క్రమంలో తెలియదు. కొంతమంది నాబోటి వాళ్ళకి షోడశ అంటే కూడా తెలీదు. వేంకటేశ్వరునికిచ్చే పదహారు ఉపచారముల వివరం చిత్తగించండి.

**ఆ.వె॥ షోడశోపచార శోభను గాంచుడీ**
**అన్నమయ్య పాట అమరమయ్యె**
**వేంకటేశుగొల్చు విధి అద్భుతము కదా!**
**అమరులైన పాడు నట్టికృతిది.**

**రాగం : లలిత**

షోడశ కళానిధికి షోడశోపచారములు
జాడతోడ నిచ్చలును సమర్పయామి ॥షోడశ॥

అలరు విశ్వాత్మునకు ఆవాహనమిదే సర్వ
నిలయునకు ఆసనము నెమ్మినిదే
అల గంగా జనకునకు అర్ఘ్య పాద్యాచమనాలు
జలధిశాయికి నిమజ్జనమిదే ॥షోడశ॥

వరపీతాంబరునకు వస్త్రాలంకారమిదే
సరి శ్రీమంతునకు భూషణములివే
ధరణీధరునకు గంధవుష్ప ధూపములు
తిరమిదే కోటి సూర్యతేజునకు దీపము ॥షోడశ॥





అమృత మథనునకు నదివో నైవేద్యము
గమిచంద్ర నేత్రునకు కప్పురవిడెము
అమరిన శ్రీవేంకటాద్రి మీది దేవునకు
తమితో బ్రదక్షిణాలు దండములు నివిగో ॥షోడశ॥

**భావామృతం :**

పదునారు కళలతో విరాజిల్లునట్టి స్వామికి పదునారు విధములైన షోడసోపచారములను జ్ఞానపూర్వకంగా నిత్యమూ సమర్పించెదము గాక!

విశ్వమంతయు వ్యాపించియున్న ఆత్మరూపునికి ఇదే ఆవాహనము, చేయుచున్నాను. అన్నిచోట్లలో స్థితుడైయున్న స్వామికి ఆసనముప్రీతితో సమర్పించుచున్నాను. గంగకుజనకుడైన దేవరకు అర్ఘ్యపాద్యములను సమర్పించుచున్నాను. క్షీరసాగరశయనుడైన ఆ శ్రీమహావిష్ణువునకు నేనిదిగో నిమజ్జనము సేయుచున్నాను. (స్నానము చేయించుచున్నాను)

పీతాంబరుడైన విష్ణువునకు వస్త్రములతో అలంకరించెదను.లక్ష్మీకాంతునకు నగలను సమర్పింతును గాక! భూదేవీరమణునకు గంధము, పుష్పములు, సుగంధ దూపములను సమర్పింతును గాక! కోటి సూర్యులప్రకాశము గల స్వామికి నిత్యము దీపమును సమర్పించుచున్నాను.

పాలసముద్రమధనమున అమృతము నిప్పించిన స్వామికి నైవేద్యము నర్పింతును.సూర్యచంద్రులు నేత్రములుగా గల దేవునికి కర్పూరతాంబూలము నిచ్చుచున్నాను. శ్రీవేంకటాద్రిపైవెలసిన జగన్నాధునికి ప్రీతితో ప్రదక్షిణములు,దండములు ఇవిగో, ఇదే చేయుచున్నాను.

## 1-10

## మున్నుడి

అచ్చతెలుగులో పరమాత్ముని అవతారములను ఎన్నోవిధాలుగా వర్ణించారు అన్నమయ్య.ఒక జానపద యువతి తన చిన్నక్కకు 'తన భాష'లో స్వామి అవతారాలను వర్ణిస్తోంది. అబ్బే! తెలుగుపాటలో విశేషించి చెప్పాల్సినంతవుందా అనుకొనే గ్రంధసొంగులకు ఈకీర్తన ఒక కనువిప్పు.మనకు తెలిసింది తక్కువ తెలియాల్సిందెక్కువ అనుకొనే వారికి ఇది నచ్చుతుంది.

**మ॥ భళిరా! జానపదంపు కైత తనదై వర్ణించె నీరీతిగా**
**నళినీకాంతుడు వేంకటేశుడొదగన్ నానా విచిత్రంబులౌ**
**పలురూపంబుల, అన్నమయ్య తెలిపెన్ భావించి ఆ గాథలన్**
**తెలుగే గొప్ప'వెలుంగు' సాటి కలదా! దీనంత తీపెందునన్**

**రాగం : ఆహిరి**

శిఖుత నవ్వుల వాడు శిన్నెకా వీడు
వెఖపెఅగడు సూడవే శిన్నెక్కా ॥శిఖుత॥

పొలుసుమేని వాడు, బోరవీపు వాడు
సెలసు మోరవాడు శిన్నెక్కా
గొలుసుల వంకల కోరలతో బూమి
వెలసినాడు సూడవే శిన్నెక్కా ॥శిఖుత॥

మేటికురచవాడు, మెడమీది గొడ్డలి
సీటకాలవాడు శిన్నెక్కా
ఆటదాని బాసి అడవిలో రాకాశి
వేటలాడే సూడవే శిన్నెక్కా ॥శిఖుత॥





బింకపు మోతల 'పిల్లగోవి' వాడు
సింకసూనుల వాడు శిన్నెక్కా
కొంకక కలికియై కొసరి కూడె నన్ను
వేంకటేశుడే సూడవే శిన్నెక్కా ॥శిఖుత॥

**భావామృతం :**

ఓచిన్నక్కయ్యా! ఈపిల్లవాడు మొలక నవ్వులవాడు.భయమంటే తెలియని వీనిని చూడవే చిన్నక్కా!

వీడు పొలుసులు పొలుసులన్న శరీరం కలవాడు (మత్స్యావతారం లో స్వామి ఒంటి నిండా పొలుసులే కదా!) బోరవీపువాడు అనగా పెద్ద వీపు వున్నవాడు (కూర్మావతారంలో మంధర పర్వతాన్ని మోయజాలిన పెద్ద వీపు వున్న వాడు). ఘనమైన ముట్టెపై భూమిని మోయ గలిగినవాడు, అనగా భూభారాన్ని వహించేవాడు (వరాహావతారంలో భూమండలాన్ని తన మూతిపై నిలిపిన వాడు), వంకరలు దిరిగిన సుదీర్ఘమైన కేసరములు గలిగి అవని నవతరించాడు(నరసింహా స్వరూపంతో వెలసిన స్వామి).

ఓచిన్నక్కయా! ఇతగానిని పరికించవే. అతి పొట్టివాడైనా గట్టివాడు అనిపించుకొన్న వామనుడు(త్రివిక్రమావతారంలో పాదములతో త్రిభువనాలు కొలిచి దానంగా గ్రహించిన వామనుడు), మెడమీద గొడ్డలి వాడు(పరశు రామావతారంలో గండ్ర గొడ్డలి దాల్చి శత్రుసంహారం చేసినవాడు). సీటకాలవాడు అనగా నాగటి చాలులో యమునా నదిని తెప్పించి యమునా నదిలో హస్తినాపురాన్ని ముంచేస్తానన్న బలరాముడు. అడవిలో రాక్షసుని వల్ల భార్యని పోగొట్టుకొని వానిని వేటాడి చంపినవాడు (శ్రీరాముడు) చిన్నక్కా వీనిని ఒకపరి తిలకింపుము.

గొప్పధ్వని చేయు పిల్లనగ్రోవి (మురళి) కలవాడు (శ్రీకృష్ణుని అవతారంలో వేణుగానంతో అడవిని మారుమ్రోగించిన వాడు),దయ కురిపించుచూపులు కల బుద్ధుడు (తథాగతుడై దయావృష్టి వాడు) వెనుకంజ వేయని కల్కిరూపుడు అయిన వాడు. వీడు మరీమరీ నాదగ్గర అయిన వాడు. ఇటువంటి ఈ శ్రీవేంకటేశ్వరుని చూడవే చిన్నిక్కా!

**1-11**

## మున్నుడి

సుప్రసిద్ధమైన నవరత్నాలతో శ్రీ వేంకటేశ్వరుని పోల్చి యశోదా నందనునిగా కీర్తించుట అన్నమాచార్యుల వారి కొక్కరికే సాధ్యమయ్యింది. గభాలున ఎవరన్నా నవరత్నాలేమిటంటే ఎంతమంది చెప్పగలరు? నిజంగా చాల తక్కువమంది. మరి ఈకీర్తన వచ్చిన వాళ్ళు తడుముకోకుండా చెప్పగలరు. ముద్దుగారే యశోద ముంగిట ముత్యము అంటే, ముద్దులొలికేది యశోద అనుకొనే "మహానుభావులు" కూడా ఉన్నారండీ......నిజంగా....

**కం॥ నవరత్నంబులు యేమని**
**వివరంబులు తెలియకున్న వింతగునటరా!!**
**అవలీల పొగడి రమణుని**
**కవితన్ ఆ అన్నమయ్య గణనముదెలిపెన్.**

**రాగం : కురంజి**

ముద్దుగారే యశోద ముంగిటి ముత్యము వీడు
దిద్దరాని మహిమల దేవకీసుతుడు. ॥ముద్దు॥

అంత నింత గొల్లతల అరచేతి మాణికము
పంతమాడే కంసుని పాలి వజ్రము
కాంతుల మూడు లోకాల గరుడపచ్చ పూస
చెంతల మాలోనున్న చిన్నికృష్ణుడు ॥ముద్దు॥

రతికేళి రుక్మిణికి రంగుమోవి పగడము
మితి గోవర్ధనపు గోమేధికము
సతమై శంఖచక్రాల సందుల వైడూర్యము
గతియై మమ్ము గాచే కమలాక్షుడు ॥ముద్దు॥





కాళింగుని తలలపై కప్పిన పుష్యరాగము
ఏలేటి శ్రీవేంకటాద్రి యింద్రనీలము
పాల జలనిధిలోన పాయని దివ్యరత్నము
బాలుని వలె తిరిగీ పద్మనాభుడు ॥ముద్దు॥

**భావామృతం :**

యశోదాదేవి ముంగిట (ముందింటియందు) ముద్దు మూటగట్టే ముత్యం ఈ మనోహరుడైన శిశువు.మరి ఇతడే అనుకరించలేని మహిమలు చూపిన దేవకీ నందనుడు కూడా.

అట్లాంటిట్లాంటి వాళ్ళు కాని గోపికలకు అరచేతిలో నున్న మాణిక్యము, పగబట్టిన కంసుని పాలిటి కఠినమైన వజ్రము. ముల్లోకాలను మెరిపింప జాలిన మరకతము కూడా వీడే. ఈ చిన్నారి కృష్ణుడు మా చెంతనే మా హృదయంలోనే ఉన్నాడు.

ఇతడే శృంగార క్రీడలో రుక్మిణీదేవి అరుణాధరములకు పగడము వలె నున్నాడు. బహుదొడ్డ గోవర్ధన గిరిపై విరివిగా లభించే గోమేధికము కూడా వీడే. శంఖ చక్రముల మధ్య దీప్తించు వైఢూర్యం ఈ స్వామే. వనజనేత్రుడైన ఈ ఆదిదేవుడే గతియై మమ్మల్ని రక్షించుచున్నాడు.

ఇతగాడే కాళీయుని పడగల నాక్రమించి నర్తించిన పుష్యరాగము. ఈయనే శ్రీవేంకటాద్రిపై నున్న ఏలికయైన వేంకటేశ్వరుడను ఇంద్రనీలమణి. క్షీరాబ్ధిశయనుడైన ఎడబాయని దివ్యమైన రత్నము ఈ జగన్నాధుడే. బాలుని వలె, తిరుగుచున్న ఈ మహానుభావుడు నిజముగా పద్మనాభుడైన శ్రీహరియే.

**1-12**

## మున్నుడి

సుప్రసిద్ధమైన సుప్రభాత గీతిక నిపుడు ఆస్వాదిద్దాం. ఇంత అద్భుతంగా కనులకు గట్టినట్లు వేంకటరమణుని మేలుకొలుపు పాడటం అన్నమాచార్యులవారి కొక్కరికే సాధ్యం. జగద్విఖ్యాతమైన కీర్తన అయినా నిత్యనూతనమై సదా ముక్తిప్రదమైన స్వామిసేవ ఇది. దీనిగొప్పతనం నేను వర్ణించగలనా? మీరే గమనించండి.

**చం॥ తెలతెలవారువేళ చని, దేవతలందరు నింగి దీరుచున్**
**సలిపిరి సుప్రభాతమను చక్కటి సేవను వేంకటయ్యకున్**
**కొలిచెను అన్నమయ్య తనుగ్రొత్తదనంబులు జాలువారగా**
**'తులన' లభించునా!! హరికి 'దోమతెరేమిటి!'ఏమిచోద్యమో!**

**రాగం : భూపాళ**

విన్నపాలు వినవలె వింతవింతలు
పన్నగపు దోమతెర పైకెత్తవేలయ్యా ॥విన్నపాలు॥

తెల్లవారె జామెక్కె దేవతలు మునులు
అల్లనల్ల నంతనింత నదివో వారే
చల్లని తమ్మిరేకుల సారసపు గనులు
మెల్లమెల్లన విచ్చి మేలుకో వేలయ్యా ॥విన్నపాలు॥

గరుడ కిన్నెర యక్ష కామినులు గములై
విరహపు గీతముల వింత తాళాల
పరిపరి విధముల బాడేరు నిన్నదివో
సిరిమొగము దెరచి చిత్తగించవేలయ్యా ॥విన్నపాలు॥





పొంకపు శేషాదులు తుంబుర నారదాదులు
పంకజభవాదులు నీ పాదాలు చేరి
అంకెలనున్నారు లేచి అలమేలుమంగను
వేంకటేశుడా రెప్పలు విచ్చి చూచిలేవయ్యా ॥విన్నపాలు॥

**భావామృతం :**

మా అందరి అభ్యర్థనల నాలకించాలి, ఎన్నో విశేషాలు వింతలూ వినాలి. ప్రభూ! ఆదిశేషుడనే ఆ దోమతెరను పైకెత్తవేమి? స్వామీ!

ఓ మహానుభావా! తెల్లవారి పోయింది, జాము పొద్దెక్కింది. దేవతలు, ఋషులు ఎక్కడెక్కడ నుంచో వస్తున్నవారు అదిగో గమనించు. చల్లని పద్మపత్రములవంటి నేత్రములను మెల్లమెల్లగా తెఱచి ఎందుకు మేలుకొనవు? వారినొకసారి చూడవేమయ్యా!

గరుత్మంతుడు, కిన్నరులు, యక్షులు, కామినులు ఆకాశవీధిలో నిలచి విరహగీతములను, విచిత్రమైన తాళములతో రకరకములుగా నీకోసం పాడుతున్నారు. మంగళకరమైన నీ వదనము జూపించి వాటిని స్వీకరించాలి. ఎందుకు జాగు ప్రభూ!

శ్రద్ధతో నిలిచిన ఆదిశేషుడు, తుంబుర, నారదులు బ్రహ్మాది ప్రముఖులు నీ చరణముల కడ జేరారు. వారంతా వినమ్రులై నీ ఆధీనంలో నిన్ను కీర్తించుచున్నారు. నీ దేవేరి అలిమేలు మంగమ్మ కూడ నీకోసం ఎదురుతెన్నులు చూస్తోంది. ఓ వేంకటరమణుడా! నీ కనురెప్పలు విప్పి అందరిని తిలకించి లేచిరా తండ్రీ!

## 1-13

### మున్నుడి

అరిషడ్వర్గాలకు లొంగి పరనిందచేస్తారు మానవ మాత్రులు. వెల్లిపాయ తిన్న నోటికంపు వెంటనే బయటపడి తిట్టు వారిపై చులకన భావం కలిగిస్తుంది. మత్సరంతో కొంతమంది కుకవులు ఆనాడు దేవుడి పేరు చెప్పి పచ్చి బూతులు వ్రాస్తున్నాడని, అన్నమాచార్యుని నిందించారు. నానా రభసా చేశారు. కానీ ఆ కీర్తనలలోని మాధుర్యం చేత ఆకర్షింపబడి రహస్యంగా వారూ అన్నమయ్యను అనుకరించారు. 'చెప్పేవి శ్రీరంగ నీతులు దూరేవి దొమ్మరి గుడిసెలు' అనే తీరున వ్యవహరించిన వారిని పదకవితాపితామహుడు ఏమని అంటున్నారో చూడండి ఈకీర్తనలో.

**శా॥ స్వంతంబైన కవిత్వధార చెలగన్ సాధించి సత్కీర్తనల్**
**ఎంతో జాను తెలుంగునందు పలికెన్ ఈఅన్నమాచార్యుడున్**
**అంతా వేంకటనాధు సత్కృపగుతన్నానాడు నిందించుచున్**
**పంతంబూని "నకళ్ళు" చేయ కుకవుల్ వారందరిన్ దిట్టెబో.**

**రాగం : రామక్రియ**

వెఱ్ఱులాల మీకు-వేడుక గలితేను
అఱ్ఱువంచి తడు-కల్లంగ రాదా ॥వెఱ్ఱులాల॥

ముడిచివేసిన పువ్వు-ముడువ యోగ్యము గాదు
కుడిచి వేసిన పుల్లె-కుడువగా గాదు
బడి నొకరు చెప్పిన-బ్రతి చెప్ప బోతేను
అదరి శ్రీహరి కది-అరుహము గాదు ॥వెఱ్ఱులాల॥

గంపెడుముక దిన-గా నొక్క వరిగింజ
తెంపున గలసితే-తెలియనెట్టు వచ్చు
జంపుల బలవరించగ-నొక మంచిమాట
ఇంపైతే హరియందు-కిచ్చునా వరము ॥వెఱ్ఱులాల॥





ఉమిసిన తమ్మలో-నొక కొంత కప్రము
సమకూర్చివగొని-చప్పరించనేల
అమరగ ఛాయాప-హారము సేసుక
తమమాట గూర్చితే-దైవము నగడా ॥వెఱ్ఱులాల॥

చిబికి వేసిన గింజ-చేత బట్టగనేల
గబుక కెంగిలి బూరె-గడుగగ మరి యేల
తొబుక కవిత్వాల-దోషాల బొరలితే
దిబుకార నవ్వడా-దేవుడైనాను ॥వెఱ్ఱులాల॥

మించు చద్దికూటి-మీద నుమిసినట్టు
మంచి దొకటి చెప్పి-మరి చెప్ప నేరక
కంచు బెంచు నొక్క-గతి నదికితే ముట్టు
పెంచువలెనే చూచు-పెరుమాళ్ళు వాని ॥వెఱులాల॥

పుచ్చినట్టి పండు-బూజిలోననె వుండు
బచ్చన కవితలు-బాతిగావు యెందు
ముచ్చు గన్నతల్లి-మూల కొదిగినట్లు
ముచ్చిమి నుతులేల-మొక్కరో హరికి ॥వెఱ్ఱులాల॥

ఉల్లి దిన్న కోమ- టూరక వున్నట్లు
జల్లెడ నావాలు-జారిపోయినట్లు,
కల్లలు చెప్పియా-కథకుత్తరము లీక
మెల్లనే వుండితే-మెచ్చునా దైవము ॥వెఱ్ఱులాల॥

నేతి బీరకాయ-నేయి అందు లేదు
రాతి వీరునికి బీ-రము యించుకా లేదు
ఘూత బూరుగు బండు-కడుపులోన దూది
యేతుల నుడుగులు-యెక్కునా హరికి ॥వెఱ్ఱులాల॥

ఇరుగు వారెరగరు-పొరుగువా రెరగరు
గొరబైన మాటలు-గొణగుచు నుందురు
పరులగా దందురు-బాతిగారు తాము
విరసు లట్టివారి-విడుచు దేవుడు ॥వెఱ్ఱులాల॥

ఎన్నగ శ్రీవేంక-టేశు దాళ్ళపాక
అన్నమాచార్యులు-అఖిల దిక్కులు మెచ్చ
నున్నతితో బాడి-రొకడెవ్వడో తాను
సన్న నొరసునట-సమ్మతా హరికి ॥వెఱ్ఱులాల॥

**భావామృతం :**

ఓ వెఱ్ఱి కవులార! మీకంత సరదాగా వుంటే మెడవంచి (మీకుతగినట్లు) తడిక అల్లుకో రాదా? (ఇంకొకళ్ళని అనుకరించుట దేనికి?)

ఒకళ్ళు తలలో పెట్టుకొని పారవేసిన పూవునింకొకరు తలదాల్తురా? ఒకరు తిన్నవిస్తరిలో ఇంకొకరు భుజింతురా? ఒకరు ఒక పద్ధతిలో శ్రీహరిపై కవిత్వం చెప్పితే వేరొకరు అదే పదములతోనో లేక కొన్ని స్వంతకవిత్వంగా కలబొసి(అంతా తమ స్వంత రచనవలె) చెప్పిన, ఆ దేవున కట్టి కవిత నచ్చుతుందా? ఎంత మాత్రం నచ్చదు.

ఒకడు గంపెడు ఊక (పొట్టు) తింటే అందులో ఎక్కడో ఒక్క బియ్యపు గింజ ఉంటే ఉండవచ్చు గాక. నిడివిగా ఏవేవో కవితలు చెబితే అందులో ఒకా నొకటి సరియైనదుండ వచ్చును గాక! అంత మాత్రాన అన్నీ ఇంపుగా వుంటాయని ఆ దైవమను కొంటాడా?ఆయన కసలు సంగతి తెలియదా?

ఒకరు నమిలి ఊసిన తాంబూలములోని కర్పూరము మిగిలిపోయి అది రుచిగా వుండునేమో? దాని నింకొకడు పరిమళం కోసం తినుట దేనికి? ఒకని కవితా ఛాయల నింకొకరు అనుకరించి కొంత తమ మాటలు చేర్చి కవిత్వం చేబితే ఆ దైవం పరిహసించడా?





ఒకడు చప్పరించి పారవేసిన గింజను ఇంకొకడు నములుట తగునా? ఒకడు ఎంగిలి చేసిన బూరెనింకొకడు కబళించుట యుచితమా? నిస్సారమైన కవితలలోని దోషములను జూచి ఆ దైవం కూడా విరగబడి నవ్వుకొంటాడు.

చద్దికూటిని నిరసించమని శాస్త్రం చెబుతున్నది. అట్లాఏదో ఒక్క మంచిమాట చెప్పితరువాత ఏమి చెప్పలేక "కంచు, పెంకు" ఒక్కటిగా అతికినట్లు అతుకులబొంతలాంటి కవిత్వం అల్లేవానిని ఆ భగవంతుడు, ముట్టుపెంకుని అస్పృశ్యంగా చూచినట్లు చూస్తాడు.అనగా ఆ స్వామి అటువంటి కవిత్వాన్ని స్వీకరించడని భావము.

ఉల్లిపాయను తినిన 'కోమటి' తను మాట్లాడితే ఉల్లి కంపుకొడుతుందని మౌనంగా వుంటాడు. జల్లెడలో పోసిన ఆవాలు నిలవకుండా జారిపోతాయి. అట్లాగే ఏదో కల్లబొల్లి కవితలు చెప్పినవాడు.దానిపై ఎవరన్నా పండితులు ప్రశ్నిస్తే తగిన సమాధానం చెప్పలేడు. వాడు మౌనవ్రతం పట్టి తీరుతాడు. అటువంటి వానిని ఆ దైవం మెచ్చునా?

నేతి బీరకాయలో నెయ్యి ఉంటుందా ఎక్కడైనా? రాతితో చేసిన వీరుడు బొమ్మే కాని పరాక్రమించగలడా? బూరుగు పండులో దూదియేగాని ఆస్వాదించటాని కేమన్నా వుంటుందా? అట్లే నిడుపులైన పటాటోపం మాటలు సారహీనమైనవి,గాన అట్టివారి మాటలు హరికి రుచించవు.

మీరు చెప్పుమాటలు ఇరుగువారికి తెలియవు, పొరుగువారికి తెలియవు. మీరేవేవో వికృతమైన పలుకులను గొణుగుచుందురు.అంతేగాక ఇతరులను ఏహ్యాభావముతో జూచెదరు.లోకములను భ్రాంతి పరచగల శక్తి మీలో లేదు.మీవంటి విరసులను ఆ దేవుడు స్వీకరింపడు.

తాళ్ళపాక అన్నమాచార్యులు శ్రీవేంకటేశ్వరుని దిక్కులన్నియు మెచ్చువిధమున అత్యున్నతముగా కీర్తించెను. ఎవడో అనామకుడు పైపై మాటలతో ఆయనతో రీకొంటాడట! అది ఆ జగన్నాధునికి సమ్మతమగునా?

## మున్నుడి

గోపికలంతా కలిసికట్టుగా వచ్చి కృష్ణయ్య ఆగడాలను కొసరి కొసరి వినిపించారు, యశోదమ్మకు. ఒళ్ళుమండి యశోద ఎదురుదాడికి దిగింది.ఏవమ్మా మీరు పిల్లల్ని కనలేదా, పెంచలేదా? పిల్లలు అల్లరి చేయకపోతే ఎవరు చేస్తారు? చాల్చాల్లే మాలావు చెప్పొచ్చారు.ఎందుకు కళ్ళల్లో నిప్పులు పోసుకొంటారు?నాసంగత్తెలీదు జాగ్రత్త! అన్నట్లు మరీ దబాయించింది. ఆ వైనం అన్నమయ్య ఎంత అద్భుతంగా వర్ణిస్తున్నారో చూడండి.

**కం॥ పిల్లల్ని కనని గొడ్డులె?**
**నల్లని మా చిన్నవాణ్ణి నానా విధులన్**
**చెల్లని చాడీ చెబుదురు!**
**అల్లననా అన్నమయ్య అందించె కృతిన్**

**రాగం: శుద్ధదేశి**

కానరటే పెంచరటే కటకటా బిడ్డలను
నేను మీవలెనే కంటి నెయ్యమైన బిడ్డను. ॥కానరటే॥

బాయిట పారవేసిన పాలు వెన్నలను
చేయివెట్ట కుందురా చిన్నిబిడ్డలు
మీ యింఢ్ల జతనాలు మీరుసేసికొనక
పాయక దూరేరు ప్రతిలేని బిడ్డను ॥కానరటే॥

మూసిన కాగుల నేయీ ముంగిటి పెరుగులూ
ఆసపడకుందురా ఆడేబిడ్డలు
వోసరించి మోసపోకవుండలేకమీరు
సేసేరింతేసి దూరు చెప్పరాని బిడ్డను ॥కానరటే॥





చొక్కమైన కొప్పెరల జున్నులు జిన్నులును
చిక్కిన విడుతురా చిన్నిబిడ్డలు
మిక్కిలి పూజలు సేసి మెచ్చించ దగదా
యెక్కువైనతిరు వేంకటేశుడైన బిడ్డని ॥కానరటే॥

**భావామృతం :**

అయ్యయ్యో! మీరెవ్వరూ పిల్లల్ని కనలేదటే! బిడ్డల్ని పెంచలేదటే! నేను కూడా మీలాగానే మంచి బిడ్డనే కన్నానే! (ఏమను కొన్నారో మరి) (ఎంతనంగ నాచులే!)

మీరు పాలు, వెన్న బయట పారవేసుకొంటే చిన్నపిల్లలు ఎక్కడన్నా చేయి పెట్టుకుండా వుంటారటే? మీమీ ఇళ్ళల్లో మీకు తగ్గ ప్రయత్నాలు మీరు చేసికొనక నాబిడ్డని తిడతారేమిటే? వాడు సాటిలేని బిడ్డ.(ఎంత ఓర్వలేని వారే మీరు!!)

మూసిన కాగుల్లో దాచిన నెయ్యి, ముందు కనబడే పెరుగూ వుంటే ఆడుకొనే పిల్లలు వాటి కోసం ఆశపడకుండా ఉంటారంటే? జాగ్రత్త పడి మోసపోకవుండాలి గానీ, ఇంతింత నిందలు వేస్తారటే? చెప్పరాని బిడ్డ పుట్టాడు నాకు. (ఎంత కుళ్ళుమోతులే!)

ఏ మాత్రము దోషములేని వెడల్పున పాత్రలలో జున్నులను, సులువుగా చిక్కినచో పిల్లలు విడిచిపెడతారటే? అందరి కంటే శ్రేష్ఠుడైన తిరువేంకటాచలపతియైన ఈబిడ్డని ఎన్నో గొప్ప పూజలు చేసి మెప్పించాలని తెలియదటే?

**1-15**

## మున్నుడి

వేంకటేశ్వరుని దేవేరియైన అలిమేలుమంగ సర్వసులక్షణశోభిత. వధువ జాతకచక్రం వేయునప్పుడు ఏయే గ్రహాలు ఏయేరాసుల్లో ఉచ్ఛస్థితిలో వున్నాయో చూస్తారు దైవజ్ఞులు. మేషం,వృషభం మొదలై ఆ రాశుల సంఖ్య పన్నెండు. ఈ వధువు రాశిచక్రం ఎంత సొగసుగా వివరిస్తున్నారో చూడండి అన్నమాచార్యులవారు. ఇటువంటి కీర్తనలు 'నభూతో నభవిష్యతి' అంటే ఏమాత్రం తప్పులేదు. నిఘంటువు సాయంతో కూడా అన్నమయ్యను పూర్తిగా అవగాహన చేసికొనుట అసాధ్యం.

**ఉ॥ రాసులప్రోవుగా హరికి రాణిని జెప్పెను అన్నమయ్య ఈ**
**వాసిని గొన్న కీర్తనను భక్తులకిచ్చెను, అందచందముల్**
**రాసిగగొన్న మంగను'విరాజిలజేసెను,వేంకటేశుకున్**
**చేసె నెవండు సన్నుతిని జెప్పిరె యివ్విధి విశ్వమంతటన్**

**రాగం : శుద్ధ రామక్రియ**

ఇన్ని రాసుల యునికి యింతి చెలువపు రాశి
కన్నె నీరాశి కూటమి గలిగిన రాశి ॥ఇన్ని॥

కలికి బొమవిండ్లు గల కాంతకును ధనురాశి
మెలయు మీనాక్షికిని మీనరాశి
కులుకు కుచకుంభముల కొమ్మకును కుంభరాశి
చెలగు హరిమధ్యకును సింహరాశి ॥ఇన్ని॥

చిన్ని మకరాంకపు బయ్యెద చేడెకు మకరరాశి
కన్నెప్రాయపు సతికి కన్నెరాశి
వన్నెమైపైడి తులదూగు వనితకు తులారాశి
తిన్నని వాడి గోళ్ళసతికి వృశ్చికరాశి ॥ఇన్ని॥





ఆముకొను నొరపుల మెరయు నతివకు వృషభరాశి
గామిడి గుట్టు మాటలసతికి కర్కాటకరాశి
కోమలపు చిగురు మోవి కోమలికి మేషరాశి
ప్రేమ వేంకటపతి గలసే ప్రియ మిధునరాశి ॥ఇన్ని॥

**భావామృతం :**

ఇన్నిరాసులు నెలకొనియున్న ఈభామిని సౌందర్య రాశి. ఈరాసులన్నీ గుంపుగా ఒక్క చోటు రాశిగా గల ఈమె విష్ణుప్రియయైన అలివేలు మంగ.

ఈమె కనుబొమలు ధనస్సు(విల్లు)వలెయుండి ఈమె ధనుర్ రాశికి చెందిన కన్య అని చెప్పకనే చెబుతున్నాయి. మీనముల (చేపల) వంటి నేత్రములు ఈమె మీనరాశికి చెందినదని తెలుపుతున్నాయి.కులుకులొలుకు ఈకోమలి కుచకుంభములు ఈమె కుంభరాశి చిన్నది అని చెబుతున్నాయి. ఉత్సాహము రూపుదాల్చిన ఈ మృగరాజమధ్యమ (సింహము నడుము వంటి సన్నని నడుము గల ఈమె) సింహరాశికి చెందిన వధువు.

మన్మధుని జెండాలో మకరం (మొసలి) చిత్తరువు వుంటుంది.అది రెపరెపలాడి ప్రేమికులకు మరులు కొల్పుతుంది. ఆ జెండావలె రెపరెపలాడు పైటగల ఈ సుందరి తప్పక మకరరాశికి చెందినదై యుంటుంది. కన్నెప్రాయపు ఈ రమణికి కన్యారాశి లక్షణాలున్నాయి. బంగారు రంగుతో తులతూగు. ఈ దేవిది తులారాశి అనిపించుచున్నది. వంకరలు లేని గుచ్చుకొనువాడి గోళ్లుగల ఈ వయ్యారి వృశ్చికరాశికి చెందినది.

శృంగార క్రీడలో కమ్ముకొని ఆక్రమించు తాపముగల ఈమె వృషభరాశి యువతి అని తెలియుచున్నది. కోర్కెతో గోప్యంగా మాటలాడు ఈ సతిది కర్కాటకరాశి. కోమలమైన పల్లవాధరములుగల ఈ కోమలి మేషరాశి (గొర్రెపిల్ల చాలా కోమలంగా వుంటుంది). ప్రేమతో తనప్రియుడైన వేంకటేశ్వరుని పెనచిన ఈ అలిమేలు మంగమ్మది మిధునరాశి అయివుండవలెను.

## మున్నుడి 1-16

ఇద్దరు అత్తాకోడళ్లు తగవులేసుకొని మాటా మాటా అనుకొని పోట్లాడు కొంటున్నారు. నీవు సిగ్గులేనిదానివంటే నీవు బరితెగించినదానివనుకున్నారు. బొడ్డులోంచి పుట్టిన నా పిల్లవాడికి వ్యవసాయంలో సాయం అవుతావని నిన్ను తెచ్చుకొన్నామే అని అత్త అన్నది. (అప్పుడు మనకు కొంత అనుమానం వస్తుంది). సరేలే చేనుపైనున్న కోనేటిరాయుడైన మా మామగారిని నిరోధించు కొన్నావు కదా! అత్తయ్యా! అని ముక్తాయింపునిచ్చింది కోడలు. ఇంతకీ అత్తాకోడళ్ళెవరు? ఆ పోట్లాడ అర్థం ఏమిటి? అన్నమాచార్యులవారు అంత తేలికగా దొరుకుతారా? ఒకటికి పదిసార్లు చదవండి. ఆలోచించండి మరి.. కోనేటి రాయుడన్నా కూడా వెలగలేదా?)

**తే॥ అత్తనెదిరించె కోడలు అదుపు లేక,**
**కోడలిని దిట్టెనత్తమ్మ కోపమూని**
**అన్నమయ్య కీర్తన కదు అద్భుతంబు**
**బాగు! కోనేటిరాయుడే పరవశించు**

**రాగం : పాడి**

రావే కోడల రట్టడి కోడల
పోవే పోవే అత్తయ్యా పొందులు నీతో జాలును ॥రావే కోడల॥

రంకెలు వేయుచు రాజులెదుట నీవు
కొంకు గొసరులేని కోడల
పంకజముఖి నీవు పలుదొడ్డవారిండ్ల
అంకెల దిరిగేవు అత్తయ్యా ॥రావే కోడల॥

ఈడాడ నలుగురూ నేగురు మొగలతో
కూడి సిగ్గులేని కోడల
వాడకు బదుగురి వలపించుకొని నీవు
ఆడాడ దిరిగేవు అత్తయ్యా ॥రావే కోడల॥

బొడ్డున బుట్టిన పూపనికే నిన్ను
గొడ్డేరు తెస్తినె కోడల
గుడ్డము పయినున్న కోనేటిరాయుని
నడ్డగించుకొంటి వత్తయ్యా ॥రావే కోడల॥





**భావామృతం :**

కోడలా! ఓ జగడాల మారికోడలా! ఇటురావే.
ఓ అత్తయ్యా! నీతో స్నేహాలు చాల్చాల్లే పోపో!

ఓసి కోడలా! ఏలుబడి చేసే ప్రతివాడి యెదుట జంకుగొంకులేక రంకెలు పెట్టి మరీ నీనైపుణ్యం ప్రదర్శిస్తావు కదటే!! (కవితా గోష్ఠిలో కవులు తమ కవితావాణిని అరుస్తూ చదువుతారు కదా! అందుకని అత్తగారైన లక్ష్మీదేవి తన కోడలైన సరస్వతిని ఆక్షేపిస్తున్నది)

బురదలోపుట్టిన మొగమున్నదానివి (లక్ష్మీదేవి పంకజముఖి) నీవు ఎంతోమంది పెద్దోళ్లు ఇళ్ళల్లో లెక్క ప్రకారం తిరగటం లేదా అత్తయ్యా! (ధనికుడైన ప్రతివాడింట్లో పద్దు పుస్తకాల సంఖ్యలలో లక్ష్మీదేవి తిరుగుతూనే వుంటుంది కదా!)

ఇక్కడా అక్కడా అనిగాక నలుగురైదుగురు మొగవాళ్లతో కలిసి సిగ్గుయెగ్గులేకుండా నీ తెలివితేటలు ప్రదర్శిస్తావు కదటే కోడలా? (ఇక్కడా అక్కడా అనిలేక నలుగురైదుగురు వున్న ప్రతి విద్వద్గోష్ఠిలోను పండితులు సిగ్గుపడకుండా శృంగార కావ్యాలను చదువుతారు కదా! ఆ మాట దెప్పిపొడుస్తోంది లక్ష్మీదేవి) (మహా చెప్పొచ్చావులే అత్తయ్యా! నీ సంగతెవరికి తెలియదు?) ఒక్కొక్కవాడకు పదిమంది చేతవలపింపజేసుకొని ఓ అత్తయ్యా! అక్కడా ఇక్కడా అడ్డమైన తిరుగుళ్లు తిరిగి వస్తావు. అని మాటకు మాట అంటించింది చదువుల దేవియైన కోడలు. (ప్రతివాడలోను ప్రతి ధనికుడి ఇంట మహావ్యామోహంతో వాడి చేతుల్లో ధనలక్ష్మి నలిగిపోతోందని గర్హిస్తున్నాడు అన్నమయ్య)

ఓ వగలమారి కోడలా! నిన్ను బొడ్డులోంచి పుట్టిన మా పాపడికిచ్చి, వ్యవసాయం చేస్తావని తెచ్చుకొన్నాం. (పద్మనాభుని నాభికమలంలోంచి పుట్టిన బ్రహ్మకు భార్యగా సరస్వతీదేవి నెంపికచేసి మరీ తెచ్చుకొన్నారు లక్ష్మీనారాయణులు. మీరు సృష్టి చేసి జ్ఞానమిచ్చి జీవకోటిని పెంపొందించాలని బోధించారు). ఆ మాట అట్లుంచి ఓ అత్తయ్యా! కోనేటిరాయడైన మా మామగారిని చేనుపైనున్న వారిని నిరోధించి నీ వశం చేసికొన్నావు కదా! (ఇక నీకు అడ్డమేముంటుంది ఈ ప్రపంచంలో) అంటే వేంకటరమణుని ఇల్లాలిదే ఈ జగత్తులో పైచెయ్యి అని చెప్పకనే చెబుతోంది,. అత్తగారు శ్రీమహాలక్ష్మి కోడలు భారతి. (అన్నమయ్య అద్భుత కీర్తన నాసాధ్యమైనట్లు విపులీకరించగలగటం నా అదృష్టం)

**1-17**

## మున్నుడి

అంతా అర్థమయినట్లే వుండి ఏమీ అర్థంకాని అద్భుతమైన శృంగార కీర్తన ఇది. అన్నమయ్య వాడిన పదజాలం కొరుకుడు వడనిదయినా ఏదో అర్థమయినట్లే వుంటుంది, కాని వివరించలేము. నిఘంటువు సాయంతో మాత్రమే అర్థమవుతుంది. అన్నమయ్య వాడిన కొన్ని పదాలకు అర్థం వివరించలేని అవస్థకూడా రావటం కద్దు. ఎందుకంటే నేటి 'ఆధునిక' సమాజంలో వయ్యాళి, సమేళి, నివాళి, దువాళి, కరాళి, పిసాళి, విరాళి లాంటి పదములకి అర్థం తెలిసిన వారు ఎంతమంది?

**ఉ॥ చాలని యాశమెండగుట జాణ తమిన్ పతి గొర్కెతోటి, క**
**య్యాలు చెలంగ జేయునని ఆ రసికాగ్రణులెల్ల బుచ్చగన్**
**తేలిక కాని భాషగొని దీటుగ జెప్పెను అన్నమయ్య ఈ**
**మేలు కృతిన్, తరింపుడిక, వేంకటనాధుని పూజయౌ భళా!**

**రాగం : శంకరాభరణం**

వలపులు వలపులు వయాళి
చలమరి మరుడును సమేళి ॥వలపుల॥

నెలత మోమునకు నీ కనుచూపులు
నిలువున ముత్తెపు నివాళి
కొలదికి మీరిన గురు కుచములకును
తొలకు నీ మనసు దువాళి ॥వలపుల॥

వనిత నిండు జవ్వన గర్వమునకు
ఘనమగు నీ రతి కరాళి
వెనక ముందరల వెలది మేనికిని
పెనగు గోరికల పిసాళి ॥వలపుల॥





పడతి కోరికల భావంబునకును
కడుగడు నీ తమి గయాళి
చిడిముడి మగువకు శ్రీవేంకటపతి
విడువని కూటపు విరాళి ॥వలపుల॥

**భావామృతం :**

వలపులు పెనవైచి కొనిన "విహారం" జరుగుచున్నది. చపలయైన భామకు, మన్మధుని మారురూపుయైన సింగార రాయనికి "కలయిక" జరుగనున్నది.

భామిని వదనమునకు నీకంటి చూపులే ముత్యాలహారతివంటివి. ఘనస్తనద్వయంబు పైబడిన నీ తుంటరి మనస్సు "అమిత వేగముగల అశ్వము" (దాని నాపుట అసాధ్యము)

నిండు యౌవన గర్వంతోనున్న ఆ వనితకు "భీభత్సమైన" నీ రతివేగమే గొప్పగా తులతూగుతుంది. భామిని శరీరంపై ముందు వెనుక నెలకొని అతిశయించే కోరికతో వేసేవే నీ"దొంగ ఎత్తులు"అన్నీ.

ఆ యువతి కోరికల నిలయమైన భావనకు నీ అమితమైన వలపు "ధిక్కరింపు" తనమునకు (సమయుజ్జీగా నున్నవి) సరిపోయింది. సంభ్రమము కలిగిన మగువకు శ్రీవేంకటపతి యొక్క అవిశ్రాంతమైన కలయికే అనితర సాధ్యమైన "వలపు ఆరాధన".

**మున్నుడి** **1-18**

పిల్లలకే గాక వాళ్ల పిల్లలకి కూడ ఈ జోల పాడగలగటం నిజంగా సుకృతమే. శ్రావ్యంగా పాడితే చటుక్కున పాపలు నిద్రబోయే కీర్తన ఇది. తిరుమల రాయని కోసం నేటికీ, ఎప్పటికీ లక్షలమంది పాడు అద్భుతమైన 'జోల' ఇది. శ్రీకృష్ణుని చిలిపి లీలలు ఇతివృత్తంగా అన్నమయ్య ఎన్నుకొని చెప్పిన ఈ జోల మకరందహేల. పూర్వజన్మ జ్ఞానమున్న పాపాయి కొన్ని చరణాలు వింటూ హాయిగా నవ్వటం మనం గమనించవచ్చును. మీరూ గమనించాలంటే మీ పాపని ఈ కీర్తనతో నిద్రబుచ్చండి. ఇంతకీ ఒక చిన్న విషయం తెలుసా! కృష్ణయ్య అంత అల్లరి చేసి ఏడిపించింది. ఎవర్ని? గోపికలుగా అవతరించిన దేవ వనితలనే. అదీ.. వారి కోరిక మీదే.. మన కోరిక తీరినా మనకే తెలియదు అదే కృష్ణలీల.

**ఆ.వె.॥ పాప నిద్రబుచ్చ బహుదొడ్డ జోలరా**
**అన్నమయ్య జగతి కందజేసె**
**ఏడుకొండలయ్య ఇదివిని నిద్రించు**
**దీనిమించు జోల వినగనగునె!!!**

**రాగం : నవరోజ**

జోవచ్యుతానంద జోజో ముకుందా
రావె పరమానంద రామగోవింద ॥జోవచ్యుతా॥

నందు నింటను జేరి నయము మీఱంగ
చంద్రవదనలు నీకు సేవచేయంగ
నందముగ వారిండ్ల నాడుచుండంగ
మందలకు దొంగ మా ముద్దురంగ ॥జోవచ్యుతా॥

పాలవారాశిలో పవళించినావు
బాలుగా మునుల కభయమిచ్చినావు
మేలుగా వసుదేవు కుదయించినావు
బాలుడై యుండి గోపాలుడైనావు ॥జోవచ్యుతా॥





అట్టుగట్టిన మీగడట్టె తిన్నాడే
వట్టి కోడలు మూతిపై రాసినాడే
అట్టె తినెనని యత్త యడుగ విన్నాడే
గట్టిగా నిది దొంగ కొట్టుమన్నాడే ॥జోవచ్యుతా॥

గొల్లవారిండ్లకు గొబ్బునకు బోయి
కొల్లలుగ త్రావి కుండలను నేయి
చెల్లునా మగనాండ్రు జెలిగి యీశాయీ
చిల్లతనములు సేయ జెల్లునట వోయీ ॥జోవచ్యుతా॥

రేపల్లె సతులెల్ల గోపంబుతోను
గోపమ్మ మీ కొడుకు మా ఇండ్లలోను
మాపుగానే వచ్చి మా మానములను
మీపాపడే చెఱిచె నేమందుమమ్మ ॥జోవచ్యుతా॥

ఒకని యాలినిదెచ్చి నొకని కడబెట్టి
జగడములు కలిపించి సతిబతుల బట్టి
పగలు నలుజాములును బాలుడైనట్టి
మగనాండ్రచేబట్టి మదనుడైనట్టి ॥జోవచ్యుతా॥

అంగజుని గన్న మాయన్న యిటు రారా
బంగారు గిన్నెలో పాలు పోసేరా
దొంగనీవని సతులు పొంగుచున్నారా
ముంగిటనాడరా మోహనాకారా ॥జోవచ్యుతా॥

గోవర్ధనంబెత్తి గొడుగుగా పట్టి
కావరమ్మున నున్న కంసుపడగొట్టి
నీవు మధురాపురమునేల చేపట్టి
ఠీవితో నేలిన దేవకీ పట్టి ॥జోవచ్యుతా॥

అంగుగా తాళ్లపాకన్నయ్య చాల
శృంగార రచనగా చెప్పెనీ జోల
సంగతిగ సకల సంపదల నీవేళ
మంగళము తిరుపట్ల మదనగోపాలా॥జోవచ్యుతా॥

**భావామృతం**

ఓఅచ్యుతానందా! (అంతులేని ఆనందరూపా!)

జో జో (నిదురపో నాన్నా!) ఓముకుందా! రారా పరమానంద స్వరూపా! రాముని రూపం ధరించిన ఓగోవిందా! జోజో!

నీవు క్షేమంగా నందగోపుని ఇంటికి జేరి చంద్రముఖులైన గోపికలు నీకు సేవ చేయుచుండగా, గొల్లపల్లెలో దొంగవైన మా ముద్దుల రంగన్నా జోజో!

నీవు మునుముందుగా క్షీరసాగరమున శయనించియుంటివి. తరువాత బాలునిగా మారి మునులుకు అభయము నొసంగితివి. తరువాత వసుదేవునకు ద్యోతకమైతివి (దర్శన మొసగితివి) తరువాత రేపల్లెలో గోపాల బాలుడైతివి. అట్టిబాబూ జోజో!

చెక్కులు గట్టిన మీగడ తరకలు కడుపార భుజించినాడు. ఏమియు తెలియని అమాయకురాలైన కోడలి మూతిపై ఆ మీగడ రాసినాడు. అందుచేత అత్త ఆమెని నిలదీసి అడుగగా ఇదిగో నీ కోడలే దొంగతనం నేర్చిన జాణ అని అన్నాడు.అటువంటి అల్లరి పాపా జోజో!

శీఘ్రముగా గొల్లవారిండ్లకు బోయి అక్కడ కుండలలోని నెయ్యి అంతులేకుండా త్రాగాడు. ఈ పిల్లవాడు ఈ ఇల్లాళ్ళను ఈ విధంగా కుచ్ఛచేష్టలతో ఏడిపించతగునా?





ఆగ్రహించిన కొందరు గోపికలు రేపల్లెలో ఇలా గోడు వినిపించారు. ‘‘ఓగోపెమ్మా! మీ కొడుకు రాత్రివేళ మా ఇండ్లకువచ్చి మామానముల నపహరించాడు.వాని నేమనమంటావో చెప్పవమ్మా!

ఒక ఆడదాన్ని (పెళ్ళాన్ని) తెచ్చి ఇంకొక మగవాడికి అంటగడతాడు. దాంతో ఆ స్త్రీమొగుడు వచ్చి పోట్లాట పెట్టుకొంటాడు. మీ పిల్లవాడు పగటి వేళ నాలుగు జాములూ మా స్త్రీలతో కూడి అపర మన్మధుని వలె ప్రవర్తిస్తాడు. అట్టి అల్లరి కృష్ణయ్య గూర్చి ఏమి చెప్పమంటావు?

మన్మధుని కన్న తండ్రివైన మా కన్నా!ఇటురా నాన్నా! నీకోసం బంగారు గిన్నెలో పాలు పోసియుంచాము.నీవు దొంగవని సతులు నిందించుచున్నారు.మన ఇంటి ముంగిటిలో ఆడుకోరాదా తండ్రీ! మోహనరూపా! ఎందుకురా మాటలు పడతావు. (అని యశోద అంటున్నది.) గోవర్ధనపర్వతమును గొడుగులా పట్టి రక్షించిన వాడవౌ బాలుడా! గర్వముతో విర్రవీగిన కంసుని పట్టి సంహరించిన వాడవైతివి. మధురాపురమును ఏలుట సాగించితివి. ఓదేవకీనందానా! ప్రజారంజకముగా. దానిని పరిపాలించితివి.

తాళ్ళపాక అన్నమాచార్యుల వారు ఈ శృంగార గీతిక రూపంలోని జోలపాటను సకలసంపదలను సిద్ధింపజేయు ఈ జోల మంగళముగా తిరుపతిలోని మదనగోపాలుడైన శ్రీవేంకటేశ్వరునికి వినిపించినాడు.

## మున్నుడి 1-19

శ్రీకృష్ణార్జునులు, నారాయణ నరులని తెలిసిన విషయమే. అయితే ఆ నరనారాయణులు పురాణాలలోనే కాదు నేటికీ ఏనాటికీ నాలోను, మీలోను, అందరిలోను జీవుడు(దేహి) గాను వాయువుగాను ఉన్నారు. మన ఉచ్ఛ్వాస నిశ్వాసల్లో వున్నదివారే.

ఉచ్ఛ్వాసగా లోపలికి గాలితీసికొంటునది నారాయణుడు నిశ్వాసగా గాలిని వదిలిపెడుతున్నది నరుడు. కృష్ణుడుండి నడిపిస్తే పార్థుడు యుద్ధంచేశాడు. పరమాత్మ ఉచ్ఛ్వాస రూపంలో లోపలికిపోయి నడిపిస్తే జీవులమైన మనం శరీరానికి సంభంధించినవన్నీ చేసికొంటూ 'జీవిస్తున్నాం.' ఒక్కసారి ఆ నారాయణుడు లోపలికి పోకపోతే.... అంతే సంగతులు. (ఉయ్యాల మనిషి ఊగుతున్నాడు. వాడిని పైకి ఊపాలంటే శక్తి ఆ నారాయణుడివ్వాల్సిందే. క్రిందికి వాడంత వాడేవస్తాడు. మళ్ళీకాళ్ళతో తన్ని శక్తిని పరమాత్ముడిస్తాడు.) ఆ విధంగా మనశ్వాసలో వుండి నిత్యమూ మనని ఊయలలూపుతున్నాడు పరమాత్మ. అన్నమాచార్యుల వారి ఈ విశిష్టమైన కీర్తన విని ఏడుకొండల వాడే పరవశించి నిద్రకు ఉపక్రమిస్తాడు. '(ఉయ్యాల సేవ)లో ఈకీర్తన అన్నమయ్య ఎన్నిసార్లు పాడి వుంటారో !!

నేటికీ గాయకులు మధురంగా ఆలపిస్తుంటే ఆ'ఊంజల్ సేవ' చూచి వేలాదిమంది చరితార్థులౌతున్నారు, ముందు ముందు అవుతారు.

ఇక్కడ రెండు ఊయలల గురించి చెబుతున్నారు, అన్నమయ్య. ఒకటి ఈ జీవాత్మవూగే వూయల దీన్ని ఆచార్యుల వారు అద్భుతంగా వర్ణించారు ఈకీర్తనలో. రెండవది పరమాత్ముడైన వేంకటరమణుడు దేవేరులతో అఖిల దేవతా స్త్రీల సమక్షంలో కన్నులపండుగగా ఊగే వుయ్యాల.

**కం॥ గానము మధురం బవుటన్**
**వీనులకా అన్నమయ్య విందందించెన్**
**శ్రీ నాథుని జోకొట్టెను**
**ఐనా భావంబు తెలియదాయెను వినుడీ**

**రాగం : మధ్యమావతి**

అలర చంచలమైన ఆత్మలందుండనీ
అలవాటు సేసెనీ ఉయ్యాల
పలుమారు నుచ్ఛ్వాస పవనమందుండనీ
భావంబు దెలిపెనీ ఉయ్యాల ॥అలర॥





ఉదయాస్త శైలంబు లొనర కంభములైన
వుడుమండలము మోచె వుయ్యాల
అదన ఆకాశ పదము అడ్డదూలంబైన
అఖిలంబు నిండెనీ ఉయ్యాల ॥అలర॥

పదిలముగ వేదములు బంగారు చేరులై
పట్టవెరపై తోచెనుయ్యాల
వదలకిటు ధర్మదేవతపీఠమై మిగుల
వర్ణింప నరుదాయె వుయ్యాల ॥అలర॥

కమలకును భూసతికి కదలు కదలుకు మిమ్ము
గౌగిలింపగ జేసెనుయ్యాల
అమరాంగనలకు నీ హావభావ విలాస
మందందు చూపెనీ వుయ్యాల ॥అలర॥

కమలాసనాదులకు కన్నులకు పండుగై
గణుతింప నరుదాయె వుయ్యాల
కమనీయమూర్తి వేంకటశైలపతి నీకు
కడువేడుకై వుండెనుయ్యాల ॥అలర॥

**భావామృతం**

సమస్త జీవుల్లో ఆత్మరూపియై చైతన్య శక్తి వలె ఆ పరమాత్ముడే యున్నాడు. చంచల స్వభావం గల ఈ జీవాత్మల ఉచ్ఛ్వాస నిశ్వాసలలో ఆ మహానుభావుడు ఊయలలూగుతున్నాడు. లోపలికి ఉచ్ఛ్వాస రూపంలో పోయిన భగవంతుడు నిశ్వాసగా బయటకు వస్తాడు. ఉయ్యాల ఊగిందన్నమాట. బయటకు వచ్చిన వాడు తిరిగి లోపలికి ఉచ్ఛ్వాసగా పోకపోతే... అదే మరణమంటే. ఊగే ఈ ఉయ్యాల అదే భావమును తెలుపుచున్నది.

ఆ పరమాత్మ వూయలకు తూర్పుపశ్చిమ పర్వతములు స్తంభములు. ఆకాశమార్గము గొప్ప అడ్డదూలము. దానికి నాలుగు కట్టు బంగారు గొలుసులు చతుర్వేదములు. ఆ వూయలనూపే త్రాళ్ళు. ఈ అద్భుతమైన ఊయల వర్ణనాతీతం. దానిని పట్టనెంతో భయమును కలిగించుచున్నది. ధర్మదేవత కది పీఠమువలెనున్నది.

పైకి క్రిందికి ఆ ఊయల కదలినప్పుడు ప్రతి కదలికలోను లక్ష్మీదేవిని భూదేవిని నీపై ఒరిగి నిన్ను కౌగిలించుకొనునట్లు చేస్తున్నదీ ఉయ్యాల. దేవతారమణులకు నీ హావభావములు అప్పుడప్పుడు ప్రస్ఫుటమౌనట్లు ఈ ఉయ్యాల చేయుచున్నది ప్రభూ!

బ్రహ్మాది దేవతలకు కన్నులపండుగై ఊహింప నసాధ్యమై ఈ వూయల శోభిల్లుచున్నది. అందాల చందమామవై మనోహర రూపుడవైన వేంకటేశ్వరా! ఈ వూయల నీకు మిక్కిలి వేడుకగానున్నది తండ్రీ! (ఆయన వూగే ఊయల,మనజీవాత్మవూయలా, రెండూ ఆయనకు వినోదమే మరి!!)

**1-20**

## మున్నుడి

అన్నమాచార్యుల వారు వేదాంతమంతా రంగరించి తేలిక పదజాలంతో మహోన్నతమైన భావనావాహినిగా చెప్పిన హృద్యమమైన కీర్తన.ఇది.దీన్ని పాడుతున్న సమయంలో ఆయన వాయిస్తున్న 'ఏకతార' చేతిలోనే తెగిపోయిందని, దానితో ఆయన మోక్షోన్ముఖుడై తిరుమల చేరుకొని స్వామి కృపతో ముక్తిని పొందాడని కొందరు చెబుతారు. "జీవితమే ఒక నాటక రంగం"...అనే నేటి ఆధునికుల ఆలోచనలకు ఆచార్యుల వారి ఇటువంటి కీర్తనలే మాతృకలంటే ఏమాత్రం అతిశయోక్తి కాదు. మనస్సు కదిలించే కీర్తన ఇది.

**ఉ॥ జీవితమంత 'నాటకము' చేరు తుదిన్ యొక నాటికైన ఈ**
**చావులు పుట్టుకల్ అవని సత్యము,తక్కిన వన్ని కల్లలే**
**లావుగ దెల్పెనన్నమయ,రాదు మరేదియు దీనిసాటి,సం**
**భావన జేసి శ్రీపతిని పాడె నెవండిటు'ఆర్తి'తో భళా!!**

**రాగము: రేవతి**

నానటి బతుకు నాటకము
కానకా కన్నది కైవల్యము ॥నానాటి॥

పుట్టుటయు నిజము పోవుటయు నిజము
నట్టనడిమి పని నాటకము
యెట్టనెదుట గలది ప్రపంచము
కట్టకడపటిది కైవల్యము ॥నానాటి॥





కుడిచేదన్నము కోక చుట్టెడిది
నడుమంత్రపు పని నాటకము
వొడి గట్టు కొనిన వుభయ కర్మములు
గడి దాటినపుడే కైవల్యము ॥నానాటి॥

తెగదు పాపము తీరదు పుణ్యము
నగినగి కాలము నాటకము
యెగువనె శ్రీవేంకటేశ్వరుడేలిక
గగనము మీదిది కైవల్యము. ॥నానాటి॥

## భావామృతం

ప్రతి దినము మనం 'అనుభవిస్తున్నాం' అనుకొంటున్న ఈ జీవితమంతా నిజానికి ఒక నాటకం వంటిది.మన పూర్వ సుకృతంతో పొందేది మాత్రమే మోక్షము.

మన పుట్టుక సత్యము.ఒకనాటికి తప్పక చచ్చిపోతామనేదీ నిజమే.కాని ఈరెండిటి మధ్యలో మనం చేసేదంతా 'నాటకమే' మనకళ్ళెదుట కనబడేది ప్రపంచము.కానీ మన తుది గమ్యంమాత్రం ఆ మోక్షమే.

మనం తినేది ఆహారం,ధరించేవి బట్టలు. కానీ ఇవన్నీ మన పుట్టుకతో వచ్చి చావుతో పోయేవే. ఈమధ్యలో వచ్చే వన్నీ మధ్యలో నాటకం నడవటానికి పరికరాలు మాత్రమే.మనం ఒడిలో కట్టుకొని తీసుకొనిపోయే ప్రారబ్ధ,సంచిత కర్మలు లెక్కలు తేలి పరిసమాప్తమయ్యాక మాత్రమే మోక్షందక్కుతుంది.అందాకా ఈనాటకంతప్పదు.

ఈనాటకం జరుగుతున్నదాకా పాపమూ తెగదు, పుణ్యమూ తీరదు.వాటి వల్ల నవ్వులతో నడిచే ఈ నాటకం రంజుగానో విషాదంగానో వుంటుంది.పైన ఆ ఏడుకొండల మీదనున్న శ్రీవేంకటేశ్వరుడే మనందరి ఏలిక. ఆయన అధీనంలో వున్న ఆ నింగినున్నదే మోక్షము.

**1-21**

## మున్నుడి

అన్నమాచార్యుల వారు సంస్కృతంలో చెప్పిన 'స్తుతికీర్తన' ఇది. దీనికి భావార్ధ వివరణ అక్కరయే లేదు. అయినా ఇంకొక్కసారి స్వామి నామోచ్ఛరణ చేస్తే 'అధికస్య అధికం ఫలం'అన్నట్లు వివరించటం జరిగింది. 'ఆదిపురుషుని'శరణు జొచ్చిన విధానం కమనీయం.

**సీ॥ నీవే కదా! ప్రభూ! నిఖిలంబునకు ఆది**
**మధ్యాంతములు లేని మాధవుడవు**
**నీవే కదా! ప్రభూ!నిగమ వేద్యుండవై**
**మునిజన హృదయాల మనెడి హరివి**
**నీవే కదా! ప్రభూ! నిర్నిమిత్తుండవై**
**కర్మఫలమునీయు కాలమూర్తి**
**నీవే కదా!ప్రభూ! నిలిచి దుష్టుల గూల్చి**
**శిష్టరక్షణ జేయు శ్రీధరుడవు**

**ఆ.వె॥ నీవెదాల్చి నావు అవతారములనన్ని**
**నీవె పొందినావు నిందలన్ని**
**నీవె కావ మేదినిని వేంకటేశ్వరా!**
**నిన్నె సన్నుతించె నన్నమయ్య**

**రాగం : వసంతం**

అయమేవ అయమేవ ఆది పురుషో
జయకరం తమహం శరణం భజామి ॥అయమేవ॥

అయమేవ ఖలుపురా అవనీధరస్తు సో
ప్యయమేవ వటదళాగ్రాధి శయనః
అయమేవ దశవిధైరవతార రూపైశ్చ
నయమార్గ భువి రక్షణం కరోతి ॥అయమేవ॥





అయమేవ సతతం శ్రియః పతిర్దేవేషు
అయమేవ దుష్టదైత్యాంతక స్తు
అయమేవ సకల భూతాంత రేష్వాక్రమ్య
ప్రియభక్త షోషణం ప్రీత్యాతనోతి ॥అయమేవ॥

అయమేవ శ్రీవేంకటాద్రౌ విరాజతే
అయమేవ వరదోపి యాచకానాం
అయమేవ వేదవేదాంతైశ్చ సూచితో
ప్యయమేవ వైకుంఠాధీశ్వర స్తు. ॥అయమేవ॥

## భావామృతం

ఓప్రభూ! నీవే ఈసమాస్తానికి ఆదిపురుషుడివి. నీవే జయప్రదాతవు. నిన్నే శరణు జొచ్చుచున్నాను. నిన్నే భజించుచున్నాను.

అనాదిగా ఈ అవనీ భారమునంతా మోయుచున్నది నీవే సృష్ట్యాదిలో వటపత్రంపై శయనించిన వాడవూ నీవే. పది అవతారములనెత్తి వివిధ రూపములలో ఈ భూమిని దుర్మార్గుల నుంచి రక్షించినది నీవే.

నీ దేవేరులైన శ్రీదేవీ భూదేవికి సేమము నొసగెడి వాడవు నీవే. దుష్టులైన దైత్యులను పరిహరించెడి వాడవు నీవే. సర్వభూతముల అంతరాత్ముడవై వ్యాపించి, నీప్రియ భక్తులను షోషించుటలో అనురక్తుడవై యుండునది నీవు మాత్రమే.

శ్రీ వేంకటేశ్వరుడవై వేంకటాద్రి మీద వెలుగొంది నీ ఆశ్రితులకు సమస్త అభీష్టములను దీర్చువాడవు నీవే. వేదవేదాంతములలో సూచించబడిన భగవంతుడు నీవే. ఓతండ్రీ! వైకుంఠాధినాధుడవై మాదిక్కు నీవే, నీవే, నీవే.

**1-22**

## మున్నుడి

అచ్చతెలుగులో చెబితే అస్సలర్థం కాదు అంటే కొందరు నమ్మరు. నేటికి'రొడ్డు' పల్లెల్లో వాడే ఆ భాష జానపదం అంటున్నారు కొంతమంది. అన్నమయ్య సాహిత్యంతో పరిచయమున్న వారికి ఈమాటల్లో విడ్డూరమేమీ తోపదు. నిఘంటువుని వెదకి, పెద్ద వారి సలహాలు తీసుకొని, కొంత "ఇట్లా అయుంటుంది" అని ఊహించి చేసిన ప్రయత్నమిది. దీన్నిట్లా వ్రాయటంఅన్నమయ్యనర్థం చేసికొనటం "అంత" తేలిక కాదని చెప్పటం కోసమే సుమండీ....

**చం॥ తెలిపెను అన్నమయ్య అతి'తేలిక' జానపదంపు' తెన్గులో**
**నళినదళాక్షుడైన హరినాడు ధరించు 'దశావతారముల్'**
**చెలిమిని వేంకటేశ్వరుని జేకొని కొల్చెను సన్నుతించుచున్**
**తెలుగిది కాని, బోధపడదే!యొక మాట యిదేమి పాటరా!**

**రాగం : తెలుగు కాంభోజి**

నేనెందువోయీ తానెందువోయీ
రానీలే రానీలే రానీలే॥ ॥నేనెందు॥

మీనైన నాటితలమిదు కెల్ల దిగవలె కానీలే కానీలే కానీలే
తలచూపే నాటి తలపెల్ల దిగవలె తలచనీ తలచనీ తలచనీలే
కిటియైన నాటి కిటుకెల్ల దిగవలె తిరుగనీ తిరుగనీ తిరుగనీలే
హరియైననాటి అదటెల్ల దిగవలె జరగనీ జరగనీ జరగనీలే
వడుగైన నాటి వస విడువగావలె తడవకు తడవకు తడవకులే ॥నేనెందు॥

కలుషించే నాటి కడలెల్ల దిగవలె అలుగనీ అలుగనీ అలుగనీలే
సతిబాసే నాటి చలమెల్ల దిగవలె తతిగానీ తతిగానీ తతిగానీలే
ముసలైన నాటి ముసులెల్ల దిగవలె విసుగనీ విసుగనీ విసుగనీలే
మానైన నాటి మదమెల్ల పోవలే పోనీలే పోనీలే పోనీలే
కలికైన నాటిగజరెల్ల దిగవలె చెలగనీ చెలగనీ చెలగనీలే
వేడుకతో నాటి వేంకటపతినన్ను కూడినీ కూడనీ కూడనీలే ॥నేనెందు॥





## భావామృతం

నేనెక్కడికి పోతాను? తానెక్కడికి పోతాడు?ఆయన్నే నావద్దకు రానీలే...రానీలే...రానీలే. 'చేప'అయినప్పటి ఆ త్రుళ్ళిపాటుతనం తగ్గి తీరాలి.... కానీలే, కానీలే, కానీలే 'తాబేలు'వలె పొడచూపిన నాటి ఆలోచనంతా....(దేవతల కమృతం పంచి దైత్యులకు సొడ్డు కొట్టాలనే ఆలోచన) యోచించనీ, యోచించనీ, యోచించనీలే...వరాహమైన నాటి నీ కిటుకులన్నీ తగ్గి తీరాలి నభమంతా హిరణ్యాక్షుడికోసం తిరిగితే స్వేచ్ఛగా తిరగనీ, తిరగనీ, తిరగనీలే....సింహమైన నాటి (నరసింహం) నీగర్వమంతయునూ తగ్గితీరాలి. అట్లాగే జరుగనీ, జరుగనీ జరుగనీలే...వటువైన నాటి (వామనుడైన నాటి)నీ వాగ్ధాటి తగ్గాలి, మెల్ల మెల్లగా ఆక్రమించుకో, ఆక్రమించుకో, ఆక్రమించుకో... కలత పెట్టే నాటి (పరుశురామావతారము నాటి) నీ మిగిలిపోయిన క్రౌర్యమంతా ఆ మాట అన్నందుకు అలిగితే అలగనీ, అలగనీ, అలగనీలే...

భార్యను పోగొట్టు కొన్న నాటి (రామావతారం నాటి)నీ క్రోధమంతా తగ్గితిరాలి. అందాకా సమయం గడవనీ, గడవనీ, గడవనీలే...రోకలి ఆయుధంగా ధరించి చెండాడిన నాటి (బలరాముడైన నాటి)నీ కోపమంతా తగ్గితీరాలి. ఆకోపమంతా నిన్ను విడువనీ, విడువనీ, విడువనీలే..... మౌనియైన నాటి (బుద్ధుడుగా మారిన నాటి) హింసావాదం రూపు మాపాననే నీ మదమంతా తగ్గిపోవాలి. పోనీలే, పోనిలే,పోనిలే... కలికి అవతారం నాటి తెంపటితనం తగ్గితీరాలి. అందాకా విజృంభించనీ, విజృంభించనీ, విజృంభించనీలే. ఆనాటి శ్రీ వేంకటేశ్వరుడై నన్ను వేడుకతో కూడనీ, కూడనీ, కూడనీలే...

**1-23**

## మున్నుడి

'రూకలేనివాడు పోకకుకొరగాడు' అనే సామెత మన దేశంలో అనాదిగా ప్రసిద్ధం."సిరి గలవానికి చెల్లును, తరుణుల పదియారు వేల తగపెండ్లాడన్" అని సమర్ధించాడు శ్రీనాధుడు.ఇలా చెప్పుకొంటే అంతే వుండదు. ఈకీర్తినలో రూక (నేడు రూపాయి అంటున్నాం) మహిమను వర్ణిస్తున్నారు అన్నమాచార్యులు. ఎంత అద్భుదమో చూడండి. ఈ కనకం మన దగ్గర పలు విధములుగా నటిస్తున్నది అని కితాబు నిస్తున్నారు. ఆ కనకమహాలక్ష్మీ సోకులు ఎంత బాగా వర్ణిస్తున్నారో!

**ఆ.వె॥ రొంటి నెంత బెట్ట, రొక్కంబు చివరకు**
**వుసురు దీయు మడిసి కసిని బెంచు**
**అన్నమయ్య సుద్దులౌ సద్దిమూటలు**
**కొండలయ్య సతిని గోరడెవడు?**

(ఎంతధనం కూడబెట్టినా అది చివరికి ప్రాణం తీస్తుంది. ద్వేషాన్ని పెంచుతుంది. ఆ ఏడుకొండలవాడి భామామణి ఆశించని సన్నాసెవడు? అంటున్నారన్నమయ్య)

**రాగం : గుండక్రియ**

రూకలై మాడలై-రువ్వలై తిరిగీని
దాకొని ఉన్న చోట-దానుండదదివో ॥రూకలై॥

ఒకరి రాజు జేసు-నొకని బంటుగ జేసు
ఒకరి కన్నెకలవే-రొకరికి నమ్మించు,
ఒక చోట నున్నధాన్య-మొక చోట వేయించు
ప్రకటించి కనకమే-భ్రమయించీ జగము ॥రూకలై॥

కొందరి జాళెలు నిండు- కొందరికి సొమ్ములవు
కొందరి పుణ్యుల జేసు-కొందరి పాపులజేసు
కొందరి కొందరిలోన, కొట్లాట పెట్టించు
పందె మాడినటు వలె-బచరించు పసిడి ॥రూకలై॥





నిగనిగ మనుచుండు-నిక్షేపమై యుండు
తగిలి శ్రీవేంకటేశు-తరుణియై తానుండు
తెగని మాయై యుండు-దిక్కుదెసయై యుండు
నగుతా మా పాలనుండి-నటియించు బసిడి॥రూకలై॥

## భావామృతం

'రూక' అంటే వెండి రూపాయిలో నాల్గవభాగం. లేదా, చిన్నమెత్తు బంగారు నాణెం. 'మాడ' అంటే అర్ధ వరహా విలువ గల బంగారు నాణెం. 'రువ్వ' అంటే దమ్మిడీ.ఇట్లా అనేక విధములుగా పిలువబడుచున్న ధనము లోకమున సంచరించుచున్నది. ఆ కనకమే (లక్ష్మి) తానున్న చోట మరుగుపడియుండనోపదు.

ఈ కనకము ఒకరిని రాజుగాజేయును.అదే మరొకని బంటుగాజేయును. ఒకరి కన్యలను వేరొకరికి అమ్మించును. ఒక స్థలములోని ధాన్యము నింకొక స్థలమునకు జేర్చును. అందుకే సమాజంలో పండించేదొకరు, వండుకొని తినే దొకరుగా మారిపోయింది కేవలం ఈ కనకం వల్లనే.

ఈ కనకమే కొందరి సంచులను నింపుచున్నది. మరి కొందరికి ఆభరణములుగా మారుచున్నది. కొందరి చేత పుణ్యకార్యములను చేయించుచున్నది.మరికొందరిని పాపవర్తనులుగా మారుస్తోంది. కొందరి మధ్య కలహాలు పెడుతుంది, పందెం వేసికొనినట్లు ఆ పనులన్నీ ఈ కనకమే చేస్తూ అందరిని పరుగులు పెట్టించుచున్నది.

ఒక్కొక్క చోట ఈ కనకము బట్టబయలై నిగనిగమని మెరయుచుండెను. మరి యొక చోట పూడ్చిపెట్టబడి నిక్షిప్తమై భూమిలోనే దాగియున్నది. శ్రీ వేంకటేశ్వరునిపై వలపుచేత అది సదా ఆయన తరుణియైయున్నది. ఎంత ప్రయత్నించినను తొలగని మాయయై ఈ కనకము ఉన్నది. లౌకిక ప్రపంచములో తనను నమ్మిన వారికి రక్షయై రూపొందెను.ఈవిధముగా కనకము నవ్వుచు మాసమీపముననే యుండిపలు విధములుగా నటించుచున్నది.

**1-24**

## మున్నుడి

భగవద్గీతను పాట రూపంలో ఏకొందరో దైవాంశ సంభూతులు మాత్రమే చెప్పగలరు.నందకాంశమున బుట్టిన అన్నమాచార్యుల వారికిది ఉగ్గుతో నేర్చిన విద్య

భగవద్గీతలో తలమానికమైన పురుషోత్తమ ప్రాప్తి యోగంలోని సారాంశాన్ని ఇంత అలవోకగా పాడటం అసామాన్యం. భగవద్గీతపై ఆచార్యులవారు చాలా కీర్తనలు చెప్పి ఉంటారు. మన కొరనోముల వల్ల ఈనాడు మనకవన్నీ లభ్యమగుట లేదు.లభ్యమైన ఇటువంటి అరుదైన గీతామృతం చవిచూడకపోతే, "పుట్టురాద నరులు పులుగువోలె" అనిపిస్తుంది. భోజన సమయంలో పురుషోత్తమ ప్రాప్తియోగం పారాయణ చేస్తే 'వైశ్వానరునై' నేను ఆహారం అరగింప చేస్తానన్నాడు స్వామి. కనీసం ఈకీర్తన పాడితే అదే ఫలితం దక్కుతుంది కదా!

**తే॥ క్రీడికందించినట్టి శ్రీకృష్ణబోధ**
**నింత సులువుగ అన్నమయ్యెటుల తెలిపె?**
**వేంకటేశుడు తోడౌట వెనుక జేరి**
**ఏమి భాగ్యము? నేర్పుడీ స్వామి 'గీత'.**

**రాగం : లలిత**

అనియాన తిచ్చెగృష్ణు-దర్జునునితో
వినియాతని భజించు-వివేకమా ॥అని యానతి॥

భూమిలోను చొచ్చి సర్వ-భూతప్రాణుల నెల్ల
ధీమసాననే మోచేటి- దేవుడ నేను
కామించి సస్యమును- గలిగించి చంద్రుడనై
తేమల బండించేటి- దేవుడ నేను ॥అని యానతి॥

దీపనాగ్నినై జీవ- దేహముల యన్నములు
తీవుల నరగించేటి- దేవుడ నేను
ఏపున నిందరిలోని-హృదయములోన నుండి
దీపింతు దలపు మరుపై-దేవుడ నేను ॥అని యానతి॥





వేదములన్నిటి చేతా-వేదాంత వేత్తలచేతా
అది నేనెరగ దగిన-యా దేవుడను
శ్రీదేవితో గూడి-శ్రీవేంకటాద్రి మీద
పొదైన దేవుడను-భావించ నేను ॥అని యానతి॥

## భావామృతం

ఇక్కడ 'అని' ఆనతిచ్చెను అంటే ఆ విధంగా చెప్పెను-ఒక అర్ధమైతే,యుద్ధభూమిలో పరమాత్మ ఆజ్ఞాపించాడని ఇంకొక అర్థం చెప్పుకోవచ్చు. అర్జునునితో శ్రీకృష్ణపరమాత్మ ఉపదేశించాడు. అది విని ఆ స్వామిని భక్తితో భజించుటే తగిన వివేకము సుమా!

ఓ అర్జునా! నేను భూమియందు సమస్త జీవకోటిని నా ఓజో బలముచే (ధైర్యముగా) ధరించుచుయుంటిని. అట్టి దేవుడను నేనే సుమా! నేనే చంద్రుడి వలె రసములతో నింపి ఓషధులను జేసి రకరకములైన పంటలను పండించి జీవకోటికి ఆహారము నొసగుచున్నాను. అట్టి దేవుడను నేనే సుమా!

ఓ పార్థా! జఠరాగ్ని వలె (వైశ్యానరుని వలె) నేను సమస్త జీవులు భుజించిన ఆహారములను జీర్ణింపచేయు దేవుడనైయున్నాను. వాటి హృదయములందు నేనే స్థితుడనైయున్నాను. అట్లు విజృంభించియుండి వారిలో జ్ఞాపక శక్తివలెను మరియు మతిమరుపు కూడ కలిగించు దేవుడనైయున్నాను.(మఱుపులేనిచో కలిగిన తొలినాటి దుఃఖమునే తలపోయుచు జీవులు నశించిపోతాయి)

ఓ సవ్యసాచీ! సమస్త వేదముల చేతను వేదాంత వేత్తల చేతను పూర్వం గ్రహించదగిన దేవుడను నేనే . శ్రీవేంకటాద్రి పై శ్రీదేవితో స్థిరపడినట్టి దేవుడు వేరెవరో కాదు, నేనే సుమా! (భావయామి వేంకటేశం అంటే ఈకీర్తనే......)

**1-25**

## మున్నుడి

ఏ జన్మ అయినా మనకి పరమాత్మ మన పూర్వ కర్మనను సరించి ప్రాప్తింపజేసినదే. ఆయన దృష్టిలో హీనాధికములు లేనేలేవు. వారి వారి పుణ్యముల ననుసరించి ప్రతి జీవికీ ఒక విశిష్టతనంటగడుతున్నాడు. అన్ని జన్మలలోను ఈశ్వరారాధనా భాగ్యం కలుగదు. స్వామి కృప కలిగితే కాని ఏ జన్మకీ సార్ధకత కలుగదు. మరి నాది ఉత్తమ జన్మ నీది ఛండాలపు జన్మ అనే భేద భావం ఎంత అవివేకం? వేంకటేశ్వరుడి ఇష్టాను సారం లభించిన జన్మని సార్ధకం చేసుకోవటానికి ప్రయత్నించాలే కాని, కాలయాపన తగదు అంటున్నా రన్నమాచార్యుల వారు.

**మ॥ భళిరా! గోత్రకులంబులీయ గలవే! వైశిష్ట్య మీజన్మకున్**
**నళినీకాంతుని సత్కృపన్ కలుగవా? నానా సుసంపన్నముల్**
**తెలిపెన్ చక్కగ నన్నమయ్య వినుడీ దీటైన సంకీర్తనన్**
**విలువౌ భక్తి రసాయనంబు గొనుడీ వేంకన్న దాస్యంబునన్**

**రాగం : శ్రీరాగం**

తలమేల కులమేల-తపమే కారణము
యెలమి హరిదాసులు-యేజాతియైననేమి? ॥తలమేల॥

కాకము వల్ల బుట్టదా- ఘనమైన అశ్వత్థము
దాకొని గుల్లలో బుట్ట-దాముత్తెము,
చౌకైన విషలతనె-జన్మించదా నిర్విషము
యేకడ మహానుభావు-లెందుపుట్టిరేమీ? ॥తలమేల॥

చిడిపి రాళ్ళ బుట్టవా-చెలువైన వజ్రములు
పుడమి నీగలవల్ల-బుట్టదా తేనె?
వెడగు బిల్లి మేనను- వెళ్ళదాయనా జవ్వాది
వుడివోని పుణ్యులెందు-నుదయించరేమీ? ॥తలమేల॥





పంకములో బుట్టదా-పరిమళపు దామెర
పొంకపు గీటములందు-పుట్టదా పట్టు
కొంకక శ్రీవేంకటేశు-గొలిచిన దాసులు
సంకె లేని జ్ఞానులెందు-జనియించరేమీ? ॥తలమేల॥

## భావామృతం

ఎట్లా వుంటే నేమి? ఏ కులజుడైతే నేమి?తపస్సు ఒక్కటే కారణము.(ముక్తి లభించవలెనంటే?) హరిదాసులు ఏజాతివారైతే మాత్రమేమిటి?

అంతపెద్ద రావిచెట్టు ఎట్లా పుడుతున్నది.కాకి ఆచెట్టు గింజను మ్రింగి రెట్ట వేస్తే ఆ మలంలో నుంచి పుడుతున్నది. దాన్ని అశ్వత్థ వృక్షమని అందరూ పూజిస్తున్నారు. చిప్పలో దాగికొని ముత్యంపుట్టుచున్నది. విషమునకు విరుగుడైన నిర్విషము ఆ విషలత నుండియే వెలవడుచున్నది. మహానుభావులు ఎక్కడ జన్మించకూడదు? ఎక్కడనైనా జన్మించవచ్చును?

విలువైన వజ్రములు జన్మస్థానంలో పనికిమాలిన రాళ్ళేకదా? కేవలం సానబట్టుట చేతనే అవి ప్రకాశించి అమూల్యమైనవి. మధురమైన తేనె ఎలాపుడుతోంది, ఈగల (తేనెటీగలు) వల్లనే కదా? అతి వికారంగా వుండే ఒక రకం పిల్లి నుంచేకదా సువాసనలు వెదజల్లే జవ్వాది పుడుతున్నది?విడిపోనటువంటి పుణ్యంగల ఉన్నతులు ఏజాతిలో జన్మించరు? అన్ని జాతులలోను జన్మిస్తారు.

పరిమళాలు విరజిమ్మే పద్మము కొలనులోని బురదలో పుట్టుచున్నది. మెత్తని పట్టుదారం నీచమైన పట్టుపురుగు లోంచి వస్తున్నది. నిస్సంశయులై శ్రీవేంకటేశ్వరుని కొలిచేదాసులు అసంఖ్యాకులై జ్ఞానులలో ఎక్కడ కనబడరు?ఎక్కడనైనను కనబడెదరు.

**1-26**

## మున్నుడి

శ్రీనివాసునిపై మరులు గొన్న అలిమేలుమంగమ్మ పడుతున్న అవస్థలను వర్ణిస్తున్నారు అన్నమచార్యులవారు ఈ శృంగార కీర్తనలో. స్వామిని వేడుకొంటున్నారు కాస్త మంగయాతన నర్థం చేసికొమ్మని. అన్నమయ్య చాతుర్యం చూడండి “స్వామీ! తగిన అదను చూచి ఆమెను నీవశం చేసికొన్నావు ఆమె విరహోత్కంఠిత ఒక్కసారి నీ చాతుర్యం చూశాక ఆమె నిన్ను వదలి ఎలావుండగలదు?” అంటున్నారు.

**మ॥ విరహోత్కంఠిత, మంగమాంబ మదిలో వేంకన్ననూహించుచున్**
**మురిసెన్ ఆతని ప్రేమలోన మునిగెన్ మోదంబుతోనా కథన్**
**ధరలో యెవ్వని కౌను పూనితెలుపన్ తానొక్కడా అన్నమ**
**య్యెరుగన్ జెప్పెను హృద్యమంబు వినుడీ ఈ ‘లేమ’సింగారమున్**

**రాగం : శంకరాభరణం**

తరుణి నీయలుక కెంతటి దింతి నీవేళ
కరుణించగదర వేంకటశైలనాథా ॥తరుణి నీ॥

ఒక మారు సంసారమొల్ల బొమ్మని తలచు
నొకమారు విధిసేత లూహించి పొగడు
ఒకమారు తను చూచి వూరకే తలవూచు
నొకమారు హర్షమున నొంది మే మరుచు ॥తరుణి నీ॥

నిన్నుచూచి వొకమారు నిలువెల్ల పులకించు
తన్ను జూచి వొకమారు తలపోసి నగును
కన్ను దెరచి నిను జూచి కదుసిగ్గువడి నిలిచి
యిన్నియును తలపోసి యింతలో మఱచు ॥తరుణి నీ॥





వదలైన మొలనూలు గదియించు నొకమారు
చెదరిన కురులెల్ల చెరుగు నొకమారు
అదనెరిగి తిరువేంకటాధీశ పొందితివి
చదురుడవు నినుబాయ జాలదొకమారు ॥తరుణి నీ॥

## భావామృతం

ఓవేంకటగిరిరాయా! నీకోపం చూపించాలనుకొంటే ఈ భామినియే దొరికిందా? ఈవేళ ఈమెను కరుణింపరాదా? ఆమె పడుతున్న యాతన గమనించవేమయ్యా! ఆమెని చూడు...

ఒకమారు ఈ సంసారం నాకక్కరలేదంటుంది. ఒకమారు ఆహా! ఏమి ఈ విధిలీల అని పొగడుతుంది ఒకమారు తను జరుగుతున్నది గమనించినట్లు తలనూపుతుంది. ఒకమారు సంతోషంతోమైమరిచి పోతుంది.

ఓ స్వామీ! నిన్నుచూచి ఒక్కొకసారి నిలువెల్ల పులకించి పోతుంది ఆమె. తనను తాను చూచికొని ఏదో ఆలోచనతో నవ్వుతుంది. అంతలోనే ఒక్కసారి కళ్ళుతెరచి నిన్ను చూచి సిగ్గుపడుతుంది.మళ్ళీ ఇవన్నీ తలచుకొని తన్నుతానే మరిచిపోతుంది.

ఒకమారు వదులైపోయిన తన మొలనూలు (వడ్డాణంలాంటి బంధనం)చూచికొని మళ్ళీ బిగించికడుతుంది. ఒకమారు చెదరిపోయిన తన ముంగురులను సవరించుకొని తృప్తిపడుతుంది. అటువంటి ఆ ‘బేల’ ను ఓ ప్రభూ! నీవు సమయం చూసి నీవశం చేసుకొన్నావు. ఎంత టక్కరివాడివయ్యా! ఇక నిన్నామె ఎలా విడువగలదు?

**1-27**

## మున్నుడి

తిరుమలలో వేంకటేశ్వరుడే శ్రీరంగంలో రంగనాథుడు. ఏ రూపు అయినా పరమాత్మ ఒక్కడే. కావేటి ఒడ్డున శ్రీరంగ ద్వీపంలో వెలసిన రంగనాథస్వామిని దర్శించి ఆ మమేకంతో ఈ కీర్తనలో ఒక స్త్రీ అయ్యారు అన్నమయ్య. తన స్తనములపై చెయ్యివేసే చిలిపి పనులు ఎందుకు చేస్తావు? స్వామీ! అని రంగనాథస్వామిని ప్రశ్నిస్తున్నారు అన్నమయ్య. అంతగా అయితే, అంటే నీకు నాపై వ్యామోహం కలిగితే నేను కాదంటానా? రాత్రివేళ మా ఇంటికి రారాదా? నేను కాదంటానా? అంటున్నది ఆ జవ్వని. నేను నీ నవ్వులపై మోహంచెంది మైమరచాను నన్ను బూతులు తిట్టకు స్వామీ! అని అర్థిస్తున్నది, రంగనాథస్వామిని. రసవత్తరమైన శృంగారం గొప్పకీర్తనగా రూపుదాల్చింది.

**కం॥ శ్రీరంగనాథు నివ్విధి**
**కూరిమితో అన్నమయ్య కొలిచెను వినుడీ**
**ధారాళమైన కీర్తన**
**నీరీతిగ పాడెనెవడు? ఇంపుగ హరికిన్.**

**రాగం : సింధుభైరవి**

రంగ రంగ రంగపతి రంగనాథా-నీ
సింగారాలే తఱచాయె శ్రీరంగనాథా ॥రంగ రంగ॥

పట్టపగలేమాతో పలచగా నవ్వేవు
ఒట్టులేల పెట్టు కొనేవో రంగనాథా !
వట్టిమాకు లిగిరించు వడినీ మాటలు వింటే
అట్టడివీ మేర మీఱకు రంగనాథా ॥రంగ రంగ॥





చేతులు చాచేవు నీవు చేరి నా చన్నులమీద
రాతిరి మాయింటికిరా రంగనాథా
యీతల నీనవ్వులకే యిక్కువలు కరగితి
బూతుల తిట్టకుమీ పోపో రంగనాథా ॥రంగ రంగ॥

కావేటి రంగమున కాంతపై పాదాలు చాచి
రావు పోవు ఎక్కడి కోయీ రంగనాథా!
శ్రీ వేంకటాద్రి మీద చేరి నన్ను కూడితివి
ఏవల చూచిన నీవే ఇటు రంగనాథా ॥రంగ రంగ॥

## భావామృతం

ఓ కావేటి రంగా! రంగపతీ! రంగనాథా! నీ అలంకారములు అత్యద్భుతముగా శృంగార భరితంగా నున్నవయ్యా!

నీసేవకురాంద్రమైన మాతో పట్టపగలే పరాచికాలాడుతున్నావే? ఇదే మిటంటే ఒట్లు ఎందుకు పెట్టుకుంటావు? నీ మాటలు వింటే ఎండిన చెట్లు చిగురిస్తాయా అన్నట్లుంటుంది. రంగనాథా! నిందలాడి మర్యాదనెందుకు అతిక్రమిస్తావు?

నా స్తనములపైకి నీవు చేతులు తగిలేట్లు చాచి ఉంచుతావు. రంగనాథా స్వామీ! కావలెనంటే రాత్రికి మాఇంటికి రారాదా! నేను ఇక్కడ నీ సమ్మోహకరం అయిన నవ్వులకే కరిగిపోతాను. మరి నన్ను చెడు మాటలతో నిందించుట తగునా? రంగనాథా! ఇది న్యాయమేనా?

కావేరీ నది మధ్యలో శ్రీరంగపట్టణంలో పడతులపైకి (శ్రీదేవి భూదేవి) నీపాదాలు చాచివుంచావు కదా! నీ రాకపోకలు ఎక్కడికయ్యా రంగనాథా! శ్రీవేంకటాద్రి మీద వెలసిన నీవు నన్ను కూడినావు ఎక్కడ చూచినా నాకు నీవే కనిపిస్తావు రంగనాథా!

**1-28**

## మున్నుడి

అద్దాల పాపడు చిన్నికృష్ణయ్యకు ఉగ్గు పెడుతున్నది తల్లి యశోద. గోపికలు తన బాలునికి దిష్టి పెడుతారేమోనని ఆ గోపెమ్మ భయం. జగములన్నీ బొజ్జలో దాచుకొన్న వాడికి ఉగ్గు ఎవరు పెట్టగలరు? ఏమో ఆ తల్లి జాగ్రత్త ఆ తల్లిది. కాసేపు అన్నమాచార్యులవారే ఉగ్గుపెట్టే తల్లియై తనపాపాయిని శ్రమ పెట్టకండని గోపెమ్మలను మందలిస్తున్నారు. కొండల మీద తిమయ్య అయిన తన బాలునికి ఉగ్గు పెట్టమంటున్నారు. అంత తేలికగా అర్థమయ్యే పాట కాదిది. మీరే చూడండి.

**ఉ॥ కొండల మీద తిమ్మడిని గొల్చెను ఉగ్గును వెట్టు తల్లియై**
**దండిగ నన్నమయ్య, వినిదానిని పాడుదు అమ్మలాల!ఏ**
**పండితుడైన మోదమున పాటకు శీర్షమునూచకుండునా**
**మెండుగ పుణ్యముల్ కలుగు మీ మది గృష్ణుడు జిల్కునవ్వులన్.**

**రాగం : ఖమాస్**

ఉగ్గు వెట్టరే వోయమ్మా చె-
య్యొగ్గీనిదె శిశు వోయమ్మా ॥ఉగ్గు వెట్టరే॥

కడుపులోని లోకమ్ములు గదలీ-
నొడలూచకురే వోయమ్మా
తొడికెడి సరుగన తొలుగ దీయరే
వుడికెడి పాలివి వోయమ్మా ॥ఉగ్గు వోట్టరే॥

చప్పలు పట్టుక సన్నపు బాలుని-
నుప్పర మెత్తకురోయమ్మా
అప్పుడె సకలము నది మీనోరనె
వొప్పదు తియ్యరె వోయమ్మా ॥ఉగ్గు వోట్టరే॥





తొయ్యలు లిటు చేతుల నలగించక
వుయ్యాల నిదరే వోయమ్మా
కొయ్యమాటలను కొండల తిమ్మని
నొయ్యన తిట్టకురోరమ్మా ॥ఉగ్గు వెట్టరే॥

**భావామృతం**

ఓ అమ్మలారా! ఈ శిశువునకు ఉగ్గు (స్త్రీలు చను బాలతో ఆముదం కొద్దిగా రంగరించి ఇచ్చేదే ఉగ్గు అంటే. ఇది పాపాయి జీర్ణవ్యవస్థను చక్కబరుస్తుంది. పాలుత్రాగే పాపాయికి తల్లులు ఉగ్గుపెట్టేవారు. ఇక్కడ అన్నమయ్య తనే యశోదయై గోపికలతో ఈ పాట రూపంలో ఉగ్గుపెట్టండని చెబుతున్నారు)పెట్టండమ్మా! కాస్త చేతులు చాచి ఈ శిశువు ఉగ్గుకు అడ్డు పెడుతున్నాడ్రా! అయినా ఉగ్గుపెట్టండమ్మా!

ఈబిడ్డ అంట్లాంటిట్లాంటి సాధారణ శిశువు అనుకున్నారా ఏమ్రా! వీడు తన కడుపులో లోకాలన్నీ దాచుకొన్నాడు. మీరు గబగబా పిల్లాడిని ఊపితే వీడి ఒళ్ళంతా ఊగి లోకాలు తల్లడిల్లి పోతాయి కాస్త జాగ్రత్త. ఉడుకుడుకు పాలు పిల్లాడి మీద పొంగిపోయేట్లు చేస్తారా ఏమే? కాస్త జాగ్రత్త.

చిన్నపిల్లవాడ్రా! వీడిని జబ్బలు పట్టుకొని ఆకాశం వైపున కెత్తకండి (కళ్ళు తిరుగుతాయి చిన్నారికి). వాడి చిన్నారి నోట్లో ఆ ఉగ్గంతా ఒక్కసారి తోసేయకండే, వాడి నోట్లో అంత ఉగ్గుపడుతుందా. చూసుకోండమ్మా!

ఓ అమ్మాయిలూ! కాస్త జాగ్రత్త! వాడి నెత్తిమీద మొత్తకండి. వాణ్ణి అలిసిపోయేట్లు చేస్తారేమిటే! ఇక చాలు ఉయ్యాలలో పెట్టండి. వీడు కొండల తిమ్మయ్య (ఏడుకొండలవాడు) ఈ పాపాయిని కటువైన మాటలతో నిందించకండి.

## 1-29

## మున్నుడి

మనస్సు చేత, వాక్కుచేత, కర్తల చేత ఏ వ్యాపారము అయినా జరుగుతుంది. వీనినే త్రికరణములంటారు. మానవుడు త్రికరణ శుద్ధిగా ఏపాటి మంచి చేసినా పరమాత్మ మెచ్చి దానికి తగిన సత్ఫలితాన్ని మనకందిస్తాడు. తిరుమల యాత్రలో వేంకన్న దర్శనానికి బారులు తీరి నిలబడతారు. వారిలో కొందరిని గమనించండి అనవసరమైన రాజకీయాలు మాట్లాడుతోనో, తిరుగు ప్రయాణం గురించి ఆలోచిస్తూనో, నవలలు చదువుతూలో కనిపిస్తారు. వారికి ఒళ్ళరగటమే కాని ఒరిగేదేమీ ఉండదు. ఇదే సూక్తిని అనేక మంది రకరకాలుగా చెప్పారు. అన్నమాచార్యులు తనదైన అద్భుత శైలిలో కీర్తనగా చెబుతున్నారు వినండి.

**చం॥ శృతులు పురాణముల్ చదివి చేసిన తీర్థపు యాత్ర లేమగున్?**
**అతులిత దర్పదాంబికములన్నియు జూపెడి దానమేటికిన్?**
**మతిగొని వేంకటేశ్వరుని మానక దిక్కని మ్రొక్క మేలగున్**
**హితవును జెప్పెనన్నమయ యింతకు మించిన జ్ఞానమున్నదా?**

**రాగం : చక్రవాకం**

త్రికరణ శుద్ధిగా చేసిన పనులకు దేవుడు మెచ్చును లోకము మెచ్చును
ఒకటి కోటి గుణితంబగు మార్గములుండగ ప్రయాస పడనేలా ॥త్రికరణ॥

తన మనసే పరిపూర్ణమైన గోదావరి గంగా కావేరీ
కనకబిందు యమునా గయాది ముఖ్య క్షేత్రంబుల సంతతమున్
దినకర సోమ గ్రహణకాలముల తీర్థాచరణలుసేసిన ఫలములు
తనుదానే సిద్ధించును వూరకే దవ్వులు తిరుగ మరియేలా ॥త్రికరణ॥





హరియను రెండుక్షరములు నుడివిన అఖిల వేదముల మంత్రములు
గరిమ ధర్మశాస్త్ర పురాణాదులు క్రమమున చదివిన పుణ్యములు
పరమ తపోయాగంబులు మొదలగు బహుసాధనముల సారంబు
పరిపక్వంబై ఫలియించంగా బట్టబయలు వెదకగనేలా ॥త్రికరణ॥

మొదల శ్రీవేంకటపతికిని చేయెత్తి మొక్కిన మాత్రము లోపలనే
పదిలపు షొడశదానయాగములు పంచమహాయజ్ఞంబులును
వదలక సాంగంబులుగా జేసిన వాడే కాడా పలుమారు
మదిమది నుండే కాయక్లేశము మాటికి మాటికి తనకేలా ॥త్రికరణ॥

## భావామృతం

త్రికరణ శుద్ధిగా (మనోవాక్కాయ కర్మలా) మనమంతా చేసే పనులకు పరమాత్ముడు ఆనందించి మనని తప్పక మెచ్చుకొంటాడు. ఆయన మెచ్చుకొనే మార్గాలు కోట్ల కొద్ది ఉన్నాయి. ప్రయాసతో కూడిన విధానముల నెంచుకొని అనవసరంగా తిప్పలు పడటం దేనికి?

మనస్సుని పరిశుద్ధముగా వుంచుకొంటే చాలు. గోదావరి, గంగ, కావేరి, స్వర్ణముఖి, యమున వంటి నదులలో తీర్థస్నానములు,గయా వంటి క్షేత్రాలలో సూర్య చంద్రగ్రహణ సమయాలలో పవిత్ర తర్పణలనొసంగుట వంటి శ్రమతో కూడిన దూర ప్రయాణాలు చేయుటం దేనికి?

"హరి" అని రెండక్షరములు భక్తితో పలికితే చాలును కదా! సకలవేదములలోని మంత్రములను, ధర్మశాస్త్రములను, పదునెనిమిది పురాణములను వరుసగా చదివినంత పుణ్యము, అకుంఠిత తపము, యజ్ఞయాగము చేసిన పరిపూర్ణ ఫలితము దక్కి తీరుతుందని తేటతెల్లమైపోతే, ఇంకా వాటన్నింటినీ వెదకాలా?

పదహారు రకములైన షోడవ దానములు, పంచమహా యజ్ఞములు, శాస్త్రోక్తంగా చేసిన సత్ఫలితం మొత్తమూ శ్రీ వేంకటేశ్వరునికి చేయెత్తి మొక్కినంత మాత్రముననే దక్కుతున్నది కదా! ఎన్నియోమార్లు రకరకములైన శరీరశ్రమలు కలిగించే పనులన్నీ తనకెందుకు? శరణము వేంకటపతీ! శరణు శరణు అనరాదా?

**1-30**

## మున్నుడి

"అరవైయ్యేళ్ళు వచ్చాక అ,ఆలు నేర్చుకొందాములే" అన్నాడట వెనకటి కొకడు. అలాగే ఇప్పుడు తొందరే మొచ్చింది కాస్త ఈ సుఖాలన్నీ అనుభవించి, పళ్లూడాక పరమాత్మ గురించి ఆలోచిద్దాంలే అనుకొంటే పళ్ళూడకుండానే నువ్వు ఊడిపోయే ప్రమాదముంది. దైవంపై ప్రేమ భగవదేచ్ఛే ఐనా సాధన చేయందే దైవమైనా సాయం చేయదు. ఇంత చిన్నకీర్తనలో అంత తత్త్వజ్ఞానాన్ని ఇమిడ్చి మన వీనుల విందుతో పాటు సరి అయిన దారి చూపిన తాళ్ళపాక గురుపుంగవుని ఋణం ఎలా తీర్చుకోగలం? శేషాచలాధీశుని, మన చివరి క్షణందాకా ధ్యానించాలి. తప్పదు.

**ఉ॥ నీరధి ఆటుపోటుడిగి నీరములందున తానమాడగా**
**కోరిన, కూడునా? అలల కూటమి తగ్గున? అన్నమయ్యనెన్**
**తీరవు ఆశలెన్నటికి, దేవుని మ్రొక్కుట వీలుకాదురా**
**చేరుము వేంకటేశ్వరుని, సేవలు చేయుట నేర్వుమిప్పుడే.**

**రాగం : మిశ్రమోహన**

కడలుడిపి నీరాడగా తలచు వారలకు
కడలేని మనసుకు కడమ యెక్కడిది ॥కడలుడిపి॥

దాహమణగిన వెనక తత్త్వమెరిగెదనన్న
దాహమేలణగుతా తత్త్వమే మెరుగు
దేహంబు గలయన్ని దినములకును పదార్థ-
మోహమేలణగుతా ముదమేల కలుగు ॥కడలుడిపి॥

ముందరెరిగిన వెనుక మొదలు మరచెదనన్న
ముందరేమెరుగు తామొదలేల మరచు
అందరముగ తిరువేంకటాద్రీశు మన్ననల
కందువెరిగిన మేలు కలనైన లేదు ॥కడలుడిపి॥





## భావామృతం

సముద్రములోని అలల ఉధృతము నాపి తీరికగా స్నానం చేద్దాములే అనుకొనే వారికీ, తుదిలేని మనసుకూ (ఇక చాలు అనుకొనే అలవాటు లేని మనస్సునకు) తృప్తి యెక్కడ ఉన్నది? అందుకు తీరిక ఎక్కడ దొరుకుతుంది?

ఇంకా సుఖాలన్నీ అనుభవించలేదు. ఇప్పుడే తొందరే మొచ్చింది ఈ సుఖతృష్ణ తీరి తృప్తి కలిగాక నెమ్మదిగా దైవం గురించి తత్త్వం చింతన గురించి ఆలోచిద్దాంలే తొందరెందుకు అనుకోకండి. ఈ ఆశ, సుఖవాంఛా దాహం ఎట్లా నశిస్తుంది? అది నశించక తత్త్వమెట్లా తెలుస్తుంది? అసాధ్యం. ఈదేహమున్నంతకాలమూ వస్తు సముదాయములపై వ్యామోహం ఎలా పోతుంది? అలా ఆ వ్యామోహం పోనంతకాలం సంతోషమెలా దక్కుతుంది? దక్కదు. అందుకని దాని కోసం దీని కోసం వెంపర్లాడకండి.

అయ్యో! నాకేం జరుగుతుందో తెలియదాయె! ముందరేం జరుగుతుందో తెలిస్తే, ఇది వరకు జరిగిన సంగతులు మఱచి పోగలను. ముందరేం జరుగుతుందో ఎట్లా తెలుస్తుంది? తానిక జరిగిన సంగతుల నెట్లా మఱువగలదు? చక్కగా శ్రీవేంకటేశ్వరుని అభిమానం వెంటనే పొందితే మేలు కదా! కలలోనైన అంత అదృష్టం దక్కితే చాలాదా?

## 1-31

### మున్నుడి

హరినామరసాయనం తనివిదీరా గ్రోలుడని అనాదిగా హరిదాసులు చెబుతూనే వున్నారు. పూర్వకర్మా వశిష్ఠులమై మనమే అజ్ఞానంతో ఆ మాట పట్టించు కోవటం లేదు. అన్నమాచార్యులవారు అదే విషయాన్ని తేనెలూరే ఈకీర్తనగా చెప్పారు. ఎన్ని సార్లు వినినా తనివి తీరని ఈపాట చిన్న పాపాయిలను కూడ తన్మయులని చేస్తుందని నేను అనుభవపూర్వకంగా తెలుసుకొన్న సత్యం. తలచవో, పొగడవో, మరుగవో, తడవవోడ మనసా! అంటున్నారు తాళ్ళపాక కవీంద్రులు.

**కం॥ హరియని యొకపరి యనుమిక**
**తరుగును పాతకములన్ని ధన్యత కలుగున్**
**సిరిమగుడు వేంకటేశుడు**
**పరుగిడి వచ్చునిరి తాళ్ళపాక కవీంద్రుల్.**

### రాగం జోన్‌పురి

హరినామము కడు ఆనందకరము
మరుగవో మరుగవో మరుగవో మనసా ॥హరి నామమే॥

నళినాక్షుని శ్రీనామము
కలిదోషహరము కైవల్యము
ఫలసారము బహుబంధమోచనము
తలచవో తలచవో తలచవో మనసా ॥హరి నామమే॥

నగధరునామము నరకహరణము
జగదేక హితము సమ్మతము
సగుణ నిర్గుణము సాక్షాత్కారము
పొగడవో పొగడవో పొగడవో మనసా ॥హరి నామమే॥





కడగి శ్రీ వేంకటపతి నామము
బడి బడినే సంపత్కరము
అడియాలంబిల నతి సుఖమూలము
తడవవో తడవవో తడవవో మనసా ॥హరి నామమే॥

### భావామృతం

హరినామస్మరణ మొక్కటే మిక్కిలి ఆనందమును కూర్పునది. కనుక ఓ మనసా! నీవు నామము కలిగించు ఆనందమును అదే యావగా పొందుము. మరల మరల పొందుము.

మంగళకరమైన ఆపద్మదళాయ తాక్షుని నామము కలిపురుషుని చేప్రాప్తించు దోషములను హరించి వేయును, మోక్షమునందించును. ఆ నామము పుణ్యఫలము యొక్క సారమైయున్నది. అనేకములైన బంధములను సడలించునది కూడ హరి నామమే. ఓమనసా ఆనామమును స్మరించుము. మరల మరల స్మరించుము.

గోవర్ధన గిరి నెత్తిన ఆ శ్రీహరినామము నరకమును నివారించునదైయున్నది. విశ్వమున కంతటికి ఈనామము మేలు కలిగించునది. సర్వులకు సమ్మతమైనదియు ఈనామమే. సుగుణ నిర్గుణ రూపుడైన పరమాత్ముని సాక్షాత్కరింప చేయునదియు ఈ నామమే. ఓమనసా! అట్టి నామమును స్తుతించుము. మరలమరల స్తుతించుము.

యత్నించి వేంకటేశ్వరుని నామము నాశ్రయిస్తే అతి శీఘ్రముగా సంపదలను వెలయ జేస్తుంది. గురుతుగా సుఖాలవాల మైన నామమును ఓమనసా వెదకరాదా మరల మరల యత్నించి వెదకరాదా!

**1-32**

## మున్నుడి

విజయనగరాధీశుడైన కోదండరామునిలో వేంకటేశ్వరుని సాక్షాత్కరింప చేసుకొని పులకించి అన్నమాచార్యులు చెప్పిన కీర్తన ఇది. రామనామ సంకీర్తన మధురంగా త్యాగరాజు వంటి మహామహులు చేయటానికి, స్ఫూర్తి తాళ్ళపాక వారే. నాంది వారే పలికారని నాకనిపిస్తుంటుంది...

**సీ॥ సుగుణాభిరాముని సొబగైన సుగుణాలు**
**మొదలెంచి పాడిన మోదకరము**
**ఆర్తరక్షకునెంచి కీర్తించి మ్రొక్కిరి**
**వామదేవాదులు వరుసదీరి**
**సర్వంబు దెలిసియు నిర్వికారునివోలె**
**కడదాక ధర్మంబు గరపె నతడు**
**ఎంత జుట్టినగాని సుంత వద్దన లేని**
**రామనామామృత లబ్ధికలుగు**

**ఆ.వె॥ రామనామ జపము ఈ మహినన్నమా**
**చార్యువోలె నెవడు చాటిచెప్పె?**
**వేంకటేశ్వరుడిని విజయరామునిలోన**
**ఎవడు చూచె తొలి? ఎవడు పాడె?**

**రాగం : కీరవాణి**

అదె లంక సాధించె నవని భారము దించె
విదితమై ప్రతాపము వెలయించె నితడు ॥అదెలంక॥

రవి వంశ తిలకుడు రాముడితడు
భువి పుట్టె దశరథ పుత్రుడితడు
భవుడెంచె తారక బ్రహ్మమీతడు
పవనజు కిచ్చినాడు బ్రహ్మపట్టు మితడు ॥అదె లంక॥





బలువుడు సీతాపతి యితడు
తలకొన్న వాలి మర్దనుడితడు
విలసిల్లె నేకాంగ వీరుడితడు
చలమరి కోదండ దీక్షా గురుడితడు ॥అదె లంక॥

శరణాగత వజ్ర పంజరుడితడు
సరిలేని యసుర భంజకుడితడు
వరదుడు శ్రీవేంకటేశ్వరుడితడు
అరయ విజయనగరాధీశుడితడు ॥అదె లంక॥

## భావామృతం

ఈ శ్రీరామచంద్రుడు అదిగో ఆ స్వర్ణ లంకను జయించి భూభారమునుపశమింప జేసినాడు. తన అమోఘమైన ప్రతాపమును ఈ రాఘవుడు వెలువరించినాడు.

రాముడని పిలువబడుతున్న ఇతగాడు సూర్యవంశమునకే అలంకారము వంటి వాడు. దశరథమహారాజునకు భూమిపై పుత్రునిగా ఉదయించినవాడీ రామచంద్రుడు. పరమశివుడు స్తుతించిన మోక్షదాతైన పరబ్రహ్మ స్వరూపుడితడే. ఈ శ్రీరాముడు హనుమంతునికి పంచముఖ బ్రహ్మపదవి నిచ్చి మన్నింపు నిచ్చాడు.

కాలి బొటనవ్రేలితో దుంధుభి మహాకళేబరాన్ని ఆవల తన్నిన బలాఢ్యుడైన సీతామనోహరుడీ రాఘవుడు. పూని మహాబలాఢ్యుడైన వాలిని నిర్జించినవాడీ రాముడు. భూమండలంలో అసహాయశూరుడై విరాజిల్లిన వీరుడీ కౌసల్యా సుతుడు. ఏ మాత్రం మాత్సర్యం లేని వాడై సదా కోదండ పాణియైన దీక్షాదక్షుడితగాడు.

శరణము వేడువారలకు వజ్రపంజరము వలె అభేద్యమైన రక్ష ఈ కోదండరాముడు. రాక్షస సంహారమున ఈతనికి సాటి మరొకడు ఈ వసుంధరలో లేడు. ఇన్ని లక్షణములున్న ఈ శ్రీరామచంద్రుడు మరెవరో కాదు స్వయంగా తిరుమలాధీశుడైన శ్రీవేంకటేశ్వరుడే. ఆయనే మనందరి కన్నుల పండుగగా ఈ విజయనగరమున ఈ నగరాధీశ్వరుడై వెలసియున్నాడు.

1-33

## మున్నుడి

ఇహ పర సాధనమైనది, అత్యంత సులువైనది, సుఖకరమైనది, ముని జనాదరణీయమైనది,బాధకు హింసకు తావు లేనిది అయిన గొప్ప ఉపాయమును భక్త జనోద్ధరణకై భక్తాగ్ర గణ్యులైన తాళ్ళపాక అన్నమాచార్యులవారు సెలవిస్తునారు.

సంస్కృత భాషలో చెప్పిన ఈ కీర్తనలో పదకవితా పితామహులు మరణం తప్పనిసరి అయిన మానవులకు సులభంగా తరించటానికి శ్రీ వేంకటేశ్వరుని నామం కంటే మహత్తరమైనది లేదు అని అంటున్నారు.

**ఆ.వె॥ 'వెత'కు చోటులేని 'భేషై'న యోచన**
**శ్రావ్యగతిని పాడె సంస్కృతమున**
**అవధరింపుడయ్య అన్నమాచార్యుని**
**భవజలధిని దాటు మంచి మాట.**

**రాగం : సామంతం**

ఏవం శ్రుతిమత మిదమేవ త-
ద్భావయితు మతః పరం నాస్తి ॥ఏవ శ్రుతి॥

అతుల జన్మభో-గాసక్తానాం
హితవైభవ సుఖ- మిదమేవ,
సతతం శ్రీహరి-సంకీర్తనంత-
ద్వ్యతిరిక్త సుఖం-వక్తుం నాస్తి. ॥ఏవ శ్రుతి॥

బహుళ మరణ పరి-భవచిత్తానా
మిహపర సాధన- మిదమేవ,
అహిశయన మనో-హరసేవా త-
ద్విహరణం వినా-విధిరపి నాస్తి. ॥ఏవ శ్రుతి॥





సంసార దురిత-జాడ్య పరాణాం
హింసా విరహిత-మిదమేవ
కంసాంతక వేం-కటగిరి పతేః
శంసైవాప-శ్చాదిహ నాస్తి ॥ఏవ శ్రుతి॥

## భావామృతం

ప్రజలారా! ఇదిగో నేను తెలుపునదంతయు వేదమతమే. బాగుగా పరిశీలించిన ఇంతకంటే ఉత్తమమైన మతం మరొకటి లేదని గ్రహించండి.

ప్రతిసారీ మేలైన పుట్టుకలలోనూ వాటివల్ల కలిగే సుఖములయందును ఆసక్తి కలవారికి మేలుజేసే ఐశ్వర్య సుఖము ఇదొక్కటియే. నిత్యమూ శ్రీహరి గుణగానము వలన కలిగే సుఖమే సుఖము.దీనికంటేమేలైన సుఖము మరేదియైనాలేదు.

ప్రతి సారీ మరణం తప్పని సరిగా పొంది అవమానపీడిత హృదయులకు ఐహికాముష్మికముల రెండిటిలోను ఉత్తమ గతిని ఇచ్చే సాధన మిదొక్కటే. ఆదిశేషుడే పానుపుగా పవ్వళించు శ్రీ హరియొక్క రమ్యమైన సేవయే వేదవిదితమైన విధానము. మరిఇంకొకటి లేదు.

సంసారమనెడి దుస్తరమైన రోగము యొక్క వాతబడి నలిగిపోవు వారికి హింస లేని మార్గమిది యొక్కటే. కంసఘాతకుడైన శ్రీవేంకటేశ్వరుని మహిమలను బాగుగా కీర్తించుటకంటే ఇతరమైన మార్గము మరేదియును లేదు.

## 1-34

### మున్నుడి

ఆంజనేయుడు, నృసింహుడు తెలుగునాట ఇలవేల్పులు. ఆయా సందర్భాలలో అన్నమాచార్యులవారూ ఆ మహానుభావుల ఆలయాలను ఎన్నో ఊళ్ళల్లో సందర్శించి ఆశువుగా అద్భుతమైన కీర్తనలు చెప్పారు. ఏ దైవాన్ని కొలిచినా ఆయన భావనార్ణవంలో ఆంజనేయుడు కూడా తిరుమలేశుని బంటే. చేతులు ముడుచుకొని భక్తితో కొండలయ్య ముందు వినమ్రుడై నిలుచున్న అంజనీసుతుని ఇంతకంటే మధురంగా ఎవరన్నా కీర్తించగలరా? అజరామరణమైన సంకీర్తన ఇది.

**చం॥ వెనకడుగేయకుండ వినువీధికి దూకెను లంకజేరగా**
**హనుమ, మహాద్భుతంబయిన ఆకృతి జూచిన వానరోత్తముల్**
**మనుముల శాంతినొందిరట, మారుతి గొల్చెను అన్నమయ్య తా**
**ననఘుడు వేంకటేశ్వరుడు అంజని సూనుని దైవమంచనెన్.**

**రాగం : ధర్మావతి**

మంగాంబుధి హనుమంత నీశరణ
మంగవించితిమి హనుమంతా ॥మంగాం బుధి॥

బాలార్క బింబము ఫలమని పట్టిన
ఆలరి సేతల హనుమంతా
తూలనె బ్రహ్మాదులచే వరములు
ఓలి చేకొనిన ఓ హనుమంతా ॥మంగాంబుధి॥

జలధి దాట నీ సత్వము కపులకు
అలరి తెలిపితివి హనుమంత
ఇలయు నాకసము నేకముగా నటు
బలిమి పెరిగితివి భళి హనుమంత ॥మంగాంబుధి॥





పాతాళము లోపలి మైరావణు
ఆతల చంపిన హనుమంత
చేతులు మోడ్చుక శ్రీవేంకటపతి
నీతల కొలిచే హిత హనుమంత ॥మంగంబుధి॥

### భావామృతం

ఓమంగాంబుధి హనుమంతా! మేము నీకు శరణు అని వేడుకొంటున్నాము ప్రభూ! పసి బాలునిగా నున్నప్పుడే నీవు బాల భానుని బింబమును ఏదోపండు అనుకొని పట్టి తిన బోయావు.నీవన్నీ అల్లరి చేష్టలేనాయె! అప్పుడు జరిగిన పర్యవసానంగా బ్రహ్మాది దేవతల చేత సాటిలేని వరములను కానుకగా పొందావు.

శతయోజన విస్తీర్ణమైన సముద్రమును దాటి సీతాన్వేషణ జయప్రదంగా ముగించి, రామకార్యం నెరవేర్చి , నీ'సత్తా' ఏమిటో కిష్కింధలోని వానరులందరికీ తెలుపకనే తెలిపావు. భూనభోంతరాళము విస్తరించిన నీమహాకాయమును చూపి బలవంతుడవై పెరిగిన నీగొప్పతనం భళిరా! అసామాన్యం కదా!

పాతళలోక వాసియైన మైరావణుడనే రాక్షసుడొకడు రామలక్ష్మణుల మాయోపాయంతో ఎత్తుకుపోయి బలి ఇద్దామనుకొన్నాడు.

'బుద్ధిమతాం వరిష్ఠం' అని పేరొందిన హనుమ తన తెలివితేటలతో వానిని తుదముట్టించి రామలక్ష్మణులను రక్షించాడు. అంతటి మహోన్నతుడైన ఈ మంగాంబుధి హనుమ తన చేతులన సవినయంగా ముడుచుకొని, శ్రీవేంకటేశ్వరుని (తన శ్రీరామచంద్రుని మారు రూప మన్నట్లుగా) సవినయంగా ఇక్కడ కొలుస్తున్నాడు హితములను గూర్చు ఈ హనుమంతుని అంజలి ఘటించి ఆరాధించండి.

## 1-35

### మున్నుడి

భీభత్సరస ప్రధానంగా సాగిన అద్భుతమైన సంస్కృత కీర్తన ఇది. అహోబల నారసింహుని భీభత్సరూపుని వర్ణిస్తూనే ఆయనను విశ్వరచనా నిపుణుడనీ, నవనవ ప్రియగుణా సముద్రుడనీ, లోకరక్షకుడు వేంకటేశ్వరుని ప్రత్యవతారమనీ వర్ణిస్తున్నారు తాళ్ళపాక ఆచార్యులు. భీభత్సం జరుగుతుంటే నిలకడ ఉండదన్నట్లుగా భావామృత వివరణ కూడా నేను భయంతో చెప్పినట్లే ఉన్నది. నిదానంగా లేదు. పద్యం కూడా అనుకోకుండా "శార్దూలమే" ఆవిర్భవించింది. అన్నమయ్య అమరకృతి ఇది.

**శా॥ ఫాలాక్షున్ తలపించు భీకరుడు తాన్ ప్రహ్లాదు రక్షింపగా**
**లీలామానుష సింగమాయె భళిరా! లేరీ మహిన్ సాటి, నా**
**వీలా? ఆ హరి దివ్య రూపు పొగడన్ వేదాలకున్ కానిచో**
**శీలించీ విధి అన్నమయ్య తెలిపెన్ సేవించె వేంకన్నగా.**

**రాగం : శ్రీరాగం**

ఫాలనేత్రానల ప్రబల విద్యుల్లతా-
కేలీ విహార లక్ష్మీనారసింహ ॥ఫాలనేత్రా॥

ప్రళయ మారుత ఘోర భస్మికా పూత్కార-
లలిత నిశ్వాస డోలా రచనయా
కులశైల కుంభినీ కుముదహిత రవి గగన-
చలన విధి నిపుణ నిశ్చల నారసింహా ॥ఫాలనేత్రా॥

వివరఘన వదన దుర్విధిహసన నిఘ్నూత-
లవదివ్య వరుష లాలా ఘటనయా
వివిధ జంతువ్రాత భువన మగ్నీకరణ
నవనవ ప్రియ గుణార్ణవ నారసింహా ॥ఫాలనేత్రా॥





దారుణోజ్జ్వల ధగద్ధగిత దంష్ట్రానల వి-
కారస్ఫులింగ సంగక్రీడయా
వైరిదానవ ఘోర వంశ భస్మీకరణ
కారణ ప్రకట వేంకట నారసింహా ॥ఫాలనేత్రా॥

### భావామృతం

ఈ అహోబల నరసింహుడు నుదుట వహ్నినేత్రుడైన లక్ష్మీనరసింహుడు, బలీయమైన మెరుపుతీగెల వంటి కాంతులు ప్రస్ఫుట మవుచుండగా కేళి విహారమును సలుపుచున్నవాడు.

ప్రళయకాలము నాటి ఝంఝామారుతములు వీచుచుండగా భస్మీపటలమొనర్చు ఘోరమైన పూత్కారము సలుపుచూ అంతలోనే లలితమైన ఉచ్ఛ్వాస నిశ్వాసముల డోలలూపుచుండగా ఆవృతంబైన కులపర్వతములను, భూమ్యాకాశములను, సూర్యచంద్రులను ఉయ్యాలలూపు చున్నప్పటికీ, తను నిశ్చలంగా వుండే నైపుణ్యం కలవాడీ లక్ష్మీనరసింహుడు.

విస్తరించిన పెద్ద ముఖమున భీకరాట్టహాసము ప్రకటించుచుండగా ధారగా లాలాజలము రాశిగా కారుచుండగా అనేకములైన జీవులను కలిగిన ప్రపంచమును అగ్నికీలలలో భస్మీపటల మొనర్చుచు అరుదైన కొంగ్రొత్త గుణ సముద్రుడై ఈ లక్ష్మీనరసింహుడు ప్రకటితమైనాడు.

ధగధగమని మెరయుచున్న భీకరమైన కోరలనుండి దారుణమైన స్ఫులింగములు (నిప్పురవ్వలు) వెలువడి క్రూరులైన దానవులను, వారి వంశములను బూడిదపాలు చేయుచుండగా ఆ వినాశనమునకు కారణమై ప్రకటింపబడిన ఈ నరసింహుడు వేరెవ్వరో కాదు, ఆ వేంకటేశ్వరుని తొలిరూపమైన వేంకట నారసింహుడు.

(అందుకనే ఆంధ్రదేశంలో వేంకట నారసింహుని పేరు పెట్టుకొన్న వెంకట నరసయ్యలు లెక్కకు మిక్కుటంగా వున్నారు.)

**1-36**

## మున్నుడి

లలితంగా వేంకటరమణుని లలనను కీర్తిస్తున్నారు అన్నమయ్య. ఎన్నిసార్లు విన్నా ఎన్నిసార్లుపాడినా తనివితీరని సుధావాహిని ఈ అమ్మవారి సంకీర్తన. సంగ్రామ లక్ష్మీ అని నుతిస్తూ సత్యభామ నీలవర్ణుని రథంపై వీరవిహారం చేసి నరకుని నరకటాన్ని గుర్తుచేస్తున్నారు. చంద్రసహోదరని, బ్రహ్మాదులకు కల్పవల్లి అనీ, గోవిందుని తోడునీడ అనీ, వేదసన్నుత అనీ, వేంకటేశ్వరుని వెలది అనీ నిధుల నిధానమనీ, దేవిని స్వామి ఉరమును ఆక్రమించిన తల్లిగా కీర్తిస్తున్నారు. ఇంకా ఏం చెప్పను?

**కం॥ జయముల నొసగే తల్లిని**
**నయముగ తానన్నమయ్య నళినిని గొలిచెన్**
**ప్రియయని వేంకటవిభునికి**
**జయలక్ష్మిని యిటునుతించె సంగ్రామ సిరిన్**

**రాగం : లలిత**

జయలక్ష్మి వరలక్ష్మి సంగ్రామ వీరలక్ష్మి
ప్రియురాలవై హరికి బెరసితివమ్మ ॥జయలక్ష్మీ॥

పాలజలనిధిలోని పసనైన మీగడ
మేలిమి తామరలోని మించు వాసన
నీలవర్ణునురముపై నిండిన నిధానమవై
ఏలేవు లోకములు మమ్మేలవమ్మ ॥జయలక్ష్మీ॥

చందురుతోడ బుట్టిన సంపదల మెఱుగవో
కందువ బ్రహ్మలగాచే కల్పవల్లివో
అందిన గోవిందునికి అండనే తోడునీడై
వుందానవు మాయింటనే వుండవమ్మ ॥జయలక్ష్మీ॥





పదియారు వన్నెల బంగారు పతిమ
చెదరని వేదముల చిగురుబోడి
ఎదుట శ్రీవేంకటేశు నిల్లాలవై నీవు
నిధుల నిలిచే తల్లి నీ వారమమ్మ ॥జయలక్ష్మీ॥

## భావామృతం

అమ్మా! జయలక్ష్మీ! వరలక్ష్మీ దేవీ! యుద్ధరంగంలో వీర విహారం చేసే సంగ్రామ లక్ష్మీ! నీవు శ్రీమన్నారాయణునకు ప్రియురాలవై అవతరించినావు (సత్యభామగా భావన)

నీవు పాలసముద్రమునుండి వెలువడిన పసందైన మీగడవు తల్లీ! శ్రేష్ఠమైన పద్మము యొక్క పరిమళము కూడ నీవే. నీలమేఘచ్ఛాయతో మెరిసిపోయే శ్రీహరి వక్షస్థలమును ఆక్రమించిన సౌభాగ్యలక్ష్మివి. లోకములనన్నింటిని పరిపాలించు దానివి. అందుచేత మమ్ముకూడా పరిపాలించుము తల్లీ!

దేవదానవులు క్షీరసాగరమును మధించినప్పుడు చంద్రునితో పాటు పుట్టి సంపదలన్నింటికీ నీవే సామ్రాజ్ఞివైనావు. బ్రహ్మాదులను రక్షించే కల్పవల్లివై గోవిందునకు తోడు నీడవు అండదండవూ అయి ఉన్నదానవు. మాగృహమున స్థిరపడు తల్లీ!

పదహారు వన్నెలు గల (నేటి కాలంలో 24 కారెట్లు) బంగారు బొమ్మవు తల్లీ! నీవు స్థిరముగా వేదములన్నింటిలోను కీర్తింపబడిన కుసుమపేశలవు. మా ఎదుట ఇలవేల్పుగా వెలసిన శ్రీవేంకటేశ్వరుని అర్థాంగివై నీవు నవనిధులని కీర్తింపబడే ఆ సంపదలకు ఆస్థానమై వున్నదానవు. ఓ జగజ్జననీ! మమ్ము మరువకు తల్లీ! మేము పరాయివారముకాము. నీ వారమే నమ్మా!

## 1-37

### మున్నుడి

పోతన గారి భావాలు అన్నమాచార్యులవారు కీర్తన రూపంలో వెలువరిస్తున్నారు. నరులజీవన విధానాన్ని నిరసిస్తున్నారు. కాసులకోసం రాజుల (ధనికుల) కాళ్ళకు దాసోహం అనే బ్రతుకుల్ని ఛీకొడుతున్నారు. అడవిలో పశు పక్షాదిగా వుంటే నయము కదా! అంటున్నారు. చెట్టై జీవించినా నష్టమేమి ఒకరికి బానిసయ్యేకంటే అంటున్నారు. హరిదాసులు వేంకటేశ్వరుడే దిక్కు అనాలి గాని పాపకృత్యములు చేసి హీనంగా జీవనం గడపవచ్చునా? అంటున్నారు. భళీ! భళీ!

**ఉ॥ మాయలమారి మానువుడు మాధవుగాదని'తొత్తు'రాజు కై**
**చేయుచు ఘోరకృత్యములు శీఘ్రమె'జంతువు' మించిభ్రష్టుడై**
**పోయెను,వేంకటేశ్వరుని ఊహదలంప దధోగతిన్ బడెన్**
**ఛీ! యని ఛీత్కరించిటుల చెప్పెను కీర్తన నన్నమయ్యహో!**

**రాగం : చక్రవాకం**

ఛీ ఛీ నరులదేటి జీవనము
కాచుక శ్రీహరి నీవె కరుణింతుగాక ॥ఛీ ఛీ॥

అడవిలో మృగజాతియైనా గావచ్చుగాక
వడి నితరుల గొలువగ వచ్చునా
వుడిలోని పక్షియై వుండనైనా వచ్చుగానీ
విడువకెవ్వరినైనా వేడువచ్చునా ॥ఛీ ఛీ॥

పసురమై వెతలేని పాటు పడవచ్చు గాక
కసటువో నొరుల బొగడగా వచ్చునా
వుసురు మానై పుట్టివుండనైన వచ్చుగాక
విసువక వీరివారి వేసరించవచ్చునా ॥ఛీ ఛీ॥





యెమ్మెల బుణ్యాల సేసి యిల యేలవచ్చుగాక
కమ్మి హరిదాసుడు గావచ్చునా
నెమ్మది శ్రీవేంకటేశ నీచిత్తమే కాక
దొమ్ముల కర్మములివి తోయవచ్చునా ॥ఛీ ఛీ॥

### భావామృతం

ఛీ! ఛీ! ఈమానవుల దెంత దౌర్భాగ్యమైన జీవితము!! వీరిని ఆ శ్రీహరియే రక్షించాలి కాని ఇక ఎవ్వరి వలన అయ్యేపని కాదు.

అధికారంలో వున్న మానవుల దాస్యంచేసి బ్రతుకుట కంటే అడవిలో ఏ మృగంగానైనా జీవించవచ్చును కదా! అన్యులను కొలువవచ్చునా? శాశ్వతంగా పక్షిగానైన జీవించవచ్చును కాని అదే పనిగా ఎవ్వరినైనా అర్థించ వచ్చునా?

మానవుడు పశువు వలె నిరంతరం అవిశ్రాంతంగా గడపవచ్చును కానీ, కోరికలతో సిగ్గువిడచి ఇతరులను పొగడవచ్చునా? జీవితాంతం వృక్షమై పడివుండవచ్చును. కాని విసుగుకూడ లేకుండ వారినీ వీరిని దేబిరించవచ్చునా? అది ఎంతమాత్రము మంచిదికాదు.

విశిష్టత కలిగి ఎన్నో పుణ్యములు చేసిన పుణ్యఫలంగా ఈ భూమండలాన్నేల వచ్చును గాక! వివరముతో శ్రీహరిదాసులు అవటం సాధ్యపడుతుందా? ఓ శ్రీ వేంకటేశ్వరా నీ ఇష్టప్రకారం కాక దొమ్మిగాపైనబడే కర్మలను అధిగమించటం అనేది జరుగుతుందా? ఎన్నటికీ జరుగదు.

**1-38**

## మున్నుడి

అన్నమాచార్యులవారు ఆదిశేషునిపైన జెప్పిన అద్భుతమైన కీర్తన ఇది. ఆయన ఈ కీర్తనకు ఎన్నుకొన్న రాగంకూడ"నాగగాంధారి" ఆయన సమయస్ఫూర్తి చూడండి. వేయిపడగలతోను, శిరసులపై మణులతోను, రెండువేలనాలుకలతోను, నల్లని శరీరఛాయతోను వెలిగిపోతున్నాడా ఆదిశేషుడు వేంకటరమణుడు అలిమేలు మంగలే శ్రీహరి, ఆదిలక్ష్మి రూపాలలో ఆదిశేషునిపై విడిసియున్నారని కీర్తిస్తున్నారు అన్నమయ్య.

**ఆ.వె.॥ ఆదిలక్ష్మి కొలుచు నాదిశేషుని పైన**
**పవ్వళించియున్న పతిని హరిని**
**అన్నమయ్య పాడె నాదిశేషుని పైన**
**అద్భుతమగు కృతిని అవధరించి.**

**రాగం : నాగగాంధారి**

వీడుగదే శేషుడు శ్రీవేంకటాద్రి శేషుడు
వేడుక గరుడనితో బెన్నుద్దైన శేషుడు ॥వీడుగదే॥

వేయి వడిగెలతోడ వెలసిన శేషుడు
ఛాయమేని తళుకు వజ్రాల శేషుడు
మాయని శిరసులపై మాణికాల శేషుడు
యే యెడ హరికి నీడై యేగేటి శేషుడు ॥వీడుగదే॥

పట్టపు వాహనమైన బంగారు శేషుడు
చుట్టు చుట్టుకొనిన మించుల శేషుడు
నట్టుకొన్న రెండు వేల నాలుకల శేషుడు
నెట్టనహరిపొగడు నేరుపరి శేషుడు ॥వీడుగదే॥





కదిసి పనుల కెల్ల కాచుకున్న శేషుడు
మొదలి దేవత లెల్ల మొక్కే శేషుడు
అదె శ్రీ వేంకటపతి కలమేలు మంగకును
పదరక యే పొద్దు పానుపైన శేషుడు ॥వీడుగదే॥

## భావామృతం

శ్రీ వేంకటాద్రిపైన నెలకొన్న శేషుడు వీడే కదా! ఆ శేషుడు. వేడుకగా గరుత్మంతునితో పెన్నిధివలె వెలసి యున్నవాడీ ఆదిశేషుడు.

ఈ ఆదిశేషుడు సహస్రఫణి (వేయి పడగలు కలవాడై) యై వెలసియున్నాడు. వజ్రకాంతి సన్నిభుడైన ఈతని మేనిఛాయం నిగనిగలాడు నల్లని నలుపు.శుభ్రముగానున్న ఈతని శిరస్సులపై మాణిక్యములున్నవి. ఏవేళనైనా శ్రీ హరికి నీడవలె తోడై వెళ్ళే రక్షకుడే ఈ శేషుడు.

బంగారము వలె విలువైన ఈ శేషుడు నారాయణునికి పట్టపు వాహనము. చుట్టలు చుట్టుకొని అతిశయించిన ఠీవితోనున్నాడీ ఆదిశేషుడు.రెండు వేల నాలుకలు ఈ ఆదిశేషునికి కుదురుకొని యున్నవి. తప్పక శ్రీహరిని కీర్తించు నేర్పుకలవాడే ఈ ఆదిశేషుడు. ఎప్పుడూ వెంటనుండి ఏ పని చెబుతారోనని కాచుకొని ఉంటాడీ ఆదిశేషుడు. దేవతలందరూ కలసి విష్ణువుని సమీపించు వేళ ముందు మొక్కునదీ శేషునికే.

అదిగో శ్రీవేంకటేశ్వరునకు అలమేలు మంగమ్మకు శీఘ్రమే యే వేళనైనా పాన్పుగానున్న వాడే కదా! ఈ ఆదిశేషుడు.

**1-39**

## మున్నుడి

నానాటి బ్రతుకు నాటకము, మమ్మల్ని ఈ భ్రమలోంచి విముక్తుల్ని చేయమని ప్రార్థించిన అన్నమాచార్యుల వారీ కీర్తనలో ఈ జీవుడు ఇదివరకెందరికి పుట్టాడు? ఎందరిని మోహంలో పడవేశాడు? ఎందరికి చుట్టమయ్యాడు? ఎన్ని పదవులు పొందాడు? వేంకటేశ్వరుని మాయతెలుసు కొనుట సాధ్యమా? అంటున్నారీ కీర్తనలో. అభిమన్యుడి మృతికి రోదిస్తూ తననే నిందించిన అర్జునుడి ఈ'భ్రమ' తొలిగిపోవుటకు శ్రీ కృష్ణపరమాత్మ ఆతనిని దివ్యలోకానికి తీసుకొని పోయి'అభిమన్యుని' చూపించాడట. నాయనా! అని కౌగలించబోతున్న ఆ క్రీడితో 'పోపోవయ్యా నీవెవరు? నేనెవరు' అని భ్రమ తొలగించాడట ఆ కొడుకు.

**ఉ॥ ఎందరికో తనూజుడయి యెందరి తోడనొబుట్టు జీవుడా**
**నందము కంటినీరొసగు ఆవల వేఱొక జన్మమెత్తు తా**
**నెందును వేంకటేశ్వరుని 'ఇచ్ఛ' నెరుంగడు 'మాయ' నేర్వడున్**
**పొందుగ జెప్పెనన్నమయ వూరట నిచ్చెను నాదు బోంట్లకున్**

**రాగం : నాట**

ఎవ్వరెవ్వరి వాడొ యీ జీవుడు చూడ-
నెవ్వరికి నేమౌనొ యీ జీవుడు ॥ఎవ్వరెవ్వరి॥

ఎందరికి కొడుకు గాడీ జీవుడు, వెనుక
కెందరికి దోబుట్టడీ జీవుడు
ఎందరిని భ్రమయించడీ జీవుడు, దుఃఖ
మెందరికి గావింపడీ జీవుడు ॥ఎవ్వరెవ్వరి॥





ఎక్కడెక్కడ దిరుగడీ జీవుడు, వెనుక-
కెక్కడో తన జన్మమీ జీవుడు
ఎక్కడి చుట్టము తనకు నీజీవుడు ఎప్పు
డెక్కడికి నేగునో యీ జీవుడు ॥ఎవ్వరెవ్వరి॥

ఎన్నడును జేటులేనీ జీవుడు, వెనక
కెన్ని తనువులు మోవడీ జీవుడు
ఎన్నగల తిరువేంకటేశు మాయల దగిలి
యెన్ని పదవుల బొందడీ జీవుడు ॥ఎవ్వరెవ్వరి॥

## భావామృతం

జీవుడు ఎవరెవరి వాడో తెలియుట సాధ్యామా? వీడు ఎవ్వరికేమవుతాడో తెలుసుకోగలమా?

ఇదివరలో వీడు ఎంతమందికి కొడుకయ్యాడు? ఎంతమందికి వీడు తోడబుట్టువైనాడు? ఎంతమందిని ఈ జీవుడు నావాడు నాస్వంతం అనే భ్రమలో ముంచి వాడి వియోగంతో దుఃఖ సాగరంలో ముంచాడు?

పూర్వ జన్మలలో ఈ జీవుడు ఎక్కడెక్కడ తిరిగాడో కదా! వీడు ఎక్కడెక్కడ జన్మించాడో? తనకు తానే ఎన్ని విధములుగా చుట్టరికం మారాడో కదా! (తనే మళ్ళీ తనమనుమడికే కూతురైపుడితే తనకు తానేమవుతాడు? ఏమో....) ఈ విధంగా జన్మలలో తిరుగాడి ఎక్కడెక్కడికి పోతాడో? ఎవరికి తెలుసు? అది ఎవరు చెప్పగలరు?

నిజానికి ఈజీవుడికి ఎన్నడూ చేటు (నాశనము) లేదు. వీడు నిత్యుడు. ఎన్నో శరీరాలను ధరిస్తూనే వుంటాడు. సర్వశ్రేష్ఠుడైన తిరుమలనాథుడు శ్రీ వేంకటేశ్వరుని మాయలో చిక్కుకొని ఎన్ని పదవులు పొందాడు? దీనికి అంతు ఉన్నదా?

## 1-40

### మున్నుడి

అత్యంత మధురమైన మంగళగీతిక పాడుతున్న అన్నమాచార్యులను ఆలకించండి. జన్మ చరితార్ధమైపోతుంది. నిత్యకళ్యాణ వేదిక తిరుమల. నిత్యపెండ్లి కుమారుడు వేంకటనాధుడు. శ్రీదేవి భూదేవి నిత్యము ఆస్వామి నూతన వధువులే. మన బోటి మానవ మాత్రులకి కనిపించకపోయినా బ్రహ్మాది దేవతలు అఖిల మునీశ్వరులు పరమానందంతో కన్నుల పండువగా వీక్షించే మహోత్సవమది. మన్మధుని తండ్రి మనువు కాబట్టి హారతులీయండి ఓ వనితామణులారా అంటున్నారు అన్నమయ్య.

**కం॥ ఆరతులెత్తుచు తానీ**
**తీరుగనా అన్నమయ్య దేవేరులతో**
**ఊరేగు వేంకటేశుని**
**కోరిక తీరంగ పాడికొలిచెను వినుడీ.**

**రాగం : సురటి**

అంగన లీరె యారతులు
అంగజ గురునకు నారతులు ॥అంగన॥

శ్రీ దేవి తోడుత చెలగుచు నవ్వే
ఆదిమ పురుషుని కారతులు
మేదినీ రమణి మేలము లాడేటి
ఆదిత్య తేజున కారతులు ॥అంగన॥

సురలకు నమృతము సొరిది నొసంగిన
హరికిది వో పసిడారతులు
తరమిది దుష్టుల దనుజుల నడచిన
అరిభయంకరున కారలులు ॥అంగన॥





నిచ్చలు కళ్యాణ నిధియై యేగేటి-
అచ్చుతునకు నివె యారతులు
చొచ్చి శ్రీ వేంకటేశుడు నలమేల్మంగ
యచ్చుగ నిలిచిరి యారతులు ॥అంగన॥

### భావామృతం

ఓ వనితల్లారా! హారతులెత్తండమ్మా! మన్మధునికే తండ్రి అయిన ఈ మహానుభావుడికి హారతులనీయండి.

శ్రీదేవితో ఏదో చలోక్తికి నవ్వుతున్న ఈ ఆదిపురుషునికి హారతుల నీయండి. భూదేవితో సరసములాడుచు దర్శనమిస్తున్న ఈ సూర్యతేజో విరాజితునికి మీరంతా హారతులనీయండి.

దేవతలకు మోహినీ అవతారమున వరుసలో నిలువ జేసి అమృతము పంచి ఇచ్చిన హరికి ఇవే బంగారు హారతులు. దుర్మార్గులైన దానవులను వరుసగా మట్టుబెట్టిన హరికి హారతులివియే.

నిత్య కళ్యాణము జరిపించుకొని ఊరేగు అచ్యుతునికి ఇవే మంగళహారతులు. ఆవిర్భవించిన శ్రీ వేంకటేశ్వరుడు అలిమేలు మంగమ్మ చక్కగా నిలిచియున్నారు. వారికివే కర్పూర నీరాజనములు.

## 1-41

## మున్నుడి

శ్రీ కృష్ణ పరమాత్మ విశ్వరూపమును దివ్య చక్షువులతో మాత్రమే పార్థుడు చూడగలిగాడంటే, మాకే అన్నీ తెలుసుననుకొనే 'ఘనులు' ఇది అభూతకల్పన అని కొట్టిపారేస్తారు. కానీ "నైట్ విజన్ గ్లాసెస్" తో ఆర్మీ వాళ్ళు చీకట్లో చూడగలరంటే 'ఓహో' అంటారు. పరిమిత దృష్టి, పరిమిత వినికిడి, పరిమిత ఘ్రాణ శక్తి గల మానవులకు అపరిమితమైన శక్తి గల సర్వేశ్వరుని చూచే సామర్థ్యం ఉన్నదా? 'రేడియో' తరంగాలు అంతకు మించిన 'ఫ్రీక్వెన్సీ' గల తరంగాలను గ్రహించాలంటే దానికి తగిన 'రిసీవర్' ఉండాలికదా! రేడియోలో దృశ్యం చూడగలమా? రేడియేషన్ కనిపించనంత మాత్రాన లేదా? పరమాత్మపై మనస్సు లగ్నం చేయుటకు భక్తి కావాలి. మనస్సు లగ్నమైతే మన మనోనేత్రానికి ఆ స్వామి మనం 'భావించిన' రూపంలో కనిపిస్తాడు. ఆ రూపం శ్రీ రాముడా, శ్రీ కృష్ణుడా, విఠలుడా, శివుడా, బ్రహ్మ అనేది ఆ భావించే భక్తునిపై ఆధారపడి వుంటుంది. పదియారు సంవత్సరాల ప్రాయంలో పరమాత్మను వేంకటేశ్వరుని రూపంలో దర్శించిన అన్నమయ్య కమలాసనుని (బ్రహ్మ) తో సేవించబడే స్వామిని కనక రత్నకిరీటధారిగా, శంఖచక్రాయుధునిగా కూడా కలలో సాక్షాత్కరింప చేసుకొన్నారు. తిరువేంగటనాథుని అట్లా దర్శించిన అన్నమయ్య తొంబది నాలుగేళ్ళ వాడై స్వామిలో లీనమయ్యేదాకా ముప్పది రెండువేలకు పైగా కీర్తనలు చెప్పారు. మూడింటరెండువంతుల కీర్తనలను మన దురదృష్టం కొలది పోగొట్టుకొన్నాం. మిగిలిన కీర్తనలనన్నా దక్కించుకోవటానికి ఎందరో మహానుభావులు కృషి చేశారు, చేస్తున్నారు, ఇకముందు చేస్తారు....

**చం॥ కలగని వేంకటేశ్వరుని గాంచెను ధన్యుడు అన్నమయ్యతాన్**
**నిలిపెను కైటభాంతకుని నేత్రపు ముంగిట నెంత భాగ్యమో!!**
**నళినిమనోవిభున్ గనుట నా సరి వారలకెట్లు సాధ్యమౌ?**
**చెలువము తోడ పాడి హరి జిత్తమునందున నిల్పుకొందికన్**

**రాగం : బౌళి**

ఇప్పుడిటు కలగంటి నెల్ల లోకములకు-
నప్పడగు తిరువేంకటాధీశు గంటి ॥ఇప్పుడిటు॥





అతిశయంబైన శేషాద్రి శిఖరము గంటి
ప్రతిలేని గోపురప్రభలు గంటి
శతకోటి సూర్యతేజములు వెలుగగ గంటి
చతురాశ్యు పొడగంటి చయ్యన మేలుకొంటి ॥ఇప్పుడిటు॥

కనకరత్న కవాట కాంతు విరుగడ గంటి
ఘనమైన దీపసంఘముల గంటి
అనుపమ మణిమయ మగుకిరీటము గంటి
కనకాంబరము గంటి గ్రక్కున మేలుకొంటి ॥ఇప్పుడిటు॥

అరుదైన శంఖచక్రాదు విరుగడ గంటి
సరిలేని అభయ హస్తమును గంటి
తిరు వేంకటాచలాధిపుని జూడగ గంటి
హరిగంటి గురుగంటి నంతట మేలుకొంటి ॥ఇప్పుడిటు॥

**భావామృతం :**

(కలలో తనకు దివ్యదర్శనమొసగిన శ్రీ వేంకటేశ్వరుని ప్రత్యక్షానుభవాన్ని వర్ణిస్తున్నారు అన్నమాచార్యుల వారు. ప్రతి పాదంలోను ఆ అనుభూతిని గమనించండి.....) ఇప్పుడు నేనొక దివ్యస్వప్నమునుగాంచితిని. ఆ స్వప్నంలో సమస్తలోకములకు తండ్రియైన పవిత్రమూర్తి శ్రీవేంకటేశ్వరుని దర్శించితిని.

ఆకలలో సర్వశ్రేష్టమైన శేషాచలమును చూచితిని. సరిసమానమనునదేలేని గోపురము యొక్క దివ్యకాంతులను చూచితిని. నూరుకోట్ల సూర్యుల అద్భుత కాంతిగలతేజస్సు నొకదానిని గాంచితిని. చతుర్ముఖుడైన బ్రహ్మను జూచితిని. అంతలోనే చటుక్కున మేలుకొంటిని.

రెండువైపులా రత్నఖచితమైన బంగారు తలుపులను చూచితిని. ఘనమైన దీపసమూహములను దర్శించితిని. సాటిలేని మణులు తాపినకిరీటములను చూచితిని. మేలిమి వస్త్రములను దర్శించితిని. వెంటనే నేను మేలుకొంటిని.

అరుదుగా కాని కనబడని దివ్య శంఖచక్రములను చూచితిని. సాటిలేని అభయహస్తమును దర్శించితిని. ఆ స్వప్నమున తిరుమలనాయకుని జూచితిని. జగద్గురువైన శ్రీహరిని దర్శించితిని. వెంటనే నేను మేలుకొంటిని.

1-42

## మున్నుడి

అన్నమాచార్యుల వారి కొన్ని సంస్కృత సంకీర్తనలు అర్ధమైనట్లే కనిబంచినా ప్రతి పదార్ధం చెప్పమంటే 'తెల్లమొఖం' వేయాల్సిందే. నిష్ణాతులే ఏదో "టూకీగా" అయిందనిపిస్తారు. ఇది నిజం. అటువంటి కోవలోని ఈ సంకీర్తన వినండి. నానా అవస్థలుపడిన తరువాత మాత్రమే దీని భావామృతం ఒక మోస్తరుగా వ్రాయుట సాధ్యపడింది. శ్రీ హరిని కీర్తిస్తున్నారు. ఘోరదానవుల రుధిరసమారాధన జేసిన నారాయణుని శ్రీ వేంకటేశ్వరునిగా కీర్తిస్తున్నారు తాళ్ళపాక గురుదేవులు.

**మ॥ అదిగో విష్ణు సుదర్శనంబు వెడలెన్ అత్యద్భుతంబౌధృతిన్**
**బెదరెన్ గుండెలు దైత్యసంఘములకున్, వేసారుభక్తాళియున్**
**ముదమున్‌బొందిరి,అన్నమయ్యతెలిపెన్‌మోక్షప్రదంబౌకృతిన్**
**ఇదివో వేంకటనాధుడీయ శరణన్ ఏబాధరాబోదురా**

**రాగం : నాట**

మర్ద మర్ద మమ బంధాని
దుర్ధాంత మహా దురితాని ॥మర్ద మర్ద॥

చక్రాయుధ రవిశత తేజోంచిత
సుక్రోధ సహస్ర ప్రముఖా
విక్రమక్రమా విస్ఫులింగకణ
నక్రహరణ హరి నవ్యకరాంకా ॥మర్ద మర్ద॥

కవిలి సుదర్శన కఠిన విదారణ
కులిశ కోటి భవ ఘోషణా
ప్రళయానల సంభ్రమ విభ్రమకర
రళిత దైత్యగళ రక్త వికీరణా ॥మర్ద మర్ద॥





హితకర శ్రీ వేంకటేశ ప్రయుక్త
సతత పరాక్రమ జయంకర
చతురోహం తే శరణం గతోస్మి
ఇతరాన్ విభజ్య ఇహ మాం రక్ష ॥మర్ద మర్ద॥

**భావామృతం :**

ఓ వేంకటేశ్వరా! నా బంధనములను తొలగింపుము. నాఘోరపాతకములను తెగటార్చును.

వందర విబింబముల దివ్య కాంతితో, క్రోధాపూరితమైన వేలకొలది ప్రముఖమౌ అగ్నికీలలు వెలువడుచుండగా మహాపరాక్రమముతో గజేంద్రమోక్షమునుకై మకరము యొక్క తల నుత్తరించిన శ్రీ హరి హస్తమునకే గుర్తుగా నిలిచిన చక్రాయుధ ధారీ! నన్ను రక్షింపుము

జగద్విఖ్యాతమైన సుదర్శన చక్రముచే కోటి వజ్రాయుధములంత కఠినమై, ప్రకటితమైన దానవ సమూహముల నందరినీ చీల్చి ప్రళయాగ్ని వలె ఆశ్చర్యకరమైన భీభత్సము సృష్టించి వారి రక్తమును దశదిశలకు విరజిమ్మిన వాడవైన ఓ తిరుమలేశా! నన్ను రక్షింపుము

హితప్రదాతవైన శ్రీ వేంకటనాయకా! ఎల్లప్పుడు నియోగింపబడెడి నీపరాక్రమము జయప్రదమైనది. నేను నేర్పరినై నీశరణము జొచ్చితిని. నన్ను ఇతరుల వలెనెంచక, రక్షింపుము తండ్రీ!

## మున్నుడి

ఎంతోమంది వాగ్గేయకారులు ఎన్నో రకములైన కీర్తనలు రచించారు. అద్భుతమైన రాగాలతో పాడి మరెందరికో రసస్ఫూర్తి కలిగించి ఆ బాలగోపాలాన్ని ధన్యులనుజేశారు. ఇది అందరూ తెలిసిన విషయమే. అన్నమాచార్యుల వారు భగవద్గీత శ్లోకాలను కీర్తనలో ఉటంకించారు. ఇది ఒక అద్భుతమైన ప్రక్రియ. నభూతో న భవిష్యతి. అసలు అన్నమయ్య కాదు ఆ కీర్తనలు చెప్పేది, వేంకటేశ్వరుడే కృష్ణావతారాన్ని పునరావృతం చేస్తూ అన్నమయ్య ద్వారా మనకు అందిస్తున్నట్లు అనిపిస్తున్నది. దీనినీ విధంగా వివరించడానికి ప్రయత్నం చేయుటం మాత్రం ఆ నామాలయ్య కృపయే.

**ఉ॥ ఇత్తరి గీత బోధనలు ఇంపుగ కీర్తనలందు జెప్పగా**
**ఉత్తమ భక్తితో పొసగు ఊరకె అన్యుల కెట్లు వీలగున్**
**చిత్తమునందు అన్నమయ చిన్నయ మూర్తిని వేంకటేశ్వరున్**
**గుత్తగ నిల్పి ఈ కృతిని కూరిమితో వినిపించెగా భళా!**

**రాగం : బౌళి రామక్రియ**

ఇదివో శ్రుతిమూల-మెదుటనే వున్నది
సరముగా హరి- చాటీ నదివో ॥ఇదివో॥

ఎనసి పుణ్యము సేసి-యేలోకమెక్కిన
మనికై భూమియందు- మగుడ బొడముటే
పొనిగి " యాబ్రహ్మా-భువనాలోకాః
పునరావృత్తి"యనె-బురుషోత్తముడు ॥ఇదివో॥

తటుకున శ్రీహరి-తన్ను నేకొలిచిన
పటుగతితో మోక్ష- పదము సులభమనె
ఘటన "మాముపేత్య తు- కౌంతేయ మమిని
నటన బునర్జన్మ- న విద్యతే" ॥ఇదివో॥





ఇన్నిటా శ్రీ వేంకటేశ్వరు సేవె
పన్నిన గతి నిహ- పరసాధన మదే
మన్నించి యాతడే- "మన్మనా భవ" యని
అన్నిటా నందరి-కానతిచ్చె. గాన ॥ఇదివో॥

## భావామృతం

ఇదిగో సకలవేదముల సారము మీయెట్టయెదుటనే యున్నది. సాదరముగా శ్రీ హరి అవతారమైన శ్రీ కృష్ణుడు నాడు వచించిన గీతావాక్యమే ఇది.

సరిగానెంచి పుణ్యములనాచరించి, మరణానంతరం ఏలోకము జేరినా మరల పుట్టుట మాత్రం భూమిపైననే."యా బ్రహ్మ భువనాల్లోకాః పునరా వర్తినోऽర్జునా" (బ్రహ్మ లోకముతో సహా స్వర్గాది లోకములలో దేనిని పొందినా, మరల జన్మనెత్తుటకు భూలోకమునకు రాక తప్పదు అర్జునా!) అని పురుషోత్తముడైన శ్రీ కృష్ణభగవానుడు గీతావాక్యముగా తెలిపెను.

ఆ శ్రీహరిని నేను (అన్నమయ్య) కొలిచెనంతనే తటాలున ఆయన మోక్షమును సిద్ధింపజేయును. "మాము పేత్యతు కౌంతేయ పునర్జన్మన విద్యతే" (అర్జునా! నన్ను పొందినవానికి ఈ భూమిపై మరల పునర్జన్మ ప్రాప్తించదు) అని ఆ స్వామి పార్థునికి నొక్కివక్కాణించెను.

ఇక వీటన్నిటితో పాటు తిరుమలాధీశుడైన శ్రీ వేంకటేశ్వరుడే ద్వాపరయుగము నాటి ఆ శ్రీ కృష్ణపరమాత్మ అయినందున ఆ స్వామి పాద సేవయే ఇహము పరము రెండిటిని సాధించుటకు సులభోపాయము. ఆనాటి కృష్ణుని వలె ఈ వేంకటరమణుడె "మన్మనాభవ" ( ఓ అర్జునా! నాయందే నీమనస్సును లగ్నం చేసికొనిన వాడవైయుండు) మని క్రీడితో పాటు మనందరికి ఆనతిచ్చెను.

**1-44**

## మున్నుడి

'రామ' అని ఒక్క సారి అంటేనే చేసిన పాపములన్ని తొలగిపోతాయంటారు కదా! రోజుకొక్కసారి 'రామ' అని అనుకొంటే చాలాదా నామ సంకీర్తనలు ఎందుకు అన్నారొక మిత్రులు. రామా అన్న నోటితోనే 'చాలదా?' అని ప్రశ్నించి ఆ పరంధాముని శక్తిని చులకన చేసి ఘోరపాపం చేశాము కదా! ఇట్లా తరిగేవి తరుగుతూనే వున్నాయి, పెరిగేవి పెరుగుతూనే వున్నాయి నిరంతరం రామ నామమే దిక్కు. నాడు తన కోదండంతో దుష్టశిక్షణ చేసిన ఆ రఘుకుల సోముడే నేడు కలియుగ ఆశ్రితరక్షకుడైన శ్రీ వేంకటేశ్వరుడు. అదను చిక్కినప్పుడల్లా రామాయణం కీర్తన రూపంలో గానం చేసి మనల్ని పునీతుల గావించిన అన్నమాచార్యుల వారికి మనం సదా ఋణస్థులమే కదా!

**కం॥ రఘుకుల దీపకుడై పలు**
**అఘముల బోద్రోలువాడు అద్రిజనుతుడున్**
**రఘువీరు నన్నమయ్యిటు**
**అఘములు తీర్చేటి వేంకటాధిపుడనియెన్.**

**రాగం : ఆనందభైరవి**

ఈతడు తారక బ్రహ్మమితడు మా దేవుడు
కౌతుకాన చెప్పే వినగదరే వో జనులు ॥ఈతడు॥

రాముడు ఇందీవర శ్యాముడు నానాసార్వ-
భౌముడు షోడశకళా సోముడు
దోమటి రాక్షసులను తుత్తుమురు సేసినాడు
కామిత ఫలములిచ్చి కాచినాడు సురుల ॥ఈతడు॥





పూర్ణుడు నీలముఘవర్ణుడు దానమున వి-
స్తీర్ణుడు వాహన సుపర్ణుడు
అర్ణవము దాటి రావణాదుల గెలిచినాడు
నిర్ణయించి చెప్పరాదు నేడీతని మహిమ ॥ఈతడు॥

వరుడు సీతకు పరాత్పరుడు కోదండ దీక్షా
గురుడు దివ్యామోఘ శరుడితడు
నిరతి శ్రీ వేంకటాద్రి నెలవైయుండేటి వాడు
సరి భరత లక్ష్మణ శత్రుఘ్న సహితుడు ॥ఈతడు॥

**భావామృతం**

ఈ శ్రీరామచంద్రుడే మోక్షప్రదాత అయిన పరబ్రహ్మ స్వరూపుడు. ఓ ప్రజలారా! రాముని గుణగణాలు కుతూహలం కలుగునట్లు చెబుతాను, మీరంతా వినండి. ఈ శ్రీ రాముడు నల్లకలువవంటి శరీరఛాయ గలవాడు. అనేక దేశములకు చక్రవర్తి. పదహారుకళలతో విరాజిల్లే చంద్రుని బోలినవాడు. దుర్మార్గులైన దానవులను చిన్నచిన్న ముక్కలుగా ఖండిచిన మహావీరుడు. దేవతలు కాంక్షించిన వన్నియునొసగి రక్షించినవాడు.

ఈ దాశరధి పరిపూర్ణకాముడు. నీలమేఘవర్ణుడైన అందగాడు. విస్తారముగా దానములు చేసినవాడు. (పిన తల్లికైకకు రాజ్యదానం నుంచి కాకాసురునికి ప్రాణదానం వరకు ఆయన చేయని దానం ఏమిటుంది?) గరుత్మంతుని వాహనముగా బొందిన నారాయణుడు. శతయోజన విస్తీర్ణమైన అర్ణవమును (సముద్రమును) దాటి రావణాసురుని గెలిచినవాడు. ఈ రోజున మనం ఈయన ఘనత ఇంతా అని నిర్ణయించి చెప్పటం అసంభవం.

ఈ రాఘవుడు సీతకు పతిదేవుడు. మనకు మోక్షప్రదాత. దుష్టశిక్షణకు ఎప్పుడూ సిద్ధముగానుంటానని దీక్షితుడై కోదండపాణియై నిలబడినవాడు. అమోఘమైన దివ్యశస్త్రాస్త్రములు కలిగినవాడు. ఆసక్తితో శ్రీ వేంకటాద్రిని తన నెలవుగా చేసికొనిన వేంకటేశ్వరుడే మనకు సీతా భరత లక్ష్మణ శత్రుఘ్న సహితుడై కనిపించుచున్న శ్రీ రామచంద్రుడు.

## 1-45

## మున్నుడి

ప్రసిద్ధనృసింహ క్షేత్రములలో కదిరియొకటి. రాయలసీమ లోని ఈ క్షేత్రాన్ని అలనాడు అన్నమాచార్యుల వారు దర్శించి ఆ స్వామిపై పలు ప్రఖ్యాత కీర్తనలు రచించారు. ఈ జ్వాలానరసింహుడు కాలరుద్రుని వంటి రౌద్ర స్వరూపుడు. దుర్జనభంజనుడైన ఆ నృసింహస్వామి నేటి తిరుమల వేంకటనాధుడై దర్శనమిస్తున్నాడు.

**సీ॥ కదిరి నృసింహుని కమనీయమూర్తిని**
**దీటుగా వర్ణించి తెలిపినారు**
**ఆర్తరక్షకుడైన అసురాంతకుని హరిన్**
**ప్రహ్లాదు బ్రోచిన వరదు గొలిచె**
**పదకవితాపితామహుడు ఈ 'అన్నయ్య'**
**ముక్తిమార్గము జూపి ముందునిలిచె**
**ఎవ్వారిలోనైన ఎనసి వేంకట విభున్**
**దర్శించు భక్తుండు ధన్యుడతడు**

**ఆ.వె॥ అడుగనేల రుచిని గడుసుగా తినుముందె**
**అవధరింపుడిద్ది అమృతమయము**
**దీనినెంత వినిన తనివితీరుట లేదు**
**ఏమి కీర్తనంబు ఎటుల చెబుదు?**

**రాగం :అఠాణ**

కదిరి నృసింహుడు కంభమున వెడలె
విదితముగా సేవింపరో మునులు ॥కదిరి॥

ఫాలలోచనము భయదోగ్రముఖము
జ్వాలామయ కేసరములును
కాలరౌద్ర సంఘటిత దంతములు
హేలాగతి ధరియించుక నిలిచె ॥కదిరి॥





ముడివడు బొమ్మలు ముంచిన ఊర్పులు
గడగడ నదరెటి కటములును
నిడుదనాలుకయు నిక్కుకర్ణములు
అడియాలపు రూపై వెలసె ॥కదిరి॥

సకలాయుధములు సహస్ర భుజములు
వికటన ఖంబులు వెసబూని
వెకలియగుచు శ్రీ వేంకటేశ్వరుడు
ప్రకటపు దుష్టుల భంజించె నిదివో ॥కదిరి॥

**భావామృతం :**

ఈ కదిరి నరసింహస్వామి స్తంభము నుంచి వెలువడి యున్నాడు. ఓ మునులారా! ఆ స్వామిని సుస్పష్టముగా కొలువుడు.

ఈ స్వామిని గమనించండి. నుదుట నేత్రము గల ఈ నృసింహుడు భయమును గొలుపు ఉగ్రమైన ముఖమును కలిగియున్నాడు. అగ్ని జ్వాలలవంటి సింగపుజూలు కలిగియున్నాడు. కాలరుద్రుని వలె కోపముతో పళ్ళునూరు చున్నాడు. తిరస్కార భావము ప్రకటించు కవళికలుగలవాడై ఈ నరసింహుడు నిలిచియున్నాడు.

ఈ స్వామి ముడిపడిన కనుబొమ్మలను కలిగియున్నాడు. గడగడమని అదురుచున్న దవడలను కలిగియున్నాడు. పొడవైన నాలుకతోయున్నాడు. నిక్కబొడుచు కొనియున్న చెవ్వులను కలిగియున్నాడు. ఈ నరసింహుని భీకరాకృతి మరువలేనిదైయున్నది. ఆ విధముగా నృసింహస్వామి వెలసియుండెను.

ఈ నృసింహుడు సమస్తాయుధములు సహస్ర భుజములు కలిగియున్నాడు. ఆయన గోళ్ళువాడిగా వంకరగానున్నవి. దుష్టులను అతిశీఘ్రముగా అశక్తులను చేసి సంహరించు (విరుచు) చున్నాడు. ఈ స్వామియే నేడు శ్రీ వేంకటేశ్వరుడై ప్రకటితమైనాడు.

## 1-46

### మున్నుడి

శృంగార నాయకుడు వేంకటేశ్వరుడు తన దేవేరితో ఏకశయ్యాగతుడై ఉన్నాడు. స్వామి చిలిపి పనులకి శ్రీదేవి

మనస్సులో ఆనందిస్తున్నాపైకి కపట కలహం అభినయిస్తున్నది. అతిశయించిన కదలికలు. (మరి వాగ్యుద్ధంతో పాటు కాళ్ళా వేళ్ళా పడటం తప్పదు కదా!) మంచానికి అలంకారంగా ఏర్పాటుచేసిన బొమ్మ చిలుకలు వారి కీచులాటకి అనుగుణంగా అవీ "కీచు కీచు" మంటున్నాయి. గంధము, పుప్పొడి, ప్రేయసీ ప్రియులు చెమటలు కక్కే మన్మధ రణరంగం. నందకం (స్వామివారి ఖడ్గం) వాటన్నిటినీ గమనించి ఉంటుంది తీరికగా. అందుకే అది అన్నమయ్యగా జన్మించి ఆ రహస్యాలను కీర్తనగా వివరిస్తోంది. ఇతరులకు ఇది సాధ్యమగునా..

**ఆ.వె॥ "కీచుకీచు" మనెడి కేళీ విలాసంబు**
**కన్నులందు నిలిపె నన్నమయ్య**
**వేంకటగిరి విభుని ప్రియురాలి శృంగార**
**మెవరు పాడగలరు యీ విధముగ?**

(ఇక్కడ శ్లేషని గమనించండి. ప్రేయసీ ప్రియులు కీచులాడుకొంటున్నారు. ప్రణయ పరాకాష్ఠలో మంచంపై అమర్చిన చిలుక బొమ్మలు మంచం కదలినప్పుడల్లా "కీచుకీచు" మంటున్నాయి. ఔరా!!)

**రాగం : హిందోళ**

జగడపు చనవుల జాజర
సగినల మంచపు జాజర ॥జగడపు॥

మొల్లలు తురుమున ముడిచిన బరువున
మొల్లపు సరసపు మురిపెమున
జల్లన పుప్పొడి జారగ పతిపై
చల్లే రతివలు జాజర ॥జగడపు॥





భారపు కుచముల పైపై కదు సిం
గారము నెరపెటి గందవొడి
చేరువపతిపై చిందగ పడతులు
సారెకు చల్లేరు జాజర ॥జగడపు॥

బింకపు కూటమి పెనగేటి చెమటలు
పంకపు పూతల పరిమళము
వేంకటపతిపై వెలదులు నించేరు
సంకుమదంబుల జాజర ॥జగడపు॥

### భావామృతం

శ్రీవేంకటేశ్వరుడు తన మనోహరి అలివేలుమంగతో ప్రణయ కలహం తరువాత తనకేళీ విలాపం చూపుతున్నారు. ఇక అక్కడ జగడపు చనువులే (ప్రణయ కలహములే). అదికూడా కపట కలహమే (జాజర). కీచుకీచుమనే మంచం (చిలుకబొమ్మలు కీచుకీచు మంటున్నాయట!!) మీద జాజర.

ఆమె కొప్పులో ముడిచిన మొల్లలు బరువుగా వ్రేలాడుచున్నవి. అధికమైన సరస సల్లాపముచే పుప్పొడిని శ్రీపతిపై చల్లగా అది జారి వేంకటపతి మేనిపై అలుముకొన్నది. ఇట్లు స్వామి చెంతనున్న అతివలు ఆ జాజరలో తామూ పాలుపంచుకొంటున్నారు.

శ్రీదేవి భారమైన స్తనయుగళంపైపైన గంధపు పొడిని శృంగారమందు వెదజల్లుచుండగా ఆమెపతికి చేరువయైనది. ఆ సమయంలో ఆమె చెలికత్తియలు శ్రీపతిపై కూడ మాటిమాటికీ గంధపు పొడిని జల్లుచుండిరి. జాజర జరుగుచునే యున్నది.

స్వామి బిగువైన ఆలింగనమున శ్రీరమణి పెనగులాడుచున్నది. చెమట అధికమై చిత్తడిగా మారినది. చందనం వంటి మేనిపూతులు, మృగమదము (జవ్వాది) వంటి సుగంధ భరితమై పూతల వలన శోభిల్లునట్లుగా శ్రీవేంకటపతిపై నింపుచున్నారు. ఆహా! అక్కడ రమణీయమైన జాజర జరుగుచున్నది.

**1-47**

## మున్నుడి

తొల్లి, శృంగార కీర్తనలో అంత రసస్ఫూర్తి చూపించిన అన్నమాచార్యులు ఈ కీర్తనలో వైరాగ్యం ప్రస్ఫుటింప జేస్తున్నారు. కాంతా, కాంచనములపై వ్యామోహం పోనిదే వైరాగ్యం సిద్ధించదు. ఆడదాని అందం బహు స్వల్పకాలపరిమితి కలది. ఇక ఆమె ఇచ్చే సుఖం ఎండమావిలాంటిది. ఆ సుఖం కోసం నరుడు వెంపర్లాడితే మృగతృష్ణలో నీరు త్రాగుదాం అనుకొనేవాడికి పట్టే గతియే పడుతుంది. తప్పదు. ఇక ధనం సంగతి ఆలోచిస్తే కలలో ఎంత సిరిలభించినా లాభమేముంది? కలలాంటిదే కదా! జీవితం. అందుకే శ్రీవేంకటేశ్వరుని శరణువేడితే సుఖం కదా!!

**చం॥ నెలతలపైన మోహముల నిత్యము దూరము సేయు జ్ఞానమున్**
**నిలువని యెండమావులవి నెమ్మదిగూల్చుమరింత దుఃఖమౌ**
**కలిమి లభించి స్వప్నమున కల్గునె లాభము? వేంకటేశ్వరున్**
**కొలువుదు అన్నమయ్యనెను గొప్ప నిజంబును ఆలపించెతాన్.**

**రాగం : రేవతి**

ఏడవలపేడ మచ్చికేడ సుద్దులు
ఆడుకొన్న మాటలెల్ల నవి నిజాలా ॥ఏడ వలపేడ॥

తొలుకారు మెఱపులు తోచి పోవుగాక
నెలకొని మింటనవి నిలిచీనా
పొలతుల వలపులు పొలసిపోవుగాక
కలకాలంబవి కడతేరీనా ॥ఏడ వలపేడ॥

యెండమావులు చూడ నేరులై పారుగాక
అండకు పోవ దాహమణగీనా
నిండినట్టి మోహము నెలతలమది చూడ
వుండినట్టే వుండుగాక వూతయ్యీనా ॥ఏడ వలపేడ॥





కలలోని సిరులెల్ల కనుకూర్కులేకాక
మెలకువ చూడనవి మెరసీనా
అలివేణుల మేలు ఆసపాటే కాక
తలపు వేంకటపతి తగిలీనా ॥ఏడ వలపేడ॥

## భావామృతం

ఈ ప్రపంచంలో 'ప్రేమ', 'మాలిమి', 'ఆత్మీయత' వంటివి ఉత్తిమాటలు. అవన్నీ నిజాలా? అలా భ్రమపడవచ్చునా?

తొలకరిలో కనిపించే మెరుపుల కాలపరిమితి ఎంత? క్షణంలో మాయమై పోతాయి కదా? ఆకాశంలో అవి ఆ మెరుపులు స్థిరంగా ఉంటాయా? స్త్రీల అనురాగం కలకాలం ఉంటుందా? అవన్నీ త్వరలో మరలిపోయే వలపులేకదా!

ఎండమావుల్ని గమనించండి. ఏరులు పారినట్లు అనిపించి భ్రమకలిగిస్తుంది. దాన్ని ఆశ్రయించి దాహం తీర్చుకొందాం అనుకొంటే జరిగే పనేనా? ఆడువారి మనస్సులలో నీపై మోహం వున్నట్లు భ్రమ కలుగుతుందేకాని వారి ప్రేమ నిజమా? నీకు తోడుగా వుంటుందా?

స్వప్నంలో కనిపించే సంపదలన్నీ నిద్రలోవేగానీ మేలుకుంటే నీవెంట ఉండి మెరుస్తాయా? వనితల వలన కలిగే మేలుపై అపేక్ష పడుటయే కాని వారి సాంగత్యంలో వేంకటేశ్వరునిపై మనస్సు నిలకడగా వుంటుందా? ఉండదు.

## మున్నుడి

తీయటి తేనె పలుకులతో పతిని, వేంకటపతిని మురిపించి స్వామి ఆలింగనంలో అలిసిపోయి ఆ తల్లి నిదురలోకి జారుకొన్నది. పరవశించి శయనించుచున్న అలమేలు మంగమ్మ కలికి తనమును వర్ణించటం, పదకవితా పితామహుడు అన్నమయ్యకు గాక ఇతరులకు సాధ్యమయ్యే పనేనా? తిరుమలేశుని సేవలో జీవితం పండించుకొన్నారు అన్నమయ్య. అలమేలు మంగమ్మకోసం పాడిన ఈ కీర్తనలో మంగమ్మను జీవాత్మగా వేంకటనాధుని పరమాత్మగా వారి కలయికే ముక్తిగా భావిస్తున్నారు, కొంతమంది భక్తులు, జ్ఞానులు.

**ఉ॥ వేంకటనాధుడున్ గవయ భీతహరేక్షణ మంగమాంబయున్**
**సంకట మెల్లదీరి యట శయ్యను జేరెను పవ్వళించనై**
**జంకు యొకింత లేక బహుశ్రావ్యముగా యిటు అన్నమయ్యయున్**
**అంకిత భావనా పటిమ అద్భుత కీర్తన నాలపించె తాన్**

**రాగం : అభేరి**

పలుకు తేనెల తల్లి పవళించెను
కలికి తనముల విభుని కలసినదిగాన ॥పలుకు॥

నిగనిగని మోముపై నెఱులు గెలకుల చెదర
పగలైనదాక చెలి పవళించెను
తెగని పరిణతులతో తెల్లవారినదాక
జగదేకపతి మనసు జట్టిగొనె గాన ॥పలుకు॥

కొంగు జాఱిన మెఱుగు గుబ్బలొలయగ తరుణి
బంగారు మేడపై పవళించెను
చెంగలువ కనుగొనల సింగారములు దొలక
అంగజగురునితోడ అలసినది గాన ॥పలుకు॥





మురిపెంపు నటనతో ముత్యాల మలగుపై
పరవశంబున తరుణి పవళించెను
తిరువేంకటాచలాధిపుని కౌగిట గలసి
అరవిరై నును చెమట నంటినదిగాన ॥పలుకు॥

## భావామృతం

తేనెలూరు తీయని పలుకులు మాట్లాడే అలమేలు మంగమ్మ తల్లి నిదురించుచున్నది. స్త్రీకి పరిపూర్ణత్వమును కలిగించే పతితో రతిపై ఆసక్తి కలిగిన ఆమె తన వల్లభునితో సంగమించినది.

నిగనిగమని ప్రకాశించు ముఖముపై ముంగురులు చెదిరి ఆడుచున్నవి. పగలైపోయినా ఆమె పవళించియే ఉన్నది. అంతులేని ప్రావీణ్యముతో ఆ తల్లి, జగదీశ్వరుడైన తన పతి మనసును ఆకట్టుకొని యున్నది. కావున బడలి శయనించుచున్నది.

ఆమె పయ్యెద స్థాన భ్రంశమునందగా మెఱయు స్తనయుగ్మము విస్తరించి యున్నవి. ఆ భామామణి బంగారపు మేడపై నిదురించుచున్నది. ఎఱ్ఱ కలువల వంటి సోగ కన్నులలో శృంగారం అతిశయించి ఆమె మదనుని జనకునితో మన్మథ యుద్ధమున అలిసిపోయియున్నది. అందుచే ఆ తల్లి నిదురించుచున్నది.

మురిపెము లొలుకు అభినయం చూపిన ఆ తల్లి ముత్యాల హంసతూలికా తల్పంపై పరవశురాలై పవ్వళించి యున్నది. తిరుమలాధీశుడైన శ్రీవేంకటపతి కౌగిటిలో కరిగిపోయిన ఆ తల్లి అరవిచ్చిన మొగ్గవలె చిరుచెమటలు కమ్మి శయనించుచున్నది.

**1-49**

## మున్నుడి

"సువ్వి" అనేది ఒక ఊతపదం. నిజానికి దీనికి అర్థం లేదు. రోకలితో రోటిలో ధాన్యం దంచేటప్పుడు (పెండ్లి పనులలోనూ) స్త్రీలు ఆయాసం తీరుటకు 'సువ్వి' అని అంటూ పోటు వేస్తారు. అట్లాగే 'సువ్వాలమ్మ' అంటే 'సువ్వాల అమ్మా'! అనే పదవిశేషము. 'సువ్వాల' అంటే సువ్వి+ ఆలతికి రూపాంతరం. 'ఆలతి' అంటే ఆలాపన అని అర్థం. 'సువ్వాలమ్మ' అంటే ఓ అమ్మా! సువ్వి అని ఆలాపన చేద్దాం అని అర్థం. ధాన్యం దంచే ఆడంగుల కోసం అన్నమాచార్యులు అల్లిన అద్భుత కీర్తన ఇది. 'శుద్ధ ధన్యాసి' రాగంలో ధాన్యం దంచేవారి నోటి గుండా భగవన్నామ సంకీర్తనం చేయించటం అన్నమయ్యకు గాక ఇంకెవరికి సాధ్యం?

**ఆ.వె॥ 'సువ్వి సువ్వి' యనుచు సొక్కు దీరగ పాడి**
**వనితలెల్ల 'దంచు' వారె తొల్లి**
**హరిని గొలిచినాడు అన్నమయ్యయు 'నాడు'**
**సువ్వి పాటలెంచి చూడరయ్య!**

**రాగం : శుద్ధధన్యాసి**

సువ్వి సువ్వి సువ్వాలమ్మా
నవ్వుచు దేవకి నందనుని గనియె ॥సువ్వి సువ్వి॥

శశివొడచె అలసంబులు గడిచె
దివి దేవతల దిగుళ్ళు విడిచె ॥సువ్వి సువ్వి॥

కావిరి విరిసె కంసుడు గినిసె
వావిరి పువ్వుల వానలు గురిసె ॥సువ్వి సువ్వి॥

గతిసేసె అటుగాడిద గూసె
కుతిల కుడిచి జనకుడు నోరు మూసె ॥సువ్వి సువ్వి॥





గగురు పొడిచె లోకము విధి విడిచె
మొగులు గురియగ యమునపై నడచె ॥సువ్వి సువ్వి॥

కలిజారె వేంకటపతి మీరె
అలవేల్మంగ నాంచారమ్మ కలుకలు తీరె ॥సువ్వి సువ్వి॥

## భావామృతం

ఓ అమ్మలారా! సువ్వి..సువ్వి..సువ్వి అని రాగం ఆలపించండి. తనకి జన్మించిన అద్భుతమైన శిశువును కనిన దేవకీదేవి మురిసిపోయింది.

(అష్టమినాటి) చంద్రుడు పొడచూపుతున్నాడు. అందరి కష్టములు తీరనున్నాయి. స్వర్గంలోనున్న దేవతలంతా విచారం విడనాడారు.

చీకట్లు కమ్ముకొన్నాయి. కంసుడు ఆగ్రహంతో మండి పడుతున్నాడు. కుంభవృష్టిగా పుష్ప వర్షం కురిసింది.

ఇంతలో ఒక గాడిద (గార్ధభాసురుడు) అక్కడకు వచ్చింది. జరుగబోవు అనర్థం గ్రహించిన తండ్రి (వసుదేవుడు) బాధపడి దానినోరుమూసి అర్థించాడు.

గగురుపాటు కలిగించే సంఘటనలు జరిగిలోకంలో అన్నీ గతి తప్పినట్లయింది. పుష్పవర్షము కురిసింది. వసుదేవుడు శిశువుగానున్న కృష్ణుని తలపై నిడుకొని దారి ఇచ్చిన యమునా నదిని దాటాడు.

కలియుగం వచ్చేసింది. వేంకటేశ్వరుడు వెలిశాడు. అలమేలు మంగ నాంచారమ్మకు కోపాలు తగ్గిపోయాయి.

**1-50**

## మున్నుడి

అన్నమాచార్యులవారిని మించిన 'అభ్యుదయ వాది' కాగడాలేసుకొని వెతికినా కానరాడుగాక! కానరాడు. సృష్టిలో ఏ ప్రాణికీ లేని ఈ వివక్షత అహంకారం వల్ల వచ్చిందే కదా! చీమ నుంచి ఏనుగుదాకా ఏ జంతువునకు గాని, పిచ్చుక నుంచి గండభేరుండ పక్షిదాకా ఏ పక్షికి గాని చిన్న చేపనుంచి తిమింగలం వరకు ఏ జలచరమునకు గాని లేని వివక్షత మనిషి అని పిలువబడే ఈ జీవికుంది. ఈ మనిషి ద్విపాద పశువు. వీడికి తన కులం అంటే పిచ్చి, మతం అంటే పిచ్చి, తన జాతీయత అంటే పిచ్చి. ధనం అంటే వ్యామోహం, స్త్రీ అంటే వ్యామోహం తన స్వంతం అనుకున్న వాటన్నిటిపై మమకారం. తనవి కానివాటిపై ఆశ. తనకి కాకుండా చేసిన వారిపై కోపం. అన్నీ తనవే కావాలనే లోభం. పరాయి వాటిపై వ్యామోహం. అన్నీ తనవైతే మదం. తనవి కాకపోతే మత్సరం. తనకి దక్కంది ఏదీ ఇంకొకరికి దక్కరాదంటాడు.

వీడికి నిన్న ఏమయిందో గుర్తుండదు. రేపు ఏం జరుగుతుందో తెలియదు. వీడు 'నాది' అనుకొనేది ఏదీ వీడిది కాదు. ఎవ్వరూ వీడితో కలిసి జన్మించలేదు. రేపు వీడితో కలిసి చావరు. నిద్ర, భయం, సుఖం ఆహారం వాడివి వాడికేగాని ఎవ్వరూ వాడి బదులు అనుభవించలేరు. పోనీ ఆ అనుభవించేవైనా అపరిమితమా అంటే కాదు. పొట్టపట్టిందాక తింటాడు. తరువాత తినలేడు. వరుసగా పది రోజులు నిద్రా పోలేడు. జీవితం క్షణ భంగురం అని తెలిసినా వ్యామోహాన్ని వదులుకోలేడు.

అందరి నిద్రా ఒకటే. రాజు అదే నిద్రపోతాడు. బంటూ అదే నిద్రపోతాడు. ఎండవాన వంటి ప్రకృతికి మనుష్యులపైన కాని ఇతర ప్రాణులపైన కాని వివక్షత ఉంటుందా? అలాగే భగవంతునికి కూడా జాతి మతకులభేదాలతో పనిలేదు. ఆయనకి మన భక్తియే ప్రధానం.

సృష్టి స్థితి లయలను నిర్వహించే పరమాత్మయే బ్రహ్మము. ఆ బ్రహ్మము ఏకము, అనేకం కాదు. అదే పరబ్రహ్మము. అది పూర్ణము, స్వాతంత్ర్యము, సర్వసమర్థము. దాని గురించి ఎంత చెప్పినా చాలదు. పరబ్రహ్మ సాకార రూపమే శ్రీవేంకటేశ్వరుడు. ఇక ఈ కీర్తన నెన్నుకొనటానికి ముఖ్యకారణం అన్నమయ్య





అభ్యుదయ వాది అని మానవులలో మానవత్వమే వాంఛనీయమని ఆయన నమ్మకమని ఆయన ఆరాధకుల నమ్మకం.

అయితే ఆదృక్పథం కలిగించే అంతర్యామి వేరెవరో కాదు స్వయంగా ఆ శ్రీవేంకటేశ్వరుడే. జనబాహుళ్యాన్ని ఆ రోజుల్లో హరికథలు, బుర్రకథలు, ఒగ్గు కథలు, పురాణ కాలక్షేపాలు అలరించేవి. బుర్రకథలు దైవకథలు కాక చారిత్రాత్మక గాథల నెన్నుకొని జనులలో దేశభక్తి సాంఘిక దృక్పథం పెంపొందింప చేశాయి. బుర్రకథ గానం చేసి చెప్పే సూత్రధారి, కథకుడు ఒకరుంటారు. వారికి సహాయకులుగా 'తాన' అంటే 'తందాన' అంటూ ఇద్దరు వంతపాటగాళ్లుంటారు. వారు కథ చెప్పరు గాని కథలో మధ్యమధ్య సందేహాలు వెలిబుచ్చుతూ, బలే, భళానంటి భాయ్ తందానా, అని ఉత్సాహ పరుస్తుంటారు. పురే! అహి! భళా! అనే మాటలు తరచు వాడుతూ కథకుని ఉత్సాహ పరుస్తుంటారు. ఈ కీర్తన అట్టడుగున ఉండి సాంఘికంగా అణగ ద్రొక్కబడుచున్న వారికోసం అన్నమయ్య గానం చేసిన కీర్తన అని మనం భావించవచ్చును.

ప్రతి ప్రాణికి అంతరాత్మ ఎవరు? ఆ శ్రీవేంకటేశ్వరుడే కదా! మరి ఒకరి గొప్ప ఒకరి తక్కువేమిటి. సూర్యుడి ఎండ ఒకరి మీద ఎక్కువగా ఒకరిమీద తక్కువగా పడుతుందా? ధనికుని నిద్ర బీదవాడినిద్ర ఒకటే వేరుకాదు. అన్ని కులాలవారూ భూమికి స్వంత దారులే. పీల్చేగాలికి త్రాగే నీటికి చూసే సూర్యకాంతికి జాతి కులమత విచక్షణ వుందా? కుక్కమీదకాచే ఎండ ఏనుగుమీద కాచే ఎండ ఒక్కటే కదా! ఆ వేంకటేశ్వరుడు పాపులను పుణ్యులను అందరినీ ఒకేలా చూస్తాడు. అంటే హత్యచేసిన వాణ్ణీ, అబద్ధం చెప్పిన వాణ్ణి ఒకేలా చూస్తాడు అనికాదు. రాజుగారి కొడుకు హత్యచేసినా బంటు కొడుకు హత్యచేసినా ఒకే శిక్ష వేస్తాడని (నేటి న్యాయాధి పతుల్లా కాక..) అన్నమాచార్యులవారి ఉద్దేశ్యం. అదే "భావయామి వేంకటేశం" సర్వం అనుకొనేవాడి ఆలోచన.

**మత్తకోకిల :**

**ఒక్కడే పర(బహ్మ మానవ తొక్కటే పరమంబనెన్**
**చక్కనైన సుబోధ జేసెను సద్గురుడు తానాయెరా**
**లెక్కసేయకుడన్నమయ్యనె "రేడు" గాని మరెవ్వనిన్**
**దిక్కు వేంకటనాయకుండనె దీర్చిలోకములందునన్**

**రాగం : బౌళి**

తందనాన ఆహి తందనాన పురే తందనాన భళా తందనాన
(బహ్మమొక్కటే పర(బహ్మమొక్కటే పర(బహ్మమొక్కటే పర(బహ్మమొక్కటే ॥తందనాన॥

కందువగు హీనాధికము లిందు లేవు
అందరికి శ్రీహరే అంతరాత్మ
ఇందులో జంతుకులమంతా నొకటే
అందరికి శ్రీహరే అంతరాత్మ ॥తందనాన॥

నిండారు రాజు ని(దించు ని(దయు నొకటే
అండనే బంటు ని(ద అదియు నొకటే
మెండైన (బాహ్మణుడు మెట్టు భూమి యొకటే
చండాలుండేటి సరిభూమి యొకటే ॥తందనాన॥

కడగి యేనుగుమీద కాయు యెండొకటే
పుడమి శునకము మీద పొలయు యెండొకటే
కడుపుణ్యులను పాప కర్ములను సరిగావ
జడియు శ్రీవేంకటేశ్వరు నామమొకటే ॥తందనాన॥

**భావామృతం**

'అహి' అనే పదమే నేటి కాలంలో 'ఆహా!' అయింది. 'భళా' ఆవిధంగా నేడు 'భలే' అయింది. 'పురే' నేటికాలంలో 'ఒరే' అయింది (వార్నీ!) 'తందాన' నేటికాలంలో





'తందాన' అయింది. కానీ ఏకాలంలోనైనా అధికారం ఉన్నవాడు 'తందాన' అంటే వాడికి వంతపాడే వాళ్లు మాత్రం 'తానతందనాన' అని 'వత్తాసు' పలుకుతూనే వున్నారు. ఇక భావామృతంలోకి వద్దాం.

తందనాన అహి, తందనానపురే, తందనాన భళా, తందనాన. (బహ్మమనేది ఏకము, అద్వితీయము. అదే పర(బహ్మము. పర(బహ్మమొక్కటే అని తెలియండి.

తెలిసికొంటే ఈ సృష్టిలో హీనమైనది, అధికమైనది అనేవే లేవు. అందరిలోను అంతరాత్మ రూపమున ఆ శ్రీహరియే ఉన్నాడు. ఇక్కడ అందరిదీ జంతువుల కులమే. (మనం మానవులు అనే ద్విపాద పశువులం కదా!) అందరికీ ఆ శ్రీమన్నారాయణుడే అంతరాత్మ.

సంపూర్ణంగా ని(దించే రాజుగారి ని(దయు, అక్కడనే నేలపై పడుకొని ని(దపోయే బంటుయొక్క ని(దయు ఒకే విధముగా నుండును. అదే విధంగా అ(గకులస్థుడైన (బాహ్మణుడు నివసించే భూమికి నిమ్మజాతివానికి నివాసయోగ్యమైన భూమికి వ్యత్యాసమేమన్నా వుంటుందా? ఉండదుగాక ఉండదు.

పనివడి ఒక ఏనుగుమీద కాయునట్టి ఎండ అయినా భూమ్మీద పడివుండే కుక్కమీద కాయునట్టి ఎండయినా ఒక్కటే కదా! అధికముగా పుణ్యము చేసినవారినైనా పాపాత్ములనైనా సమానముగా కరుణించేటందుకు సిద్ధపడే ఆ శ్రీవేంకటేశ్వరుని నామము కూడ ఒక్కటే. (ఇక్కడ పుణ్యులు అంటే పుణ్యకార్యాలు చేసిన వారు మాత్రమే. వారు వేంకటేశ్వరుని భక్తులు కానక్కరలేదు. ఆయన భక్తులు గీతలో చెప్పినట్లు ఆ స్వామి కెప్పుడూ (ప్రియులే)

## మున్నుడి

అజరామరమైన అన్నమయ్య అద్భుతకీర్తన ఇది. శ్రీ మన్నారాయణుని గుణగాన సంకీర్తన కన్న మోక్షసాధన మింకొకటి ఈ కలియుగంలో లేదు. ఎన్ని సార్లు పాడినా తనివితీరని అమృతవర్షిణి, ఈ పాట. శ్రమపడి రామాయణ భాగవతాది గ్రంథాలను పఠించ వలసిన పని లేదు. యమ, నియమాది యోగసాధనలు అక్కరలేదు. సన్యసించి తపస్సు చేయవలసిన పని అసలే లేదు. నిద్రపోయేముందు ఈ కీర్తన పల్లవి భక్తితో పాడుకోండి ఆ శ్రీ వేంకటేశ్వరుడు కావలి ఉండి మరీ మిమ్ము రక్షిస్తాడు. ఇది సత్యం.

**కం॥ కోరిక తీరగ శ్రీమ**
**న్నారాయణు శరణు వేడి నళినీకాంతున్**
**నీరజనాభుని వేంకట**
**శ్రీరమణున్ అన్నమయ్య సేవించె తమిన్**

**రాగం : బౌళి**

శ్రీ మన్నారాయణ శ్రీ మన్నారాయణ
శ్రీ మన్నారాయణనీ శ్రీ పాదమే శరణు ॥శ్రీ మన్నారాయణ॥

కమలా సతీముఖకమల కమలహిత
కమల ప్రియ కమలేక్షణ
కమలాసనహిత గరుడగమన శ్రీ
కమలనాభనీ పదకమలమే శరణు ॥శ్రీ మన్నారాయణ॥

పరమయోగి జన భాగధేయ శ్రీ
పరమపురుష పరాత్పరా
పరమాత్మా పరమాణురూప శ్రీ
తిరువేంకటగిరిదేవా శరణు ॥ శ్రీ మన్నారాయణ॥





**భావామృతం :**

ఓ శ్రీ మన్నారాయణా శ్రీ మన్నారాయణా శ్రీ మన్నారాయణా మాకు మంగళకరమైన నీ యొక్క పాద పద్మములే శరణు.

లక్ష్మీదేవి ముఖకమలమునకు సూర్య భగవానునివలె ఆనందమొసగు వాడవు. పద్మములను ప్రీతితో హస్తమున ధరించువాడవు. తామరలవంటి కన్నులుగలవాడవు. కమలాసనుడైన బ్రహ్మదేవునకు మేలు చేయు తండ్రివి. గరుత్మంతునధిరోహించి సంచరించువాడవు. పద్మనాభుడవు. అట్టి నీ పాదపద్మములే మాకుశరణము.

పరమయోగులైన వారికి భాగ్యప్రదాతవు. పరమపురుషుడవు. శ్రేష్ఠుల కందరికీ శ్రేష్ఠుడవు. పరమాత్మవు. ఉత్కృష్టము మరియు అణురూపము కూడ ధరించువాడవు. అట్టి తిరువేంకటాద్రి నాయకా! నీకు శరణు. నాకే శరణు, శరణు.

**1-52**

## మున్నుడి

అత్యంత సరళమైన ఈ కీర్తనకు భావం వ్రాయాల్సిన అవసరం నిజానికి లేదు. ఒకటి రెండు చోట్ల కొరుకుడు పడని మాటలు వున్నా అవి భావాన్ని అర్థం చేసుకొనుటకు అడ్డంకావు. మరి ఈ కీర్తననేల ఇక్కడ వివరించానంటే 'రేవతి' రాగంలోని ఈ కృతి కర్ణపేయంగా వుంటుంది. అందుకని దీన్ని ఎన్నుకొన్నాను. స్వామిని త్రిదశవంద్యుడు అన్నారు అన్నమయ్య. త్రిదశులు అంటే దేవతలు. ఎందుకంటే వాళ్ళకి మనలాగా నాలుగోదశ వృద్ధాప్యం, అంతిమ దశ మరణంలేవట. మూడే దశలు కలవాళ్ళు. ఆ పదం వాడటం తాళ్ళపాక వారికే చెల్లింది.

**ఉ॥ ఎవ్వని వేదముల్ వెదకు నెవ్వని గొల్తురు పితృదేకతల్**
**ఎవ్వని వేడుకొందురిల ఈడుగతించిన వృద్ధులందరున్**
**ఎవ్వని పూజలన్ సురులు ఇంద్రుడు చేగొనె? శ్రీనివాసున్**
**రవ్వల వంటి కీర్తనల లావుగ మ్రొక్కెను అన్నమయ్యయున్.**

**రాగం : రేవతి**

వేదంబెవ్వని వెదకెడిని
ఆ దేవుని కొనియాడుడీ ॥వేదం॥

అలరిన చైతనాత్మకు డెవ్వడు
కలడెవ్వడెచట కలడనిన
తలతురెవ్వనిని తను వియోగదశ
యిల నాతని భజియించుడీ ॥వేదం॥

కడగి సకలరక్షకుండిం దెవ్వడు
వడి నింతయు నెవ్వనిమయము
పిడికిట తృప్తులు పితరులెవ్వనిని
తడవిన ఘనుడాతని కనుడీ ॥వేదం॥





కదిసి సకల లోకంబుల వారలు
యిదివో కొలిచెద రెవ్వనిని
త్రిదశ వంద్యుడగు తిరువేంకటపతి
వెదకి వెదకి సేవించుడీ ॥వేదం॥

**భావామృతం :**

వేదము భారతీయ తత్వజ్ఞానమునకు ప్రమాణము. ఆవేదము ఎవరిని కనుగొనుటకుయత్నించుచున్నది? ఆ వేదములు కనుగొనుటకు యత్నించుచున్న పరమాత్మను మీరందరు కీర్తంచండి.

జీవులందరిలోను చేతన కారుకుడైన చేతనాత్మకుడువ్వవు? ఆయన ఎక్కడనున్నాడు. ఏమి సమాధానమీయగలము? తాము తుదిశ్వాస విడుచునప్పుడు ఎవనిని స్మరించుటకు మానవులందరూ యత్నింతురు? ఆ పరమాత్ముని నేను భజియించెదును.

సకల లోకములకు ఏకైక రక్షకుడు ఎవ్వరు? సృష్టి అంతా ఎవ్వనిమయమై యున్నది? పితృదేవతలందరూ అనురాగముతో తాకబడి ఎవని చేత తృప్తి పరుచబడుచున్నారు? ఘనుడైన ఆ మహానుభావుని దర్శించండి.

సమీపించి ఎల్లలోకములవారు పూజించునదెవ్వరిని? త్రిదశలు మాత్మమే (బాల్యము, యౌవనము, కౌమారము అను మూడు దశలు మాత్రమే) గల దేవతలచే నుతించబడుచున్న శ్రీ వేంకటేశ్వరుని! వెదకి కనుగొని సేవించండి

ఓ ప్రజలార ఆవిధంగా అందరూ ధన్యులవండి.

**1-53**

## మున్నుడి

ఈ కలియుగం ఎట్లాపోతేనాకేం? నాకు నీ నామము, నీ శరణాగతి, నీ భక్తి, నీ దేవేరి శ్రీ లక్ష్మి కరణ వున్నాయి. అవి చాలు నాకు అంటున్నారు అన్నమయ్య. ఔరా! అసలు ఎవరికి మాత్రం అంతకన్నా ఏం కావాలి? వెనుకటికొక గడుసరి దేవుణ్ణి ఒకే కోరిక కోరాడట నేను తలచుకొన్నప్పుడు నాకు ప్రత్యక్షమై నాక్కావాల్సిందియ్యి స్వామీ! అని. వాడిలా కాక మనం అన్నమాచార్యులవారిలాగా భక్తి, నామము, శరణము, అమ్మవారి దయ కోరుకోవాలి. అప్పుడు సర్వమూ సిద్ధిస్తాయి. వేంకటరమణుడే మన అరిషడ్వర్గాలను కర్మబంధాలను నివారిస్తాడు.

**చం॥ కలియుగ దోషముల్ మనిషి కన్నులు మూయు నధర్మవర్తనన్**
**నిలుపును, చిత్తమందు హరి నీరజనాభుని ధ్యాసమాన్పు,తా**
**నని వివరంబు నిచ్చి ఘనుడైన కవీంద్రుడు 'అన్నమార్యు' డున్**
**తను మన వేంకటేశ్వరుడె'దారి' యనెన్ యిటు చెప్పెకీర్తనన్**

**రాగం : మాళవగౌళ**

కలియుగమెటులైన-గలదుగా నీకరుణ
జలజాక్ష హరిహరి-సర్వేశ్వరా ॥కలియుగ॥

పాపమెంత గలిగిన-బరిహరించే యందుకు
నాపాల గలదుగా నీ- నామము
కోపమెంత గలిగిన- కొచ్చి శాంత మిచ్చుటకు
చేపట్టి కలవుగా నా- చిత్తములో నీవు ॥కలియుగ॥





ధర నింద్రియాలెంత-తరముకాడిన నన్ను
సరిగావ గద్దుగా నీ-శరణాగతి
గరిమ కర్మబంధాలు-గట్టిన తాళ్ళు వూడించ
నిరతి గలదుగా-నీ భక్తి నాకు ॥కలియుగ॥

హితమైన యిహపరా-లిష్టమైన వెల్లా నియ్య
సతమైన కలదుగా నీ-సంకీర్తన
తతి శ్రీ వేంకటేశ నా-తపము ఫలియింపించ
గతి కలదుగానీ-కమలాదేవి ॥కలియుగ॥

**భావామృతం :**

ఓ సర్వేశ్వరా! ఈ కలియుగం ఎంతదోషభూయిష్టంగా వుంటే మాత్రం నాకేం నష్టం? నాకు నీ కరుణ వున్నది కదా! పద్మనయనా! శ్రీ హరీ నాకది చాలును.

నాపాపము లెంతవున్నా వాటిని నివారించేందుకు నావద్ద నీ నామము కలదు కదా! నాకేం కొఱత? నాకు ఎంత కోపము వున్నా దానిని నశింపజేసే శాంతము నొసంగుటకు నాచేయిబట్టి నడిపించుటకునా చిత్తములో నీవు స్థిరముగ నెలకొని యున్నావు కదా!

ఈ ప్రపంచంలో ఇంద్రియాలెంత నన్ను వెంటాడి వేధించినా నాకేం భయం? నేను నీ శరణాగతిని బొందియున్నాను ప్రభూ! గొప్ప కర్మబంధములు గట్టిగా తాళ్ళతో కట్టేసినా నాకు వాటిని తొలగించు కొనుటకు బెంగ ఎందుకు? నాకు నీభక్తి మీద అమితమైన ఆసక్తి వున్నది. అది చాలాదా?

సేమము నొసంగు ఇహపరముల రెంటినీ మరియు ఇష్టమైన వన్నీ అన్ని వేళలా ప్రసాదించు నీ సంకీర్తనములె నా తపః ఫలముగా నున్నవి. ఓ శ్రీ వేంకటేశ్వరా! వీటన్నిటికీ దిక్కయిన నీ శ్రీలక్ష్మి వాటినన్నిటినీ నీ ఆజ్ఞపై మా కొసగును. ఇకమాకేం తక్కువ?

**1-54**

## మున్నుడి

దృశ్యమానంగా అంటే కనులకు కట్టినట్లు ఒక సంఘటన వివరించడం అందరివల్లా అయ్యేపనికాదు. దానికి అద్భుతమైన భావనాపటిమవుండాలి. ఇక దాన్ని కీర్తనలా ఆలపించాలంటే దైవాంశ సంభూతులే చేయగలరా పనిని. హనుమ జానకీమాతను తన భుజములపై జలధిని దాటించి రామచంద్రుని వద్దకు చేరుస్తానన్నప్పుడు"నాయనా! ఇంత చిన్న వానరమైన నీవల్ల ఏమవుతుంది నాస్వామికి నావిషయం వివరించు, చాలు అన్నదట ఆ దేవి. ఇట్లా కాదని గగనమంతా ఆక్రమించిన తన విశ్వరూపం చూపాడట స్వామి. అన్నమయ్య ఆ హనుమను వేంకటనాధుని భక్తునిగా నుతించాడు.

**మ॥ వినరో మోహనరాగమందు యిదివో వేంకన్న సద్భక్తుడున్**
**తన భావంబున అన్నమయ్య కొలిచెన్ ధన్యున్ సుసంపన్నునిన్**
**పెనుఆకారము దాల్చు వాయుసుతునిన్ భీమానుజుండౌకపిన్**
**ఘనునీ కీర్తన పాడి నాడు భళిరా! గంధర్వగానంబిదే**

**రాగం : మోహన**

పెరిగినాడు చూడరో పెద్ద హనుమంతుడు
పరగి నానా విద్యల బలవంతుడు ॥పెరిగినాడు॥
రక్కసుల పాలికి రణరంగ శూరుడు
వెక్కసపు ఏకాంగ వీరుడు
దిక్కులకు సంజీవి తెచ్చిన ధీరుడు
అక్కజమైనట్టి ఆకారుడు ॥పెరిగినాడు॥
లవి మీరినయట్టి లావుల భీముడు
బలు కపికుల సార్వభౌముడు
నెలకొన్న లంకా నిర్ధూమ ధాముడు
తలపున శ్రీరాము నాత్మారాముడు ॥పెరిగినాడు॥





దేవకార్యముల దిక్కువరేణ్యుడు
భావింపగల తపః ఫల పుణ్యుడు
శ్రీవేంకటేశ్వర సేవాగ్రగణ్యుడు
సావధానుడు సర్వశరణ్యుడు ॥పెరిగినాడు॥

## భావామృతం

ఓ ప్రజలారా! ఈ హనుమంతుడు ఎంత పెద్దగా పెరిగియున్నాడో గమనించండి. అనేక విధములైన విద్యలందు నిష్ణాతుడైన ఈ వాయుపుత్రుడు గొప్ప బలము కలిగినవాడు.

ఈ కపిశ్రేష్ఠుడు రాక్షసులకు యుద్ధములోనసాధ్యుడు. ఈయన దుస్సహమైన అసహాయ శూరుడు. దిగంతములకు పోయి సంజీవిని గొనితెచ్చిన ధీరోదాత్తుడు. ఆశ్చర్యము గొలుపు ఆకారమును ధరించినవాడు, ఈ ఆంజనేయుడు. (అష్ట సిద్ధులు ఉన్నవాడగుటచే చిన్న పిల్లిని బోలిన కోతివలె లంకలో సీతను వెదకెను. మున్నుడిలో వివరించినట్లు జానకీ దేవి తననెలా సాగరము దాటింతు వన్నప్పుడు ఆమె తన మాటలను నమ్మటలేదని విశ్వరూపమును చూపించిన బుద్ధిమంతుడు)

ఈ మారుతి బాగుగా అతిశయించిన ధైర్యముగల పరాక్రమవంతుడు. బలిష్టులైన కపికులంబునకే ఈతడు సార్వభౌముడు. తాకరానిదిగా ప్రసిద్ధి గాంచిన లంకానగరమును దగ్ధము చేసిన శౌర్యవంతుడు. శ్రీరామచంద్రుని తన ఆత్మారామునిగా ప్రతిష్టించుకొనినవాడు. శ్రీరామ లక్ష్మణులను మూర్ఛనుండి తేర్చుట వంటి పనులు చేసి దేవతలకు దిక్కుగా నిల్చిన ముఖ్యుడు. ఎంచగలిగిన తపః ఫలము గల పుణ్యాత్ముడు. ఈ హనుమంతుడు, శ్రీవేంకటేశ్వరుని సేవించు వారందరిలో అగ్రగణ్యుడు. ఎప్పుడూ సావధానుడై సిద్ధముగానున్న ఈ వాయునందనుడు అందరికీ శరణము నొసంగు మహానుభావుడు.

**1-55**

## మున్నుడి

గత జన్మలో యశోదాదేవిగా తనశిశువైన ముద్దుల కృష్ణుని మురిపాలలో మైమరచిన తల్లి అయింది కాని స్వామి కళ్యాణం కనులారా గాంచలేకపోయింది. పరితపించింది. దానికి తగిన కారణం వున్నప్పటికీ ఆమె కోరిక మేరకు కలియుగంలో ఆమె వకుళాదేవిగా అవతరిస్తే తాను వేంకటేశ్వరుడై పుడమికి దిగివచ్చి ఆమె చేతులమీద పద్మావతిని పరిణయమాడి 'అత్తగారి' పదవి నందించాడు. ఎంత ధన్యురాలు! ఆమెపేరు మీద వచ్చిన అమృతపేయమైన రాగం 'వకుళాభరణం' అన్నమాచార్యులవారు ఈ రాగంలో ఆ ముద్దుల చిన్ని శిశువుని వర్ణిస్తున్నారు. ఇంత మనోహరమైన శిశువే నేడు "ప్రత్యక్ష దైవమై" ఏడుకొండలమీద నున్నాడట. ఆహా!!

**చం॥ 'పదకవితాపితామహుని' భావన జెప్పెడి 'యజ్ఞ' మందునన్**
**విదితము సేయు యత్నమిది, విష్ణువు తాను యశోద'పట్టియై'**
**ముదమును గూర్పెనెల్లరకు ముద్దుల బాలుని వర్ణనంబహో!!**
**ఇది విని వేంకటేశ్వరుని ఎవ్వరు వేదరు యిట్టి బిడ్డకై?**

**రాగం : వకుళా భరణం**

చిన్ని శిశువు చిన్ని శిశువు
ఎన్నడు చూడమమ్మ ఇటువంటి శిశువు ॥చిన్ని॥

తోయంపు కురులతో తూగేటి శిశువు, చింత
కాయలవంటి జడల గములతోడ
మ్రోయుచున్న కనకపు మువ్వల పాదాలతోడ
పాయక యశోద వెంట పారాడు శిశువు ॥చిన్ని॥

ముద్దుల వ్రేళ్లతోడ మొరవంక యుంగరాలు





నిద్దపు చేతులపైడి బొద్దుల తోడ
అద్దపు చెక్కులతోడ అప్పలప్పలని నంత
గద్దించి యశోద మేను కౌగలించు శిశువు ॥చిన్ని॥

బలుపైన పొట్టమీది పాలచారలతోడ
నులివేడి వెన్నదిన్న నోరితోడ
చెలగి నేడిదే వచ్చి శ్రీవేంకటాద్రిపై
నిలిచి లోకములెల్ల నిలిపిన శిశువు ॥చిన్ని॥

**భావామృతం :**

చిన్నారి పాపడైన ఈముద్దు కృష్ణుని వంటి శిశివును ఎందునా చూడలేము. ఇతడు అంత అద్భుతమైన శిశువు.

ఒక పద్ధతి ప్రకారం అలంకరించిన ముంగురులు కలిగిన శిశువు ఈ కృష్ణయ్య. చింతకాయల గుత్తుల వంటి జడలు కలిగిన శిశువితడు. చిన్నారి పాదాలపై బంగారుమువ్వలు ఘల్లు ఘల్లున మ్రోగుచున్నవి. ఆ విధంగా యశోదాదేవి వెంటబడి పారాడుచున్న ఈ మురిపాల శిశువును చూడండి.

ముద్దులొలికే వ్రేళ్ళకు మొరవంక (కోడిగుడ్డు ఆకారం) వుంగరాలు మెరుస్తున్నాయి. నునుపైన చేతులు బంగారపు బొద్దులు (కడియములు వంటి ఆభరణములు) అలంకరింపబడి యున్నవి. ఆయ్ అమ్మా! అని యశోద అంటే గట్టిగా కౌగలించుకొనే శిశువు. ఇటువంటి మురిపాల శిశువును చూడండి.

ఉబ్బుకొచ్చిన చిన్నారి బొజ్జ మీద అప్పుడే త్రాగిన పాలు చారికలుకట్టి కనిపిస్తున్నాయి. గోరువెచ్చగా వుండే (అప్పుడే తీసిన) వెన్న తిన్నట్లు ( మూతికంటిన వెన్నగల) నోరున్న ఈ చిన్నారి కృష్ణుని చూచి పులకిస్తున్నాను. ఆ మురిపాల కృష్ణుడే నేడు శ్రీ వేంకటాద్రి పై నెలకొని విరాజిల్లుతున్న శ్రీ వేంకటేశ్వరుడై లోకములన్నింటినీ ఉద్ధరించుచున్న శిశువు.

**1-56**

## మున్నుడి

అనాదిగా గీతాపారాయణ జేసేవారు, ప్రవచనలు చేసేవారు అనువాదాలు చేసినవారు కోకొల్లలుగా వున్న పుణ్యభూమి ఇది. భగవద్గీతపై అవధానం చేసే మహామహాలున్నారు. కాని 600 ఏళ్ళనాడు శాస్త్రీయ సంగీతంలో గీతావాక్యాన్ని పాడినవారు లేరు. గీత 13 వ అధ్యాయమైన "క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగంలో శ్రీ కృష్ణపరమాత్మ చెప్పిన 8,9,10,11,12, శ్లోకములను "ముఖారి" రాగంలో కీర్తనగా పాడటం పదకవితా పితామహునికి గాక పరులకు సాధ్యమా? 2010 సంవత్సరంలో, డా॥ సముద్రాల లక్ష్మణయ్య గారి వంటి పుణ్యాత్ముల వ్యాఖ్యానం చదివితేనాబోటి వారికి కొంత పట్టింది.

**కం॥ గీతావాక్యము బలుకుట**
**గీతములో అన్నమయ్యకే సాధ్యమగున్**
**నూతనముగ వేంకటపతి**
**ఈ తీరునజెప్పెననుట ఇతనికె చెల్లెన్.**

**రాగం : ముఖారి**

ఇందుకు విరహితము-లిన్నియు నజ్ఞానమని
చందమున గీతలందు-జాటీ నిదివో ॥ఇందుకు॥

మానావమానము-మాని, డంబు విడచుట
పూనిహింసకు జొరక-యోరుపు గలుగుటయు
ఆని మతి గరగుట-యాచార్యోపాసన
తానెప్పుడు శుచియౌట-తప్పని విజ్ఞానము ॥ఇందుకు॥

అంచల సుస్థిర బుద్ధి-యాత్మవినిగ్రహము
అంచిత విరతి నిర-హంకారాలు,
ముంచిన జన్మదుఃఖ-ములు దలపోయుట
కంచపు సంసారము-గడచుటే జ్ఞానము ॥ఇందుకు॥





అరిమిత్ర సమబుద్ధి-యనన్య భక్తియు
సరినేకాంతకము,న-సజ్జన సంగవిముక్తి,
ధర నధ్యాత్మజ్ఞాన- తత్త్వము దెలియుట
గరిమలందుట శ్రీవేం-కటపతి జ్ఞానము. ॥ఇందుకు॥

**భావామృతం :**

శ్రీ కృష్ణపరమాత్మ భగవద్గీతయందు (క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగం అను 13వ అధ్యాయమున), 'ఇది జ్ఞానము' అని చెప్పి , దీనికి భిన్నమైనదంతయూ 'అజ్ఞానము' అని చాటిచెప్పెను.

మాన్యతగాని అవమానముగానీ శరీరమునకే గనుక వాటిని విడనాడుట, దర్పము లేకుండుట, హింసాప్రవృత్తికి దూరముగానుండుట, ఓరిమి పొందియుండుట, కపట బుద్ధిలేకుండుట గురువులను సేవించుట, శుచిగానుండుట ఇవియన్నియు విజ్ఞానము.

అదియునుగాక బాగుగా స్థిరమైన బుద్ధి గలుగుట, మనోనిగ్రహము, విషయసుఖములయందు వైరాగ్యభావము, ఏ మాత్రము అహంకారము లేకుండాయుండుట, జన్మించినవారికి ముసలితనము, వ్యాధి, మరణము,దుఃఖము తప్పవని తెలిసికొని వాటినుండి తరించుట, పుత్రులు, మిత్రులు భార్యతో గూడినసంసారము అనిత్యమని తెలిసికొనుటయే జ్ఞానము.

శత్రువులయందు మిత్రులయందు సమబుద్ధి గలిగియుండుట (శత్రువులను కూడ మిత్రులవలె చూడాలని భావము), ఏకాంతముగానుండుటకు ప్రయత్నించుట, దుష్టులకు దూరముగా నుండుట, ఎల్లప్పుడు ఆత్మజ్ఞానముచే తత్త్వమును తెలిసికొనుట, అత్యంత శ్రేష్ఠమైన జ్ఞానప్రయోజనమును బడయుట- ఇది శ్రీ వేంకటేశ్వరుడు చెప్పిన జ్ఞానము. దీనికి విరుద్ధమైనదంతయు 'అజ్ఞానము'

1-57

## మున్నుడి

అన్నమయ్య, క్షేత్రయ్య, జయదేవుడు మొదలైన మహానుభావులు శృంగార కీర్తనలతో శ్రీమన్నారాయణుని కొలిచారు. పవిత్రభవనతో చ్పప్త శృంగారం చెడుకాదు. అన్నమయ్య కీర్తనలకు ఏడుకొండలవాడు పరవశించాడు అంటే కారణం ఇట్లాంటి మనోజ్ఞమైన కీర్తనలే. భావ వివరణలో సాధ్యమైనంత 'నిగూఢత' పెట్టటానికి కారణం మాత్రం 'అందరికీ' అర్థం కాకుడదనే..... నాకోరిక 'భావయామి వేంకటేశమ్' ఆశయం అన్నమాచార్యులవారి అన్ని కళలను గుర్తుచేయటమే.

**తరళము॥**

**వనజనాభుని కామకేళిని పాడనీ విధి సాధ్యమా?**
**వినుడు మంగను వేంకటేశుడు ప్రేమడోలికలూచుటన్**
**అనునయంబుగ తాళ్ళపాక మహాకవీంద్రుడు పాడుటన్**
**ఇనుమడించిన భక్తితోనిక ఏను పద్యము జెప్పితిన్.**

**రాగం : తిలంగ్**

ఏమొకో చిగురుట ధరముల యెడనెడ కస్తూరి నిండెను
భామిని విభునకు వ్రాసిన ప్రతిక కాదు కదా ॥ఏమొకో॥

కలికిచకోరాక్షికి కడకన్నులు కెంపైతోచిన
చెలువం బిప్పుడిదేమో చింతింపరె చెలులు
నలువున ప్రాణేశ్వరుపై నాటిన యాకొనచూపులు
నిలువున పెరుకగ నంటిన నెత్తురు కాదుకదా ॥ఏమొకో॥

పడతికి చనుగవ మెఱుగాలు పైపై పయ్యెద వెలుపల
కడుమించిన విధమేమో కనుగొనరే చెలులు
ఉడుగని వేడుకతో ప్రియుడొత్తిన నఖశశిరేఖలు
వెడులగ వేసవికాలపు వెన్నెల కాదుకదా ॥ఏమొకో॥





ముద్దియ చెక్కుల కెలకుల ముత్యపు జల్లుల చేర్పుల
వొద్దికలాగు లివేమో వూహింపరే చెలులు
గద్దరి తిరువేంకటపతి కామిని వదనాంబుజమున
అద్దిన సురుతపు చెమటల అందము కాదు కదా ॥ఏమొకో॥

**భావామృతం**

(మనందరికి తల్లియైన అలమేలు మంగమ్మ స్థితిని రమణీయమైన శృంగార కీర్తనలో వివరిస్తున్నారు పదకవితా పితామహులు. ఇది అన్యులకు అసాధ్యం.)

ఈ జవ్వని పల్లవాధరములపై అక్కడక్కడా కస్తూరి నిండుగా అంటుకొనియున్నది. ఇది ఒక వేళ ఈ కోమలి తన నాధునికి వ్రాసిన ప్రేమ లేఖ కాదుకదా!!

చకోరముల వలె గుండ్రని కన్నులు గల ఈ భామామణి కన్నులకొనలు కెంపులు వలె ఎర్రబారినవి. ఓ చెలులార! ఇట్లా ఎందుకయిందో ఒక్కసారి ఆలోచించండి. ఈమె తన కొనచూపులను వాడిగా తన ప్రాణేశ్వరుడైన వేంకటరమణునిపై నాటి మరల ఆ చూపులను మరల్చినప్పుడు ఆ చూపులతూపులు పెరకబడి రక్తము కారి ఆ స్వామిని చూస్తున్న ఆమె కన్నులలో ప్రతిఫలించుటచే ఎర్రబారలేదు కదా!

చెలులారా! ఈ పడతికి వల్లెవాటు పైనుండియే స్తనయుగ్మము తళుకున మెఱయు కారణమును కనుగొన లేకున్నారేమి? ఈమె విభుడైన తిరుమల నాయకుడు మిక్కిలి వేడుకతో నఖక్షత్రములను వేయగా అవి చంద్రరేఖలవలె తోచి ఆపయ్యెద మెఱపులతో కలిసి ఇది వేసవి నాట వెన్నెల కాదు గదా! అనుభావన కలుగజేయుచున్నది.

ఓచెలులారా! ఈ ముద్దుగుమ్మ చెక్కిళ్ళపార్శ్వము లిరువైపులా ముత్యపు జల్లులతో నిండియుండునట్లు ఆకర్షణీయముగా అమరియుండు కారణమేమో వూహించ లేకున్నారా? అవి నిజమునకు ముత్యాల జల్లులు కావు. దిట్టయైన వేంకటేశ్వరుని నాయిక యొక్క ముఖకమలమున ఆయన సురతివేగమున ప్రాప్తిలిని చిరుచెమటల అందము కాదు కదా!!

**1-58**

## మున్నుడి

అద్భుతమైన తత్త్వబోధనెరుంగజెప్పు కీర్తన ఇది. మనిషి జన్మఎత్తి నిరుపయోగం కావున తాను వేంకటేశ్వరునొక్కడినే దిక్కని నమ్ముకున్నాడనీ ఇకతనని రక్షించటం స్వామి చిత్తమని తేల్చి వేశారు అన్నమయ్య. ఏవిమరువవలెనో వాటిని మరువను. వేటిని మరువరాదో వాటిని మరచెదను. ఏమి విడువ వలెనో వాటిని విడువను. వేటిని విడువరాదో వాటిని విడిచెదను. దేన్నితగులరాదో దాన్ని తగిలి, దేన్నితలవాలో దాన్ని తలవక విష్ణుమాయలో చిక్కి వేంకటేశ్వరుని శరణనుట లేదంటున్నా రన్నమయ్య.

**ఉ॥ ఎక్కడి జన్మమానవుని దెత్తిన దీనిఫలంబు యేమొకో!**
**మ్రొక్కుడు వేంకటేశ్వరుని మోక్షపథంబదె, విష్ణుమాయచే**
**నిక్కము నేర్వకుంటిమను నీతిని దెల్పెను అన్నమయ్యతాన్**
**చక్కని కీర్తనంబు గొని, సద్గురుబోధనుయెంచి చూడరో.**

**రాగం : బౌళి**

ఎక్కడి మానుషజన్మం బెత్తిన ఫలమేమున్నది
నిక్కము నిన్నెనమ్మితి నీచిత్తంబికను ॥ఎక్కడి॥

మరువను ఆహారంబును మరువను సంసారసుఖము
మరువను ఇంద్రియభోగము మాధవ నీమాయ
మరచెద సుజ్ఞానంబును మరచెద తత్త్వరహస్యము
మరచెద గురువును దైవము మాధవ నీమాయ ॥ఎక్కడి॥

విడువను పాపము పుణ్యము విడువను నాదుర్గుణములు
విడువను మిక్కిలియాసలు విష్ణుడ నీమాయ
విడిచెద షట్కర్మంబులు విడిచెద వైరాగ్యంబును
విడిచెదనాచారంబును విష్ణుడ నీమాయ ॥ఎక్కడి॥





తగిలెద బహు లంపటముల తగిలెద బహు బంధంబుల
తగులను మోక్షపు మార్గము తలపున యెంతైనా
అగపడి శ్రీ వేంకటేశ్వరా అంతర్యామివై
నగినగి నను నీ వేలితి నాకా యీమాయ ॥ఎక్కడి॥

## భావామృతం

ఎక్కడి మనుష్య జన్మస్వామీ! ఇది? ఈ జన్మయెత్తి ఏమన్నా ఉపయోగం వుందా? లేదు. ఇక నీ ఇష్టం. నిజం చెబుతున్నాను ప్రభూ! నేను నిన్నే నమ్ముకొన్నాను.

ఓ మాధవా! నేనెంత దౌర్భాగ్యుడినంటే.... ఆహారమును విడువలేను రోజుమూడుపూటలా తినవలసిందే. సంసారసుఖం వదులుకోలేను. ఇంద్రియ భోగం మీద ఇసుమంతైనా విరక్తి లేదు. ఇక వాటిని మరువనుకానీ మంచి జ్ఞానమును తత్త్వరహస్యములను జగత్పతియైన దైవమును హితోపదేశం చేసే గురువును మాత్రం మఱచిపోతాను. దీనికి నేను కారణం కాదు ప్రభూ! నీమాయ ఆవరించడం చేత ఇట్లు జరుగుచున్నది.

ఓ విష్ణుదేవా! విడువకుండా పాపాలు పుణ్యాలు ఒకదాని వెంట ఇంకొకటి చేస్తూనే ఉన్నాను. నా చెడుగుణములను వదిలిపెట్టలేకున్నాను. ఆశాపాశముచే బంధింపబడి ఆశను విడువలేను ఇదంతా నీ మాయయే కదా! ఇదిట్లా వుంటే మానవులకు విధించబడిన ఆరు విధులను మాత్రం విడిచిపెట్టాను. వైరాగ్యం మాటనెత్తడం లేదు. ఆచారము అంటే ఏమిటో మఱచిపోయాను. విష్ణుస్వరూపా! ఇదంతా నీ మాయకాకామరేంటి?

ఓ ప్రభూ! నేను ఎన్నో చిక్కులలో తగులుకొంటాను. ఎన్నో బంధనములలో తగులుకొంటాను. ఇకపోతే నా ఆలోచనలలో కూడ మోక్షమార్గం జోలికి పోవటం లేదు. ఇవన్నీ జరిగినా నాకేం భయం? ఓ వేంకటేశ్వరా! నాకు నీ దర్శనం అయింది. నీవు అంతర్యామిగా సంతోషంతో నన్ను రక్షిస్తున్నావు కదా! అట్టి నాకు నీమాయ అంటే ఏం భయం?

## 1-59

### మున్నుడి

శ్రీ రామనామ సంకీర్తన అనగానే అన్నమయ్య పలుకులలో నుంచి తేనెలూరుతుంటాయి. ఈ కీర్తన ఈ మాటల్లో అతిశయోక్తి ఆవంతైనాలేదని నిరూపిస్తుంది. సురరక్షకుడు అసురదమనుడు అయిన ఈ రామచంద్రుడు నెలకొనియున్నది విజయనగరమున. ఈయన ఆదియైన దానికే అనాది అని కీర్తిస్తున్నారు. యోగీంద్రుల మానస సరోజములందు సంచరించు ఈ రాఘవుడు జానకీ మనోహరుడు. ఆర్తరక్షాదక్షుడైన ఈ దశరథనందనునిపై కీర్తన వీనులకు విందైన కానడరాగంలో వినిపించారు. ఎప్పటివలెనె ఈ శ్రీ రాముడే నేటి శ్రీ వేంకటేశ్వరుడు అంటున్నారు అన్నమయ్య

**చం॥ ఇన కుల సోముడైన ఘనునీ రఘురాముని జానకీపతిన్**
**జనులను కన్నబిడ్డలుగ చక్కగనేలిన చక్రవర్తినిన్**
**మనులకు కన్న తల్లియగు మంగకునాథుడు వేంకటేశుగా**
**మనసున నెంచి అన్నమయ పాడెను 'కానడ' రాగమందునన్.**

**రాగం : కానడ**

రాముడు రాఘవుడు రవికులుడితడు
భూమిజకు పతియైన పురుష నిధానము ॥రాముడు॥

అరయ పుత్రకామేష్టి యందు పరమాన్నమున
పరగ జనించిన పరబ్రహ్మము
సురుల రక్షింపగ అసురుల శిక్షింపగ
తిరమై ఉదయించిన దివ్యతేజము ॥రాముడు॥

చింతించే యోగీంద్రుల చిత్తసరోజములలో
సంతతము నిలిచిన సాకారము
వింతలుగా మునులెల్ల వెదకినయట్టి
కాంతుల చెన్ను మీరిన కైవల్య పదము ॥రాముడు॥





వేదవేదాంతముల యందు విజ్ఞాన శాస్త్రములందు
పాదుకాన పలికేటి పరమార్థము
పోదితో శ్రీ వేంకటాద్రి బొంచి విజయనగరాన
ఆదికి అనాదియైన అర్చావతారము. ॥రాముడు॥

### భావామృతం

ఈ శ్రీ రామచంద్రమూర్తి రఘువంశమునకు చెందినవాడు. ఈయన రవికులమునకే శోభాయమైనవాడు. ధరణీనందనయైన సీతాదేవికి భర్తయైన ఈతడు పురుషులలో మూలధనము ( నిధానము) వంటివాడు.

దశరథమహారాజు పుత్రకామేష్టియాగము చేయగా ప్రీతిచెంది యజ్ఞపురుషుడిచ్చిన పరమాన్నము వలన జన్మించిన పరబ్రహ్మస్వరూపుడే ఈ శ్రీ రాముడు. ఆయన దేవతలందరికి రక్షకుడు. రాక్షసులను వధించెడివాడు. ఆయన స్థిరముగా పొడజూపిన దివ్యతేజస్సు.

ఈ దాశరథి తననే ధ్యానించు యోగీశ్వరుల మనోసరోజములందు ఎల్లప్పుడు సాకారముగా నిలిచేవాడు. మునీశ్వరులందరు వెదకులాడే కాంతివంతమైన మోక్షమార్గము ఈ శ్రీ రామచంద్రమూర్తి.

వేదములయందు, వేదాంతములందు, విజ్ఞానశాస్త్రమునందు ప్రధానముగా ఎఱుక పరచబడిన పరమార్థము ఈ శ్రీ రాముడే. ఒద్దికతో శ్రీ వేంకటేశ్వరునిగా వేంకటాద్రిపై వెలసిన ఈ స్వామియే విజయనగరమున ఆదియనుదానికే అనాదియైన అర్చావతార మూర్తిగా శ్రీ రామచంద్రమూర్తియై వెలసియున్నాడు.

## 1-60

## మున్నుడి

డోలలూపి, మధురమైన కీర్తనపాడి, నీలవర్ణుని నిద్దురపుచ్చుటం అన్నమాచార్యుల దినచర్యలో ఒక భాగం. ఈ క్రమంలో ఈ సంస్కృత కీర్తన ఆవిర్భవించింది. కీర్తనలో నాకు తోచిన ఒక విశేషం చెబుతాను." దారుణబుద్ధ" అనే మాటలో 'దారుణ' అంటే భయంకరమైన. బుద్ధునికి అన్వయించదీవరాలు. అది 'తారణ' అయి వుండవచ్చును. తారణ అంటే తరింపజేయు బుద్ధుడు అని అర్థం. అలాగే కీర్తనలు రాగిరేకులపై వ్రాయబోయే యత్నంలో దొర్లిన పొరపాటే ' శీరపాణే' అనే మాట. అది సీరపాణే అంటే నాగలి ధరించినవాడు. ఇది నా ఆలోచన మాత్రమే.

**ఉ॥ డోలికలూచి శ్రీ పతిని దొడ్డగ నిద్దుర బుచ్చు సేవలో**
**చాల ముదంబుగూర్పు కృతి చల్లగ పాడెను అన్నమయ్యతా**
**నేలిక వేంకటేశు పదియీ అవతారములిట్టు చెప్పెగా**
**వీలగునే మరొక్కనికి? మేలగు విందును పొందుడెందముల్.**

**రాగం : ఖమాస్**

డోలాయాంచల డోలాయాం హరే డోలాయాం ॥డోలాయాంచల॥

మీన కూర్మవరాహ మృగపతి అవతార
దానవారే గుణశౌరే ధరణీ ధర మరుజనక ॥డోలాయాంచల॥

వామన రామ రామ వరకృష్ణ అవతార
శ్యామలాంగ రంగ రంగా సామజవరద మురహరణ ॥డోలాయాంచల॥

దారుణ(తారణ) బుద్ధ కలికి దశవిధ అవతార
శీ ( సీ) రపాణే గోసమాణే శ్రీ వేంకటగిరి కూట నిలయ ॥డోలాయాంచల॥





## భావామృతం

శ్రీ హరీ! నీకు ఊయలలూపెదను. బాగుగా కదలాడు ఊయలలూపెదను.

మత్స్యరూపుడవై (వేదములను రక్షించితివి), కూర్మరూపుడవై (మంధరగిరి నెత్తితివి), వరాహరూపుడవై ( భూదేవిని కాపాడితివి), మృగేంద్రుని రూపుడవై (నరసింహుని వలో ప్రహ్లాదుని బ్రోచావు), ఓ ప్రభూ! అసురారీ! శౌర్యవంతమైన గుణభూషణా! భూ రమణా! మదనజనకా! నీవు సర్వేశ్వరుడవు.

వామనరూపుడవై (బలిని నిరోధించితివి), శ్రీ రామచంద్రమూర్తివై ( రావణుని తెగటార్చితివి), బలరాముడివై (దారుణమైన బలశాలివైతివి), శ్రీ కృష్ణపరమాత్మవై (వరప్రదాతవైతివి) ఓ మహానుభావా! నల్లని శరీరకలవాడా! శ్రీ రంగమునేలెడి రంగనాధా! గజేంద్ర సంరక్షకా! మురాసురభంజనా! నీవు అసామాన్యుడవు.

ధర్మవర్తనతో తరింపజేసిన ఓ బుద్ధా! (శాంతి ప్రవర్ధకుడవు), కలికి అవతారుడవై (దుర్జనాంతకుడవు). ఓ సీలపాణే (నాగల ధరించినవాడా) గోసంరక్షకా! శ్రీ వేంకటగిరి కూటమియైన ఏడుకొండలపై నివాసమైన శ్రీ వేంకటేశ్వరా కదలాడే ఈ డోలికలలో ఊగుతూ మమ్ము ఆదుకోతండ్రీ!

**1-61**

## మున్నుడి

అహోబలంలోని లక్ష్మీనారసింహుని కీర్తిస్తున్నారు అన్నమాచార్యులవారు. వక్రబుద్ధియైన హిరణ్యకశిపుడు శ్రీ హరిద్వేషియై, హరిభక్తుడైన తన సుతుడు ప్రహ్లాదునా హరిమాటయెత్తవద్దని అహరహమూహింసించాడు. తన భక్తుని వెన్నంటి కాపాడాడు శ్రీ హరి. చివరికి నరహరియై అరిని విఱిచి బాలునికాపాడి వరములిచ్చిడు శ్రీ హరి. లక్ష్మీదేవిని తన తొడపై కూర్చోబెట్టుకొని స్వర్ణాభరణ భూషితుడై నవ్వులొలికే లక్ష్మీనారసింహుడుగా అహోబలంలో వెలసి భక్తవరదుడైనాడు. ఆయనను శ్రీ వేంకటేశ్వరుని అవతారంగా కీర్తిస్తున్నారన్నమయ్య.

**ఉ॥ వంకరబుద్ధి దానవుడు వద్దని శ్రీ హరి ధ్యాసమాన్పగా**
**మంకున హింసవెట్టె సుతు, వానిని గాచెను తోడునీడయై**
**వేంకటరాయుడే, వెలసె వేల్పుఅహోబలనారసింహుడై**
**ఇంక నుంతిచె నన్నమయ యిట్టి తలంపెటు లొచ్చునోగదా**

**రాగం : ఆరభి**

ఆరగించినకూచున్నాడల్లవాడే
చేరువనే చూడరె లక్ష్మీనారసింహుడు ॥ఆరగించి॥

ఇందిరను తొడమీద నిడుకొనికొలు విచ్చీ
అందపు నవ్వుల చల్లీనల్లవాడె
చెందిన మాణికముల శేషుని పడగిలమీద
చెంది మాలిన్నీ లక్ష్మీనారసింహుడు ॥ఆరగించి॥

బంగారు మేడలోన పచ్చులగద్దియల మీద
అంగనల ఆటచూచీ నల్లవాడే
రంగగు సొమ్ములతోడ రాజసపు విభవాల
చెంగటనున్నాడు లక్ష్మీనారసింహుడు ॥ఆరగించి॥





పెండెపు పాదము చాచిపునచి ఒకపాదము
అండనే పూజలు గొనీనల్లవాడే
కొండల శ్రీ వేంకటాద్రి కోరిఅహోబలమున
మెండుగాను మెరసీ లక్ష్మీనారసింహుడు ॥ఆరగించి॥

## భావామృతం

(అహోబల లక్ష్మీనారసింహునికి భక్తులు నైవేద్యం సమర్పించారు. ఆ స్వామి దాని నారగించాడు. ఇక....) లక్ష్మీనారసింహుడు, అదిగో ఆయన ఆరగించి కూర్చున్నాడు. మన వద్దనే యున్నాడు. ఆయనను పరికించండి.

ఆ స్వామి లక్ష్మీదేవిని తన ఎడమ తొడపై కూర్చొన బెట్టుకొని, అదిగో అక్కడ అందముగా నవ్వుతూ కనిపిస్తున్నాడు. ఆదిశేషుడు పడగలపై మాణిక్యములు ధగధగా మెరుస్తుండగా ఆయనకు గొడుగువలె నీడ బట్టాడు. అట్టి లక్ష్మీనారసింహుడు అనేక వరములిచ్చి కాపాడు మహానుభావుడు.

స్వర్ణమయమైన భవంతిలో, వజ్రాలసింహాసనం పై కూర్చొని నర్తకీమణుల నృత్యాన్ని తిలకిస్తున్నాడు అదిగో వాడే లక్ష్మీనారసింహుడు. అనేక రంగులు వెదజల్లే ఆభరణాలతో రాచఠీవితో విరాజిల్లుతున్న ఈ స్వామి మన యెట్టెదుటనే కనిపించుచున్నాడు.

పెండెములు (కాలికడియములు) గల పాదములు మెరుస్తుండగా ఒక పాదము చాచియుంచియు, ఇంకొకపాదము చుట్టి బిగించియు ఆసీనుడై అక్కడే పూజలందుచున్న ఆ లక్ష్మీ నారసింహుడు అదిగో ఆకనబడుతున్నవాడే. తిరుమల ఏడుకొండల పైనున్న వేంకటేశ్వరుడే కోరి, నేడు అహోబల లక్ష్మీనారసింహుడై అధికముగా మెరిసిపోతూన్నాడు.

## మున్నుడి 1-62

నేటి 'నాగరీకులు' నారదుని 'తంపులమారి కుయుక్తిపరునిగా' చిత్రీకరించి ప్రజలకు తప్పుడు సంకేతాలిస్తున్నారు. వారు భ్రష్టులవడమే గాక మనతరువాతి తరాన్ని చెడగొడుతున్నారు. మనల్ని పాపములనుండి రక్షించిన మహామహుడు నారదుడు. మనోవాక్కర్మలచే అనుక్షణం పాపాలు చేస్తూనేవున్నాం మనం. దానికి తగ్గపాపాలు కొండలవుతున్నాయి. ఇక హరినామ సంకీర్తనే గతి.

**సీ॥ బ్రహ్మస్వరూపంబు, పరమపావనమిది**
**దురితనివారంబు అరిహరంబు**
**శరణన్న వారిని కరుణించి రక్షించు**
**యమభీతి తొలగించు అద్భుతంబు**
**హిమశైలసుత, బ్రహ్మ, ఇంద్రాది సురులెల్ల**
**అనయంబు గొలిచెడి అతిశయంబు**
**సకల సంపదలిచ్చి చపలంబు పరిమార్చి**
**సులువుగా ముక్తియు సుఖప్రదంబు**

**తే॥ నామసంకీర్తనం బిక నళిని ధవుని**
**అన్నమయ్య చెప్పిన రీతి అనవరతము**
**జేసితిరుమలరాయని జేరుదయ్య!**
**గర్భవాసంపు గండంబు కలుగబోదు.**

**రాగం : గంభీరనాట**

చాలదా బ్రహ్మమిది సంకీర్తనం
జాలెల్లనడగించు సంకీర్తనం ॥చాలదా॥

సంతోషకరమైన సంకీర్తనం
సంతాపమణగించు సంకీర్తనం
జంతువుల రక్షించు సంకీర్తనం
సంతతము దలచుడీ సంకీర్తనం ॥చాలదా॥

సామజము గాచినది సంకీర్తనం
సామమునకెప్పుడీ సంకీర్తనం
సామిప్యమిందరికి సంకీర్తనం
సామాన్యమీ విష్ణుసంకీర్తనం ॥చాలదా॥





జములూరి విడిపించు సంకీర్తనం
సమబుద్ధివొడమించు సంకీర్తనం
జమళిసౌఖ్యము లిచ్చు సంకీర్తనం
శమదమాదుల జేయు సంకీర్తనం ॥చాలదా॥

జలజాసనుని నోరి సంకీర్తనం
చలికొండ సుతదలచు సంకీర్తనం
చలువకడు నాలుకకు సంకీర్తనం
చలపట్టి తలచుడీ సంకీర్తనం ॥చాలదా॥

సరవి సంపదలిచ్చు సంకీర్తనం
సరిలేని దిదియపో సంకీర్తనం
సరుసవేంకటవిభుని సంకీర్తనం
సరగనను తలచుడీ సంకీర్తనం ॥చాలదా॥

**భావామృతం**

(శ్రీవేంకటేశ్వరుని నామసంకీర్తన మహిమను కీర్తిస్తున్న అన్నమాచార్యుల నవధరించండి) సాటిలేనిపరమాత్మ స్వరూపమే ఈ సంకీర్తనము అని పిలువబడే సన్నుతి. మనస్సులలో కలిగే విచారమును రూపుమాపునదే ఈ సంకీర్తనము.

ఈ సంకీర్తనము ఎంతో ఆనందమును కలిగించునది. దుఃఖమును నివారించునదియును ఇదియే. జ్ఞానములేని జంతువులను కూడ ఈ సంకీర్తనము రక్షించును. అందుచేత ఈ సంకీర్తనమునెల్లవేళలయందు జరుపుడు.

ఈ సంకీర్తనమే ఒకప్పుడు గజేంద్రుని కాపాడినది. ఎల్లరను అనుకూలురుగా చేయగలిగినదియు ఈ సంకీర్తనమే. సామీప్యము (సమీపముననే ఉండుట) అను భాగ్యమును ఈ సంకీర్తనము కలిగించును. అందుచేత విష్ణునామ సంకీర్తనము సామాన్యమైనదా? ఎన్నటికీ కాదు. యమధర్మరాజు శిక్షలనుండి తప్పించునది ఈ సంకీర్తనమే. సుఖదుఃఖాది ద్వంద్వములయందు సమానమైన బుద్ధిని కలిగించునదిదియే. ఇబ్బడిగా (రెండింతలుగ) సుఖములనిచ్చునదీ నామసంకీర్తనమే. దీనినాశ్రయించినవారికి కామక్రోధములు, పలుక్లేశములనుండి విముక్తి నీనామ సంకీర్తనము కలిగించును.

బ్రహ్మదేవుని చతుర్ముఖములనుండి వెలువడినది ఈ సంకీర్తనమే. దీనినే పార్వతీదేవి నిష్ఠతో జరుపుకొనును. నాలుకకు ఎంతో అద్భుతముగా చల్లగా హాయినిచ్చునదీ సంకీర్తనమే. చపలత్వమునధిగమించి స్వామి నామసంకీర్తన జరపండి. క్రమముగా సర్వసంపదలిచ్చునదీ సంకీర్తనమే. సరి అనేది లేనిదిదియేపో. సరసుడైన శ్రీవేంకటేశ్వరుని నామ సంకీర్తనము, వెంటనే తలచి జరపండి.

1-63

## మున్నుడి

అల్పప్రాణియైన ఈ జీవుడెంత? వీడి బ్రతుకెంత? సర్వ నియామకుడైన సర్వేశ్వరుని మాయయే సర్వమునకు కారణమని తెలుసుకోలేక సంసార లంపటంలో తగులుకొని చీమల వలె, తేటీగలవలె, గిజిగాని పక్షులవలె జీవిస్తున్నారే.! అనవరతమూ ఈ సంసార తాపత్రయంలో నలిగిపోతున్నారే! అని అన్నమాచార్యులవారు వేదన జెందుతున్నారు. శ్రీ వేంకటేశ్వరుని భక్తులు మాత్రం ఈ కూపంలో బడక వారిని చూచి నవ్వుకొని స్వామికి కృతజ్ఞతతో తమనా రొచ్చులో పడకుండా కాపాడినందుకు శరణాగతి నున్నారంటున్నారా అన్నమయ్య.

**కం॥ సతతము సంసారంబున**
**మతిపోయిన జీవులన్ని మాయలదగులున్**
**గతి వేంకటేశ్వరుండని**
**వెత వీడరు అన్నమయ్య వేదన బలికెన్.**

**రాగం : సారంగనాట**

తానెంత బ్రతుకెంత దైవమా నీమాయ యెంత
మానవుల లంపటాలు మరి చెప్పగలదా ॥తానెంత॥

చెలరేగిన బారేటి చీమసయితమును
కలసి పూరకేపారు గమ్మర నెందో మరలు
తలమోచి కాపురము ధాన్యములు గూడపెట్టు
యిల సంసారము ధనకిక నెంతగలదో ॥తానెంత॥

యేడో బాయిటు బారే యీగ సయితమును
వాడుదేర నడవుల వాలివాలి
కూడపెట్టు దేనెలు గొందుల బిల్లల బెట్టు
యేడకేడ సంసారమిక నెంత గలదో ॥తానెంత॥





హెచ్చిగిజిగాండ్లు సయితమెంతో గూడవెట్టు
తెచ్చి మిణుగురు బురువు దీపము వెట్టు
తచ్చి శ్రీవేంకటేశ నీదాసులు చూచినగుదు
రిచ్చలదాని సంసారమిక నెంతగలదో ॥తానెంత॥

## భావామృతం

మానవుడేపాటివాడు? అసలు వాడి బ్రతుకెంత? ఓ ప్రభూ! అంతా నీమాయ గాక మరేమిటి? ఈ మానవుడు తగిలించుకొన్న శ్రమల గురించి మరి ఇంకా ఏం చెప్పగలం?

ఉత్సాహముతో నేల మీద పాకే చీమలు కూడా ఎక్కడెక్కడికో పోయి ధాన్యపు గింజలను సేకరించి తలకు మించిన భారమైనా మోసుకువచ్చి తన కాపురము నిర్వహించుకొంటున్నది. దానికి కూడా ఈ సంసార తాపత్రయమెంత గలదో!!

ఎక్కడో బయట తిరిగే తేనెటీగలు సైతం, అలవాటు చొప్పున అడవులలో పూవులపై వాలి వాలి పూలమకరందాన్ని సేకరించి తేనెపట్లు ఎక్కడెక్కడో పెట్టి తన బిడ్డలకి మకరందాన్ని పంచిపెడుతోంది కదా! (చివరికి అది దుర్మార్గులైన నరుల పాలవుతోంది). అల్పప్రాణి ఆ తేనెటీగకు ఎంత సంసార వ్యామోహం!!

గిజిగాడు అనే పక్షి కూడా అద్భుతమైన పొదరిల్లులాంటి గూడు కట్టి, అందులో తన పిల్లల్ని ఉంచి, ఆ గూటిలోని చీకట్లో తన పిల్లలు భయపడతాయని మిణుగురు పురుగులను తెచ్చి దీపం వలె ఏర్పరుస్తుంది. దాని సంసార యావ చూచి ఓ వేంకటేశ్వరా! నీ దాసులైన భక్తులు “దీనికెంత భ్రమ” అని నవ్వుకొంటారు. అట్లే మమ్మల్ని చూచి నీవు మా పిచ్చికి నవ్వుకొంటావు.

**1-64**

## మున్నుడి

వసంత శోభలతో అలరారే అలమేలు మంగమ్మ సౌందర్యాన్ని ఏమని వర్ణించగలనని కీర్తిస్తున్నారు అన్నమాచార్యులు. తనని తానే అమ్మవారికి చెలికత్తె వలె ఊహించుకొంటున్నారేమో దేవిని 'ఏమే' అనే సంభోధిస్తున్నారు. తల్లి మధురాధరములను వర్ణించటం తిరుమలనాధునికి ఆ తరువాత దేవి చెలికత్తియకు మాత్రమే సాధ్యము కదా! ఆ ప్రభువును కైవసం చేసుకొనుట ఆమె కౌగిలికి దక్కిన హక్కు. మనబోటి వాళ్లమంతా ఒక్క రెప్పపాటున ఆ జగన్నాథుడు కనిపిస్తే చాలు అనుకొంటుంటే అమ్మవారు ఆయనను తన సోయగాలతో బంధీని జేసింది. ఎంత అద్భుతం ఈ సంకీర్తన?

**చం॥ వనరుహలోచనన్, సిరుల భామను, మంగను, వేంకటేశురా**
**ణిని, సురనాధుడున్ మునులు నీరజనాభుడు గొల్చు దేవినిన్**
**తను పొగడంగ జాలనని దాపరికంబులు వీడి, కీర్తనన్**
**వినుతిని జేసె నన్నమయ విష్ణుసతిన్ నవపల్లవాధరన్**

**రాగం : అభేరి**

ఏమని పొగడుదుమే యిక నిను
ఆమని సొబగుల అలుమేల్మంగ ॥ఏమని॥

తెలికన్నుల నీ తేటలే కదవే
వెలయగ విభునికి వెన్నెలలు
పులకల మొలకల పొదులివి కదవే
పలుమరుపువ్వుల పానుపులు ॥ఏమని॥

తియ్యని నీ మోవి తేనెలే కదవే
వియ్యపు రమణుని విందులివి
ముయ్యక మూసిన మొలక నవ్వుకదె
నెయ్యపు కప్రపు నెరిబాగాలు ।ఏమని॥





కైవసమగు నీ కౌగిలే కదవే
శ్రీవేంకటేశ్వరు సిరినగరు
తావుకొన్న మీ తమకము లేకదే
కావించిన మీ కళ్యాణములు ॥ఏమని॥

## భావామృతం

ఓ అలమేలు మంగమ్మా! వసంత శోభలీను నీ సౌందర్యపు సొగసులను నేనేమని వర్ణించగలను తల్లీ!

నిర్మలమైన నీ తెల్లని కన్నుల కాంతియే కదే! తల్లీ! వేంకటనాధునికి వెన్నెల వెలుగు. మాటి మాటికీ కలిగే నీ పులకరింతల మొలకల పూతలే కదే తల్లీ! స్వామికి పూలపాన్పులు. వాటిని నేనెట్లు వర్ణించగలను?

నీ మధురాధరముల మకరందములే కదే!తల్లీ! మా వేంకట రమణుడు నీ పెండ్లి విందులుగా అందుకొనినది. కనుపించీ కనుపించనట్లున్న నీ చిరునవ్వులు కర్పూర మిళితమైన వక్కపొడి సుగంధాన్ని వెదజల్లుచున్నవి కదే! తల్లీ!

స్వాధీనముచేసికొను నీ పరిష్వంగమే కదే! తల్లీ! ఆ శ్రీవేంకటేశ్వరుని శృంగారపురము. సుస్థిరమైన నీ మోహావేశమే కదా! తల్లీ! జరిపించబడిన మీ కళ్యాణ వైభోగములు.

## 1-65

### మున్నుడి

ఒకానొక కాలంలో బ్రాహ్మణులు, సుక్షత్రియులు, వైశ్యులు విద్యావంతులు త్రికాలములలో 'సంధ్య' వార్చేవారు. ఆ సంధ్యా వందన' కార్యక్రమంలో, కేశవనామాలు కీర్తించి తద్వారా జగన్నాధుని కొలిచి తాము ఆ నాటికి చేసిన పాపములనుండి పరిహారం పొందేవారు. నేటి నవీనయుగంలో సంధ్యవార్చే సంగతి దేవుడెరుగు, నారాయణుని పేరు నాలుకతో పలుకని వారే అధికులనిపించు కొంటున్నారు. అన్నమయ్య కాలంలో ఇంత దౌర్భాగ్యం లేదుకాని, చదువురాని సామాన్యులలో కేశవ నామాలు రానివారు చాలామంది వుండేవారేమో! అందుకే ఇలాంటి కీర్తనల్లోనే నామ సంకీర్తన జరిపి నాబోటి వారిని ఉద్ధరించారు 'పదకవితా పితామహులు'.

**ఆ.వే॥ కీర్తనంబులోన కృష్ణుని నామాలు**
**పాడెనన్నమయ్య భజనవోలె**
**వేంకటేశు గొలువ 'భేషైన' దారిరా**
**చదువు ' సంధ్య' రాని 'జడుని' కైన.**

**రాగం : మౌళవగౌళ**

శరణు శరణునీకు జగదేకపతి కృష్ణ
వరమునొసగవయ్య వాసుదేవ కృష్ణ ॥శరణు శరణు॥

మద్దులు విరిచినట్టి మాధవ కృష్ణ
సుద్దుల చెప్పుమయ్య అచ్యుత కృష్ణ
వొద్దు (ద్ద) రాగదవ్య ఉపేంద్ర కృష్ణ
ముద్దులు గురియవయ్య ముకుందకృష్ణ ॥శరణు శరణు॥





గొల్లెతల మరిగిన గోవింద కృష్ణ
చెల్లెనయ్యనీ చేతలు శ్రీధరకృష్ణ
అల్లన దొంగాడవయ్య హరికృష్ణ
మల్లుల గెలిచినట్టి మధుసూదనకృష్ణ ॥శరణు శరణు॥

గోవులగాచినయట్టి గోపాలకృష్ణ
కైవశమై మమ్మేలు శ్రీ కరకృష్ణ
నీ విన్నపమావించు నారాయణ కృష్ణ
సేవకుడ జోమ్మినీకు శ్రీ వేంకట కృష్ణ ॥శరణు శరణు॥

### భావామృతం

జగన్నాధుడవైన ఓ శ్రీ కృష్ణ! నీకు శరణు. శరణు తండ్రీ! ఓ వాసుదేవా! కృష్ణా! మాకు వరముల ననుగ్రహింపుము.

ఱోటికి నిన్ను యశోద బంధించగా ఆ రోటితోనే పాకుతూ వెళ్ళి పెరటిలోని మద్దులను గూల్చి కుబేరుని పుత్రులైన మణికంఠునకు నలకూబరునకు శాపవిముక్తి నిచ్చిన మాధవుడవైన కృష్ణా! శరణు.

గీతా బోధనవంటి సుబోధను చెప్పవయ్యా అచ్యుత కృష్ణా! నావద్దకు రావయ్యా ఉపేంద్రుడ (వామనుడు)వైన కృష్ణా! ముద్దులొలికించి మా ముచ్చట దీర్చవయ్యా ముకుందుడవైన కృష్ణా!

గోపికలతో రాసక్రీడల నలవాటు చేసికొనిన గోవిందుడవైన కృష్ణా! నీకు శరణు. నీ చేష్టలు నీకే చెల్లును కదా! శ్రీధర కృష్ణా! మెల్లిగా పిల్లిలా దొంగిలించవయ్యా (నాహృదయాన్ని) శ్రీహరివైన కృష్ణా! మధు అనే రాక్షసుని మర్దించినట్లు చాణూరుడనే మహమల్లుని మర్దించిన మధుసూదనుడవైన కృష్ణా నీకు శరణు.

బృందావనంలో గోవులను కాచిన ఓ గోపాలకృష్ణా! నీకు శరణు. లక్ష్మీ కటాక్షము నొసగే కృష్ణా! మమ్ము నీ అధీనములో ఉంచుకొని ఏలుకో ప్రభూ! ఓ నారాయణ కృష్ణా! నా విన్నపములనాలకింపుము. తిరుమలేశుడవైన ఓ వేంకట కృష్ణా! మేము సదా నీ సేవకులమే తండ్రీ! అట్టి నీకు శరణు శరణు.

**1-66**

## మున్నుడి

తత్త్వబోధ చేయుటంలో తాళ్ళపాక ఆచార్యులు అద్వితీయులు. ఈ సారి అన్నమయ్య నేరుగా సంసారమును, మాయను, ఇంద్రిమయులను, చంచలమైన ఆశలను, పాపముల దొంతరను ప్రశ్నిస్తున్నారు. మేమేదో గొప్పవాళ్ళమని మమ్మల్ని ఆశ్రయించకిండి అని వాటన్నింటినీ మందలిస్తున్నారు.తోలుబొంతలో ఎముకలగూట్లో, పంచభూతాల దయవల్ల గుప్పెడు మెతుకులు తిని నెత్తుటి 'కోట'లో బిక్కుబిక్కుమని బ్రతుకుతున్న మా ఏడుపేదో మమ్మల్ని ఏడవనివ్వండి. మా వేంకన్నతో చెప్తా జాగ్రత్త అన్నట్లు పాడుతున్నారు.

**ఉ॥ ఇంకను రోయరేమనుచు నివ్విది బుచ్చిరి అన్నమయ్యతాన్**
**మంకును వీడరేమనిరి, మానువుడెంచెడి యింద్రియమ్ములన్**
**పంకిలమైన పాపముల బారిబడన్ తగదంచు బల్కుచున్**
**వేంకటనాథు వేదమని విజ్ఞత దెల్పిరి కీర్తనంబునన్.**

**రాగం : దేవగాంధారి**

ఇంకనైనా రోయరాదా-యీ పాటివారమింతే
మంకుదనమేల మా-మాట వినరాదా ॥ఇంకనైనా॥

తోలుబొంత కట్టుకొన్న-దొరనింతే నన్నునీవు
కూళసంసారమా యేల- కొసరేవు
ఈలకొన్న యెముకల-యింటలో కాపురమింతే
యేలమాయ వెంటబెట్టే-వేమిగద్దు నీకును ॥ఇంకనైనా॥

పంచభూతపు చుట్టాల-బదుకులో వాడనింతే
యెంచ కింద్రయ యాచకు-లేలవచ్చేరు
కంచపు గాలావటించే-కలిమిలో వారమింతే
చంచలపు టాసలు చేయి-చాచనేటికి ॥ఇంకనైనా॥





నెత్తురు జలదుర్గాన-నిలిచినవాడనింతే
జొత్తుబాపములు యేల-చోటడిగేరు
హత్తిన శ్రీ వేంకటేశు-డాత్మలోననున్నవాడు
మత్తుపుటజ్ఞానమా-మమ్మేమి చూచేవు ॥ఇంకనైనా॥

**భావామృతం :**

ఓ మానవుడా! ఇంకనైన వెగటు భావన కలుగుట లేదా? మీసంసార యావతో మమ్మల్నెందుకు పట్టుకొని బాధిస్తారు? మా బ్రతుకే ఘోరంగా ఉన్నది. మా వల్ల మీకేం లాభం? మీకెందుకింత మొండితనం? ఇకనైన మా మాటవినరాదా?

నేను అందరిలాగా దర్పం చూపిస్తున్నాను కాని, నిజానికి తొమ్మిది కంతలున్న తోలు బొంతను కట్టుకొనివున్నాను. ఓ కుటిలసంసారమా! నాబోటి హీనుడి నావహించి నీకేం లాభం? నేనే ఒక ఎముకల గూట్లోవున్నాను. ఓ మాయా! నీవు నావెంటబడితే నీకేం ప్రయోజనం? నా అవస్థకునన్నొదిలేయరాదా?

నేను స్వయంగా బ్రతికే దమ్ములేక నాచుట్టాలయిన పంచభూతముల పంచజేరి బ్రతుకుతున్నాను. ఓ ఇంద్రియములారా ! అడుక్కుతినే వాడి దగ్గిర గోక్కు తినే వాడిలాగా నిరుపేదనైన నన్నుయాచిస్తారేమిటి? నన్నెందుకు పీడిస్తారు? నాదగ్గరకెందుకు వస్తారు? చంచలమైన ఆశలారా! నా జీవితంలో నేను సంపాదించిందంతా నాకంచంలోని గుప్పెడు మెతుకులు మాత్రమే. అంతకంటే సంపద నాదగ్గరేమి ఉందని నా దగ్గిర చేయిజాస్తున్నారు? ఎందుకు నా గొడవమీకు?

నేనే నెత్తురుతో నిండిన ఒక 'జలదుర్గము' లో వున్నాను, (శరీరంలో వున్నాను) నాకే గతిలేదు. ఓ పాపాలగుంపుల్లారా! నన్ను చోటు అడుగుతారేమి అన్యాయమే? సర్వాంతర్యామియైన శ్రీ వేంకటేశ్వరుడు నా ఆత్మలోనున్నాడు.

మదమెక్కిన ఓ అజ్ఞానమా! మమ్మల్నేంపరీక్షిస్తావు? అది నీవలన అవుతుందా?

## 1-67

### మున్నుడి

ఈ సంస్కృత సంకీర్తనలో అన్నమయ్య భక్తితో శ్రీ మన్నారాయణుని సంస్తుతిస్తున్నారు. భూకాంతునిగా, లక్ష్మీవల్లభునిగా, మంగళగౌరీస్తుత్యునిగా, దేవతా గణమకుటమణిరంజితపాదయుగళ శోభితునిగా, కైవల్యకాంతా రమణునిగా శ్రీ వేంకటేశ్వరునిగా, మూర్తివంతుని కీర్తిస్తున్నారు. ''మోహనరాగమహా! మూర్తివంతమాయే....'' నన్నట్లు మోహనరాగంలోని ఈ కీర్తన అమృతధారలో చల్లగా జలకమాడినట్లుంటుంది. ఆనందంచండి మరి.....

**కం॥ నారాయణునికి స్తుతియిది**
**ఆరాధించంగ హరిని అమరము నందున్**
**ఈ రీతి సన్నుతించిరి**
**ఏరీ అన్నయ్యసాటి ఈ జగమందున్**

**రాగం : మోహన**

నమో నారాయణా (నమః)
సమధికానందాయ సర్వేశ్వరాయ ॥నమో॥

ధరణీసతీ ఘనస్తన శైలపరిరంభ-
పరిమళ శ్రమజల ప్రమదాయ
సరసిజ నివాసినీ సరసప్రణామయుత
చరణాయతేనమో సకలాత్మకాయ ॥నమో॥

సత్యభామా ముఖాంచన పత్రవల్లికా-
నిత్యరచనక్రియా నిపుణాయ
కాత్యాయనీ స్తోత్రకామాయతేనమో
ప్రత్యక్షనిజ పరబ్రహ్మరూపాయ ॥నమో॥





దేవతాధిపమకుట దివ్యరత్నాంశు సం-
భావితామల పాదపంకజాయ
కైవల్యకామినీ కాంతాయ తే నమో
శ్రీ వేంకటాచల శ్రీ నివాసాయ ॥నమో॥

### భావామృతం

ఓ శ్రీ మన్నారాణా! నీకు నమస్కరించి కీర్తించుచున్నాను. నీవు మిక్కిలి అధికమైన ఆనందమును సమాకూర్పు సర్వేశ్వరుడవు. నీకు వినమ్రుడనై నమస్కరించు చున్నాను.

భూకాంతయొక్క ఘనస్తనగిరులను కౌగిలించ నెగడిన పరిమళ స్వేదజలములచే ఆనందము పొందు ధరణీధరా! నీకు వందనము. పద్మాలయయైన శ్రీ లక్ష్మి సంతోషముతో కొలుచు పాదపద్మ యుగళము గల సర్వాత్మకా! నీకు ప్రణామములు.

నిత్యమూ సత్యభామ యొక్క ముఖమనెడి అంచనపత్రము మీద లతలతో ఏవేవో రచనలు చేయుటయందు సిద్ధహస్తుడవైన శ్రీ కృష్ణా! నీకు వందనములు. కాత్యాయనీదేవి (పార్వతీ దేవి) చే స్తుతింపబడు కామితప్రదాయకా! నీవు కట్టెదుట ప్రత్యక్షమైయున్న పరబ్రహ్మ స్వరూపుడవు. నీకు నమస్కరించెదను.

ఓ ప్రభూ! అఖిలదేవగణములచే పాదాభివందనము స్వీకరించుచుండగా వారికిరీటములలోని మణుల దివ్యకాంతిచే మెఱయు పాదపద్మములు గలవానివై ప్రకాశించుచుంటివి. నీవు ముక్తికాంతా వల్లభుడవు. ఓ శ్రీ నివాసుడవైన వేంకటాచలాధిపా! నీకు భక్తి పురస్సరంగ వందనమాచరించుచున్నాను. నన్నునుగ్రహింపుము తండ్రీ!

## 1-68

### మున్నుడి

నృత్యం చేస్తున్నప్పుడు తాళబద్ధంగా పదఘట్టన గావించుటకు "ధిత్తై, ధిత్తై, ధిత్తై" అంటూ చేతులతో తాళంవేయటం గమనించే వుంటారు. అది ఒక క్రమంలో సాగుతుంది. అంతేకాని ' ధిత్తై' అనే మాటకు వేరే అర్ధం ఉండదు. ఆ కోవలోకి చెందినవే "తత్తాతి గుడి ధిం ధిం ", "తకధిం", "తిత్తి తిత్తి తిత్తి", "తిరో తిరో" అనే మాటలు కూడా. ఇది సంస్కృత సంకీర్తన. నృసింహుని తాళానుగుణంగా స్తుతిస్తున్నారు అన్నమయ్య. ఈ కీర్తనకు భావామృతం చెప్పటం కష్టసాధ్యమని వేరుగా చెప్పవలసిన అవసరం లేదు కదా!

**ఆ.వె॥ తిత్తి తిత్తి తిత్తి ధిం ధిం తిరో తిరో**
**అనుచు ' తాళ' గతిని అన్నమయ్య**
**కీర్తనంబు పాడె గీర్వాణభాషలో**
**వేంకటేశు గొలిచె వినుడు దీని**

**రాగం : మోహన**

తత్తాతి గుడి ధిం ధిం తకధింధిం
తిత్తి తిత్తి తితి తితి తితి ॥తత్తాతి॥

దానవదన వితాన దాన సం-
ధానరుధిర నిజపాన మిదం
నానాభూతగణానాం గానం
దీనజనానాం తిత్తిత తితి తితి ॥తత్తాతి॥

విమత దనుజమత విభవపరిభవిత
సమధికం తవ శౌర్య మిదం
ప్రమదా భవ్యం ప్రమాదాభరణం
తిమిర నిరసనం తిత్తితి తితి తితి ॥తత్తాతి॥





తిరువేంకటగిరి దేవ నిధానం
పరమామృతరస భాగ్యమిదం
కరుణావరణం కమలా ఘటనం
తిరో తిరో తిత్తితి తితి తితి ॥తత్తాతి॥

**భావామృతం**

తత్తాతిగుడి ధిం ధిం తక ధిం ధిం

తిత్తి తిత్తి తితి తితి తితి

ధారాళముగా కారుచున్న ' చొంగ' తో కలిసిపోయిన రక్తమునంతయూ వచ్చింది వచ్చినట్లే త్రాగివేయుచున్నవాడీ నరసింహుడు. రకరకములైన జీవగణములు అన్నియూ కీర్తించి పాడుచున్నారు. దీనజనులు తిత్తి తిత్తి అని నర్తించుచున్నారు.

శత్రువులైన రాక్షసుల యొక్క వైభవమును దారుణంగా అవమానించు శౌర్యము కలవాడీ నరసింహుడు దానవులను అజ్ఞాన తిమిరములావహించగా వారికి సంతోషముతో కలిగే ఏమఱుపాటును నిరసించే ఆయన ప్రతాపమే తిత్తితి తితి.

ఇది తిరువేంకటపతి పుణ్యనిలయము.' పరము' అనే అమృతం పొందే భాగ్యం ఇక్కడ కలుగుతుంది. ఇది దయావృష్టికి నెలవు. లక్ష్మీదేవికి ప్రియమైన స్థానం ఈ మహానుభావుని హృదయమే. తిరో తిరో తిత్తితి తితి.

## 1-69

### మున్నుడి

తిరుపతిలో గోవిందరాజస్వామి తన దేవేరులతో వూరేగుతున్నాడు. కోలాహలం చేస్తున్న భక్త బృందాలతో పురవీధులు క్రిక్కిరిసిపోయాయి. విచ్చుకత్తులు ధరించిసేన జనుల భద్రత కోసం సాగి తోడుగావస్తున్నది. వింజామరలు వీచి స్వామికి సేవ చేస్తున్నారు మరికొంతమంది. కన్నులారా ఆ వూరేగింపు చూచిన వారిదే భాగ్యం. అన్నమాచార్యుల వారు ఆ నాటి ఆ ఊరేగింపుని కళ్యాణి రాగంలో కమనీయమైన కీర్తనగా ఆలపించారు. దానిని అవధరించండి.

**ఆ.వె॥కొలువు దీర్చియున్న గోవిందరాజును**
**కొలిచెనన్నమయ్య చెలువుమీర**
**పురము వీధులందు వూరేగు శోభను**
**చూడరయ్య జన్మశుద్ధమగును.**

**రాగం : కళ్యాణి**

కొలువై వున్నాడు వీడెగోవిందరాజు
కొల కొల నేగి వచ్చె గోవిందరాజు ॥కొలువై॥

గొడుగుల నీడల గోవిందరాజు
గుడిగొన్న పడగెల గోవిందరాజు
కుడియెడమ కాంతల గోవిందరాజు
కొడిసాగే పవుజుల గోవిందరాజు ॥కొలువై॥

గొప్ప గొప్ప పూదండల గోవిందరాజు
గుప్పెటి వింజామరల గోవిందరాజు
కొప్పుపై చుంగులతోటి గోవిందరాజు
కుప్పికటారములతోడి గోవిందరాజు ॥కొలువై॥





గొరబుసింగారాల గోవిందరాజు
కురులు దువ్వించికొని గోవిందరాజు
తిరుపతిలోనను తిరమై శ్రీ వేంకటాద్రి
కురిసీవరము లెల్ల గోవిందరాజు. ॥కొలువై॥

### భావామృతం

కొలువుదీర్చి కూర్చున్న ఈ మహానుభావుడే గోవిందరాజస్వామి. ప్రజలందరూ జయజయ నినాదంబులు సేయుచుండగా గొప్ప ఊరేగింపుగా తరలివచ్చుచున్నవాడే గోవిందరాజు స్వామి.

ఈ స్వామి చల్లగా గొడుగుల నీడలోవచ్చుచున్నాడు ఈ గోవిందరాజు స్వామి. క్రమ్ముకొన్న ఆదిశేషుని పడగల క్రిందనున్నాడు. ఈ స్వామి కిరువైపులా భూదేవి శ్రీ దేవి మనోహరముగానున్నారు. ఈ గోవిందరాజస్వామి ఊరేగింపులో బారులుదీరి దండుగా రక్షకభటులు సాగివచ్చుచున్నారు.

గోవిందరాజస్వామికి ఆయన దేవేరులకి గొప్పగొప్ప పూదండలు వేసి అలంకరించినారు. భక్తులువింజామరలు చేబూని భక్తితో స్వామికి వీస్తున్నారు. ఈ గోవిందరాజు స్వామి వారి కొప్పుపై 'చుందులు' ఉన్నవి. గోవిందరాజు స్వామివారు పదునైన విచ్చుకతులు ధరించిన సేనతో ఊరేగివచ్చుచున్నారు.

గోవిందరాజస్వామి గొప్పగా సింగారించుకొని తరలివచ్చుచున్నాడు. ఈ గోవిందరాజులు తన కురులను సొగసుగా దువ్వించుకొనినాడు. తిరుపతి నగరమున స్థిరముగా నెలకొని ఈ గోవిందరాజస్వామి విలసిల్లుచున్నాడు.

మహానుభావుడైన ఈ గోవిందరాజ స్వామి కోరిన వరములెల్ల కురుపించు కల్పవృక్షము వంటివాడు.

**1-70**

## మున్నుడి

అన్నమాచార్యులవారు తానుకూడ ఒక చెలికత్తె వలె భావించి తోటి చెలికత్తెలను మందలిస్తున్నారు. కులుకులు చూపించుకొంటూ నడవకండే అమ్మాయిలూ! అలానడిస్తే, మీ తలలోంచి రాలిన జాజిపూలు గుచ్చుకొని మా అలమేలు మంగ కాళ్ళునెప్పిపెట్టవూ? అని మరీ ఆక్షేపిస్తున్నారు అన్నమయ్య. ఒళ్ళంతా కదిలిపోయేలా నడవకండే మా అమ్మపైట చెంగు జారి ఆ కంగారులో చెమట పడుతుంది నుదురు మీద, అని గదమాయిస్తున్నారు. భావం అంతా ఇక్కడేచేప్పేస్తే కీర్తనలో మాధుర్యం తగ్గిపోతుందేమో. అంత,రసవత్తరమైన గీతమిది. అవధరించండి మరి....

**చం॥ కులకక వేయరే అడుగు కోమలులార! ధరిత్రి రాలెనే**
**జలజల కొప్పులోవిరులు జాజులు యంచని అన్నమయ్యతాన్**
**తెలిపిరి, కీర్తనంబు వినతేనియలూరును ఏడుకొండలన్**
**కొలువగు వేంకటేశ్వరుడు కూడెను మంగకు తోడునీడయై**

**రాగం : అఠాణా**

కులుకక నడవరో కొమ్మలాలా
జలజల రాలీని జాజులు మాయమ్మకు ॥కులకక॥

ఒయ్యనే మేను గదలీ నొప్పుగా నడవరో
గయ్యాళి శ్రీ పాద తాకు కాంతలాలా
పయ్యెద చెరగు జారి భారపు గుబ్బల మీద
అయ్యో చెమరించీ మాయమ్మకు నెన్నెదురు ॥కులకక॥

చల్లెడి గందవోడి మైజారీ నిలువరో
పల్లకి వట్టిన ముద్దు పణతులాలా
మొల్లమైన కుందనపు ముత్యాల కుచ్చులదర
గల్లనుచు కంకణాలు కదలీ మాయమ్మకు ॥కులకక॥





జమళి ముత్యాలతోడి చమ్మాళిగ లిడరో
రమణికి మణుల ఆరతులెత్తరో
అమరించి కౌగిట అలమేలు మంగ నిదె
సమకూడె వేంకటేశ్వరుడు మాయమ్మకు ॥కులకక॥

## భావామృతం

ఓ వనితల్లారా! మీరంతా కులుకుటమాని తిన్నగా నడవండి. మీ తలలోని జాజులు రాలి మా అమ్మ అలమేలు మంగకు. ఇబ్బంది కలిగిస్తున్నాయి. (పూలని తొక్కినా ఆమె లేత పాదములు కంది పోతున్నాయి.

అతిమెల్లగా మీ శరీరాలు కదిలిస్తూ మంచిగా నడవండే, గయ్యాళియైన లక్ష్మీదేవి అడుగులకి మడుగులొత్తే ఓ భామల్లారా! మా అలమేల మంగ కంగారుపడి తన ఘనస్తనములపై పమిటజారి సర్దుకొనే ఆ హడావిడిలో, అయ్యయ్యో! మా అమ్మకు ఫాలభాగమంతా చెమట పట్టింది. మీరు కాస్తమెల్లగానడవండి.

మాతల్లి పల్లకిని మోసే ముద్దుగుమ్మల్లారా! కాస్త నిలబడరమ్మా! ఆమె తనపై చల్లుకొన్న గంధపు పొడి అంతా ఆమె వంటి పై నుండి జారినేల పాలవుతుంది. శ్రేష్టమైన బంగారంలో అమర్చిన ముత్యాల కుచ్చులు అదిరిపోతున్నాయి. (ముత్యాలు రాలిపోతాయి ఆ అదురుడికి). ఆమె చేతి కంకణములు గల్లుమని కదులుతున్నాయి. (కాస్త గుర్రం కట్టేయండీ మరీ...)

ఓ చెలికత్తియలారా! మీరు రెట్టింపైన ముత్యాలతో "చమ్మాళిగలు" ఇవ్వండి. ఈ దేవికి మణులతో మంగళ హారతి ఇవ్వండి. ఎందుకంటే, ఇదిగో మా అమ్మకు జగన్నాథుడైన వేంకటరమణుడు సమకూడి తన బిగికౌగిట ఈ అలమేలు మంగమ్మను అమరించుకొనియున్నాడు. ఆ సర్వేశ్వరుని రాణిని కాస్త జాగ్రత్తగా చూసుకోండి మరీ!....

## 1-71

### మున్నుడి

శ్రీ వేంకటేశ్వరుని మోహన రూపాన్ని నుతిస్తున్నారు అన్నమాచార్యులవారు. మధురమైన మోహనరాగంలో సాగుతుంది ఈ కీర్తన. పదికోట్ల మన్మధుల్ని కూడా తలదన్నే సుందర రూసం ఆ స్వామిది. త్రిపురాసురుల భార్యలను మోహపరిచి వారిని శీలచ్యుతులను గావించి ఆ దైత్యులను సంహరించిన రూపం అనివర్ణిస్తున్నారు అన్నమయ్య. నిగూఢమైన పరిజ్ఞానం ఉంటేగాని ఈ వాక్యానికి అర్థం తెలియదు. నూటికి ఒక్కరికో ఇద్దరికోగాని పూర్తిగా అవగతమయ్యే అవకాశమేలేని కీర్తనలు అన్నమయ్యవి.

**ఉ॥ రాగము మోహనంబు, విమలంబగు కీర్తన నాలకింపుడీ**
**ఈ గతి తాళ్ళపాక గురుడింపుగ పాడెను, వేంకటేశుడున్**
**కౌగిట జేర్చిభూసతిని గ్రక్కున, వీడక శ్రీ వధూటినిన్**
**బాగుగ నిల్పెనంట యెద, బాయని మోహన రూపుదౌటచే.**

**రాగం : మోహన**

అదె చూడరే మోహన రూపం
పది కోట్లు గల భావజ రూపం ॥అదె చూడరే॥

వెలయగ పదారువేల మగువలను
అలమిన ఘనమోహన రూపం
వలచిన నందవ్రజము గొల్లెతల
కులుకు చూపులకు గురియగు రూపం ॥అదె చూడరే॥

ఇందిరా వనితనెప్పుడు తన వుర-
మందు నివిపిన మోహనరూపం
కందువ భూసతి కౌగిట సొంపుల
విందులు మరిగిన వేడుకరూపం ॥అదె చూడరే॥





త్రిపుర సతుల బోధించి రమించిన
అపురూపపు మోహన రూపం
కపురుల శ్రీ వేంకట పతియై ఇల
ఉపమించగ రాని వున్నతరూపం ॥అదె చూడరే॥

### భావామృతం

అదిగో మోహన రూపుడైన ఆ మహానుభావుని చూడండి. పదికోట్ల మన్మధులను కూడ అతిశయించగల సుందర రూపమా స్వామిది.

ప్రసన్నుడై పదియారువేలమంది భామలను ఆక్రమించు ఘనమైన మోహన రూపం ఈయనిది. నందవ్రజంలో (గోకులంలో) తనను ప్రేమించిన గోపికల వయ్యారపు చూపులకు గురియైన అద్భుతమైన రూపం ఈ మోహనునిది.

శ్రీ కాంతను ఎల్లవేళలా తన వక్షస్థలమున నిలుపుకొని సమున్నత స్థానమందించిన జగదేకపతి రూపం ఈ స్వామిది. సామర్థ్యముకలవాడై భూదేవికౌగిలిలో అందముగ విందులారగించిన వేడుగాడైన రూపం ఈ పురాణపురుషునిది.

త్రిపురసురల అంతమునకు వారి భార్యల పాతివ్రత్యం అడ్డుగానున్నదని బోధించి లోక కళ్యాణం కోసం వారితో శృంగారం జరిపిన లోకేశ్వరుని రూపం ఈ దేవునిది. సంభ్రమము కలిగించు శ్రీ వేంకటేశ్వరుని అనుపమమైన అద్భుత రూపమిది. చూచి తరించండి.

**1-72**

## మున్నుడి

కలిమికి అధినాయిక అయినా వేంకటరమణుని అరాంగియై స్వామివారి తలపులలోమైమరచి ఆనందంతో నృత్యం చేస్తోంది అలమేలు మంగమ్మ. చెలికత్తెలు ఆమెను పొగడ్తలతో ముంచెత్తుతున్నారు. శ్రీ హరి కరిగిపోయేట్లుంది ఆమె. ఆ నృత్యానికి సరితూగే పాటలు, అందియల మ్రోతలు... కాసేపు మనని కూడ తిరుమల స్వామివారి సన్నిధికి తీసికొని పోతున్నారా 'పదకవితా పితామహులు'. త్యాగయ్య అన్నట్లు "సొగసు చూడతరమా!!" అయినా ....చూడండి.....

**చం॥ అలరులురాలగా రమణి ఆడెనటంచును సన్నుతించుచున్**
**తెలిపిరి అన్నమ్మయిటుదీటుగ, వేంకటనాధు భామయౌ**
**కలిముల రాణినిన్ గొలువ కమ్మని కీర్తన నాలకింపుడీ**
**చెలువము తోడుతన్ వినుడు శీఘ్రమెపొందుదు స్వామియెన్నికన్**

**రాగం : శంకరాభరణం**

అలరులు కురియగనాడెనదే
అలకల కులుకుల నలమేల్మంగ ॥అలరులు॥

అరవిరి సొబగుల నతివలు మెచ్చగ
అరతెర మరుగున నాడెనదే
వరుసగ పూర్వదువాళపు తిరుపుల
హరికరగింపుచు నలమేల్మంగ ॥అలరులు॥

మట్టపు మలపుల మట్టెల కెలపుల
తట్టెడి నడపుల దాటెనదే
పెట్టిన వజ్రపు పెండెపు తళుకులు
అట్టిటు చిమ్ముచు నలమేల్మంగ ॥అలరులు॥





చిందుల పాటల సిరిపొలయాటల
అందెల మ్రోతల నాడె నదే
కందువ తిరువేంకటపతి మెచ్చగ
అందపు తిరుపుల నలమేల్మంగ ॥అలరులు॥

## భావామృతం

అదిగో ఆ అలమేలు మంగమ్మ తల్లి పూలవాన కురుస్తుండగా నర్తించుచున్నది. ఆమె చిరుకోపం ప్రదర్శించే కులుకులతో మనోహరంగా ఉన్నది. ఆ వైభవం వర్ణనాతీతము

ఆమె చెలికత్తెలు అహో! అని మెచ్చుకొనుచున్నారు. అరవిచ్చిన మొగ్గవంటి ఆ దేవి సగము మూసియున్న తెరచాటున నృత్యముచేయుచున్నది క్రమబద్ధమైన అశ్వయానము వంటి నడకతో ఆ తల్లి శ్రీ హరినే కరగించి వివశుని జేసి తనకు అనుకూలుని గా జేసికొనినది.

మెల్లగా, తిన్నగా నడచుట చేత అలమేలు మంగమ్మ మట్టెలు సవ్వడి చేయుచున్నవి. ఇక (స్వామి వచ్చాడేమో నను తత్తర పాటు కాబోటు)ఆమె గబ గబా అక్కడ నుంచి దాటుకొని పోయినది. అప్పుడు ఆదేవి కాలికి ధరించిన వజ్రపు పెండెములు తళుక్కుమని మెఱయుచు తమ అద్భుతమైన కాంతులను నలుదెసలా విరజిమ్ముచున్నవి.

చిందులు వేయునట్లున్న పాటలతోను, శోభలీను ఆటలతోను ఆ ప్రదేశం ఉత్సాహభరితంగా ఉన్నది. కాలి అందియలు ఘల్లు ఘల్లుమని ధ్వనిస్తుండగా ఆ దేవి ఆడుచున్నది. సమర్థుడైన శ్రీ వేంకటేశ్వరుడు, తిరుమలాధీశుడై ఆ నృత్యాన్ని తిలకించి మెచ్చుకొంటున్నాడు. ఆ విధముగా అందమైన కదలికలతో ఈ అలమేలు మంగమ్మ నడయాడుచున్నది.

**1-73**

## మున్నుడి

సర్వేశ్వరుడెక్కడన్నా మనముందు చేతులు జాపుతాడా? ఒక వేళ జాపిన కూడ మనమాయనకేమీయగలమా? ఎంత అజ్ఞానులం!! ఈ సత్యం తెలియక మేము స్వామివారికి వజ్రాలకిరీటం చేయించామండీ, మేము రత్నాల హారం చేయించాము, అని విర్రవీగే అమాయకులకోసమే ఈ కీర్తన చెప్పారు అన్నమయ్య. ఆయన మన చేత ఏసేవ చేయించుకొన్నా అదిమనని పాప విముక్తుల్ని చేయుటానికి మాత్రమే. సుకృతం వలన మనకు సిద్ధించిన భాగ్యమదియని గ్రహిస్తే చాలు...మనం సరి అయిన దారిలో పడ్డట్లే . అలవోక పదాలతో చెప్పిన అద్భుత కీర్తనమిది.

**కం॥ అన్నిటికి నీశ్వరుండట**
**ఎన్నగ 'వేంకన్నదొర'కు ఏమిత్తుమురా?**
**చెన్నుగ వివరము లిచ్చెడి**
**అన్నయ్యను వినుడు గీతమద్భుతము భళా!!**

**రాగం : హిందోళ**

ఏమని పొగడవచ్చునీతని ప్రభావము
వేమరువో పుణ్యులాల వినరో యీకతలు ॥ఏమని॥

అనంత సూర్యతేజుడట కాంతి చెప్పనెంత
దనుజాంతకుండట ప్రతాపమెంత
మనసిజగురుడట మరిచక్కదనమెంత
వనజజు గనినయట్టి వాడట ఘనతెంత ॥ఏమని॥

గంగాజనకుడటక డు చెప్పే పుణ్యమెం
చెంగట భూకాంతుడట సింగారమెంత
రంగగు లక్ష్మీశుడట రాజసము లెంచనెంత
అంగవించు సర్వేశుడట సంపదెంత ॥ఏమని॥





మాయానాధుడట మహిమవచించుటెంత
యేయెడ దావిష్ణుడట యిరవెంత
పాయక శ్రీ వేంకటాద్రి పతియై వరము లిచ్చే
వేయిరూపుల వాడట విస్తారమెంత ॥ఏమని॥

## భావామృతం

ఈ మహానుభావుని ప్రభావమును మనం ఏమని పొగడ గలము? మాటిమాటికీ ఈయన కథలను ఆలకించండి. ఓ పుణ్యాత్ములారా! అదే పుణ్యం అంటే.

లెక్క లేనంతమంది సూర్యుల కాంతి గలవాడీ స్వామి. ఇక ఆయన కాంతి ఎంతని చెప్పగలం? అసురులను నిర్మూలించుటయే ధ్యేయముగా కలవాని ప్రతాపమెంతటిదని చెప్పగలము? ఈయన మన్మధునికే కన్నతండ్రియట, మరి ఎంత చక్కని వాడో ఎలా చెప్పగలం? సృష్టికర్త అయిన చతుర్ముఖ బ్రహ్మగారినే సృష్టించిన కన్నతండ్రి ఈ స్వామి. మరి ఈయన ఘనత ఇంతని ఎలా చెప్పగలము?

సురగంగను తన పాదములనుండి పుట్టించిన పుణ్యమూర్తి పుణ్యమింతయని చెప్పగలమా? తన సమీపముననే భార్య భూదేవిని నిలుపుకొను సింగారాలు ఎలావర్ణించగలము? వైభవోపేతుడైన శ్రీ కాంతుని ఠీవిని యెంచగలమా? ఎల్లప్పుడు ఉత్సాహముతోనుండు ఈ సర్వేశ్వరుని సంపదయెంతటిదో ఎలా తెలుస్తుంది?

ఈ స్వామి మాయాదేవికే నాధుడు. ఈయన మహిమను చెప్పగలుగుట జరిగేపనేనా? ఎక్కడబడితే అక్కడ వ్యాపించియుండేవాడు కావుననే ఈయనను విష్ణువు అన్నారు. ఇక ఇది ఈయనుండే చోటని చెప్పగలమా? విడువకుండా వేంకటపతియై అంతులేని వరములిచ్చే విశ్వరూపుడైన వేయిరూపముల జగదీశ్వరుని వైశాల్యమెంతో చెప్పే శక్తి ఎవరికుంది?

**1-74**

## మున్నుడి

పదిరోజులకి సరిపోయే తిండి ఒక్కరోజే నోట్లో కుక్కుకొని కడుపులో దాచుకొని బ్రతకాలంటే జరిగేపనేనా? ఈ కడుపెంత తింటుంది? ఇతరులకు మేలుచేయని దదేంజన్మ? పరహితము నేర్పని చదువేం చదువు? ఎప్పుడూ ఏవేవో ఆశలతో బ్రతుకు జీవితం దేనికి అని మందలిస్తున్నారు అన్నమయ్య ఈ కీర్తనలో. శ్రీ వేంకటేశ్వరుని సేవించి తరించడానికి కాకపోతే మనిషికి భోగభాగ్యముల వల్ల ప్రయోజన మేమిటంటున్నారు.

**మ॥ కుడుచున్ నీకడుపెంత దానికొరకై కోట్లెంచి ఆర్జించుచున్**
**మిడుకన్‌యేలర? పాపరాశి పెరుగన్ మేలైన శ్రీ వేంకటే**
**శుడు నీ అండగనుంచు కొమ్ముపరులన్ జొప్పించి వేధించకన్**
**ఇదె జ్ఞానంబును అన్నమయ్య భళిరా! ఈ సత్యమున్ యెంచుడీ**

**రాగం : గుండక్రియ**

కడుపెంతతాకుడుచు కుడుపెంత దీనికై
పడని పాట్ల నెల్ల పడి పొరలనేల ॥కడుపెంత॥

పరుల మనసునకు ఆపదలు కలుగగజేయు
పరితాప కరమైన బ్రతుకేల
సొరిది యితరుల మేలుచూచి సైపగలేక
తిరుగుచుండే కష్టదేహమది యేల ॥కడుపెంత॥

ఎదిరికెప్పుడు చేయు హితమెల్ల తనదనుచు
చదివి చెప్పని యట్టి చదువేల
పొదిగొన్న యాసతో బుంగుడై సతతంబు
సదమదంబైపడయు చవులు తనకేల ॥కడుపెంత॥





శ్రీ వేంకటేశ్వరుని సేవానిరతికి గాక
జీవనభ్రాంతిపడు సిరులేల
దేవోత్తముని యాత్మ తెలియనొల్లక పెక్కు
త్రోవలేగిన దేహి దొరతనంబేల ॥కడుపెంత॥

**భావామృతం**

ఎవరన్నా ఆకలి తీరిన తరువాత మెతుకైనా తినలేరు. కావున ఈ కడుపుయెంత తింటుందని? దీనికోసం పడరాని పాట్లుపడి జీవించాలా? అంత అవసరమేమొచ్చింది?

ఇతరుల మనసుకు కష్టము కలిగించుచు జీవించే నరకప్రాయమైన బ్రతుకు గడుపుట ఎందుకు? అది నిరుపయోగము కదా! అంచెలంచలుగా ఇతరులు యెదుగుతున్నారని చూచి సహించలేని తనమనస్సు కష్టపెట్టుకొంటూ తిరిగే ఈ పాడు దేహం వలన ప్రయోజనమేమిటి?

ఎదుటివారికి చేయు ఉపకారమును తనకు తాను చేసికొనుచున్న ఉపకారముగా భావించి చేయవలెను అని నేర్పనట్టి చదువు అసలు చదువేనా? అట్టాంటి చదువు ఎవరికి మేలు చేస్తుంది? మూకమ్మడిగా పోగై ఆశలతో ఎప్పుడూ చిన్నబుచ్చుకొని అట్టిటవుచూ పొందే రుచులు(అనుభవాలు) తనకెందుకు?

శ్రీ వేంకటేశ్వరుని సేవించి తరించవలెనను కోర్కెతీరుటకు కాకపోతే సిరులు సంపదలు ఎందుకు? వాటిని సంపాదించాలనే జీవన భ్రాంతియెందు కోసం? సర్వేశ్వరుడైన ఆ మహానుభావుని ఆత్మయందు దర్శించుటకు ప్రయత్నించకుండ ఆయా మార్గాలలో పోయేవైభవాలూ, దర్పములూ, డాంబకములా శుద్ధదండగ కదా!

## 1-75

### మున్నుడి

అరుదైన ఈ చక్కటి కీర్తనలో అన్నమాచార్యులవారు 'ఆండాళ్' అని పిలవడబే నాంచిరి దివ్యవైభవాన్ని అనేక నామములతో నుతిస్తూ చెబుతున్నారు. ఈమెను గోదా దేవిగా జగద్విఖ్యాతాం చేసినవి ఈమె స్వామి విరహంతో పాడిన 'పాశురములు'. తిరుప్పావైగా ప్రసిద్ధిచెందిన వాటిని పాడని తమిళబాలిక ఉండదు అంటే అతిశయోక్తి కాదు. రంగనాధస్వామినివలచి, వలపించుకొనిన ఈ తల్లి లక్ష్మీ దేవి అవతారమే. ఈమె తనసిగలో పూదండ పెట్టుకొని 'బాగుంది' అని తృప్తి పడ్డాక స్వామికి అర్పిస్తే మహాప్రీతితో వాటిని స్వీకరించేవాడట స్వామి, వాటి పరిమళం రెట్టింపవడం వల్ల. అందుకే ఆమె 'చూడికుడుతనాంచారి' అని ప్రసిద్ధిచెందింది. తానూ ఒక చెలికత్తెయై పాడుతున్నారు అన్నమయ్య.

**తే॥ "చూడికుడుతనాంచారి" ఈ సుందరాంగి**
**సిగను ముడిచిన విరిదండ తగుదునంచు**
**స్వామికిచ్చిన 'గోదా'యె సతిగమారె**
**తమిళు'లాండాళ్' యనెంచెడీ తల్లి 'లక్ష్మి'.**

**రాగం : మధ్యమావతి**

చూడరమ్మ సతులాల సోబాన పాడరమ్మ
కూడున్నది పతి చూడికుడుత నాంచారి ॥చూడరమ్మ॥

శ్రీ మహాలక్ష్మియట సింగారాలకే మరుదు
కాముని తల్లియట చక్కదనాలకే మరుదు
సోముని తోబుట్టువట సొంపుకళలకే మరుదు
కోమలాంగి ఈ చూడికుడుత నాంచారి ॥చూడరమ్మ॥

కలశాబ్ధి కూతురట గంభీరాలకే మరుదు
తలప లోకమాతయట దయ మరి ఏమరుదు
జలధి నివాసినియట చల్లదన మేమరుదు
కొలది మీర ఈ చూడికుడుత నాంచారి ॥చూడరమ్మ॥





అమర వందిత యట అట్టేమహిమకే మరుదు
అమృతము చుట్టమట ఆనందాలకే మరుదు
తమితో శ్రీ వేంకటేశు తానెవచ్చిపెండ్లాడే
కొమెర వయస్సు ఈ చూడికుడుత నాంచారి ॥చూడరమ్మ॥

### భావామృతం

(రాజుతలచు కొంటే దెబ్బలకు కొదవా? అనే సామెత ఉన్నది. జగజ్జనని అవని నవతరిస్తే స్వామి వెతుక్కుంటూ వచ్చిమరీ పరిణయమాడుతాడు. అదే జరిగింది గోదాదేవి కళ్యాణంలో. నాంచారి అని పిలువబడే ఆ తల్లికేంతక్కువ? చూడండి......)

ఓ అమ్మాయిల్లారా! ఇటుచూడండమ్మా! సొంపుగా పాడండమ్మా! ఈ అపరలక్ష్మీదేవి తన భర్తతో కూడియున్నది. ఈమె వాడిన పూమాలల నర్పించిన నాంచారి.

ఈమె స్వయంగా శ్రీ మహాలక్ష్మియేనట. ఇక ఈమె సింగారింపులకు ఏమితక్కువ? మన్మధునివే కన్నతల్లియైన ఈమె సౌందర్యం వర్ణించగలమా? దానికేమి తక్కువ వుంటుంది. చంద్రునితోబుట్టు వయిన ఈమె కళలకు వెలితియుంటుందా? ఈ కోమలాంగినే చూడికుడుతనాంచారి (ముడిచిన విరిదండ నర్పించిన ఆండాళ్ ) అని పిలుస్తారు. ఈమె లక్ష్మీదేవి అవతారము.

ఈమె క్షీరసాగరకన్య. గంభీరంగా ఉంటుందంటే ఉండదూ? దానికేం తక్కువ? సమస్తలోకములకు జనని కావున ఈమె దయ అపరిమితం. దానికేమి తక్కువ? ఇక ఈమె ఉండేదే జలధి (సముద్రం)లో. చల్లదానాని కేంతక్కువ? ఏదీతక్కువ కాని ఈ తల్లినే అందరు చూడికుడుతనాంచారి అనిపిలుస్తొన్నారు.

దేవతలందరి చేత సన్నుతింపబడు ఈమె మహిమలకు సాటి కలదా? వాటికెంతక్కువ? అమృతం అందరికీ ఆనందమునిస్తుంది. క్షీరసాగరమధనమప్పుడు అమృతంతో పాటు బుట్టిన ఈమె ఇచ్చే ఆనందానికి కొదవవుంటుందా? కోరికతో శ్రీ వేంకటేశ్వరుడు రాయబారాలు నడిపి మరీ పెండ్లాడిన ఈ నవయవ్వన సుకుమారినే భక్తులందరు చూడికుడుత నాంచారి అని పిలుస్తున్నారు.

## 1-76

### మున్నుడి

తల్లిదండ్రులు అతిశ్రద్ధతో జాగ్రత్తతో తమ సంతానాన్ని కంటికి రెప్పలా ఎట్లు రక్షిస్తారో, జీవులందరికీ తండ్రియైన పరమాత్మ జీవులందరినీ రక్షిస్తున్నాడు. పంచభూత రూపమున రక్షిస్తున్నాడు. వాటి రూపంలోనే జీవుల్ని శిక్షిస్తాడు కూడా. ఒక్క సారి ఆలోచిస్తే భూకంపాలూ, జలప్రళయాలు, అగ్నిప్రమాదాలు, సుడిగాలులూ. ఆకాశం నుంచి రాలిపడే ఉల్కలూ మొదలైనవెలా వస్తున్నాయి? అన్నమాచార్యులవారు ఆ పరంధాముని ఎంత అద్భుతంగా కీర్తిస్తున్నారో ' ఆనంద భైరవి'లో వినండి.

**ఆ.వె॥ పంచభూతములును పరమాత్మ రూపులే**
**పెంచుగాని జనుల ద్రుంచుగాని**
**రక్ష అన్నమయ్య రమణుని వేడుట**
**వినుడు మధురగీత విభవమొప్ప.**

**రాగం : ఆనందభైరవి**

ఆదిమూలమే మాకు అంగరక్ష
శ్రీ దేవుడే మాకు జీవరక్ష ॥ఆది మూల॥

భూమిదేవి పతియైన పురుషోత్తముడే మాకు
భూమిపై నేడ నుండినా భూమిరక్ష
ఆమని జలధిశాయి అయిన దేవుడే మాకు
సామీప్యమందున్న జలరక్ష ॥ఆది మూల॥

మ్రోయుచు అగ్నిలో యజ్ఞమూర్తియైన దేవుడే
ఆయములు దాకకుండ అగ్నిరక్ష
వాయుసుతునేలినట్టి వనజనాభుడే మాకు
వాయువందు కందకుండ వాయురక్ష ॥ఆది మూల॥





పాదమాకసమునకు పారజాచే విష్ణువే
గాదివియై మాకు ఆకాశరక్ష
సాధించి శ్రీ వేంకటాద్రి సర్వేశ్వరుడే
సాదరము మీరినట్టి సర్వరక్ష ॥ఆది మూల॥

### భావామృతం

అన్నిటికీ ఆదిమూలమైనవాడు పరంధాముడైన సర్వేశ్వరుడు. అన్ని జీవులకు అంగరక్షకుడై పాలించువాడు ఆ జగదీశ్వరుడే. శ్రీ దేవుడైన ఈ మహానుభావుడే అందరికీ జీవనాధారము. అందుచేత ఆయనే ప్రాణులన్నిటికీ జీవరక్ష.

(అంతే సృష్టిలోని ప్రాణులన్నిటినీ ఆయన ఎలా రక్షిస్తున్నాడు. మనకి అగోచరుడు కదా! ఆయన తానే సృజించిన పంచభూతముల ద్వారా మనని కాపాడుతున్నాడు. పంచభూతముల రూపంలో అనగా భూమి, జలము తేజము(అగ్ని), వాయువు, ఆకాశము అనుపంచభూతముల రూపంలో జీవరక్ష చేయుచుచున్నాడు)

భూదేవతకు నాధుడైన ఆ పురుషోత్తముడే ఈ భూమి పై ఎక్కడనున్నా భూమిరూపంలో ఒక క్రమంలో అన్నీ జరుపుతూ భూరక్షకుడైయున్నాడు. సమృద్ధిగానున్న జలరాశికి స్థానమైన సముద్రమున శేషశాయియైశయనించు ఆ లోకేశ్వరుడే సమీపములోనే వున్న జలరక్షకుడు. ఆదేవుడే జలరూపమున కాపాడుచున్నాడు.

వేదమంత్రములు మారుమ్రోగుచుండగా అగ్నిలో యజ్ఞమూర్తియైన దేవుడే జీవుల జీవస్థానములను తాకకుండా అగ్నిరక్షను కల్పించుచున్నాడు.... పవనపుత్రుడైన హనుమంతుని ఏలునట్టి పద్మనాభుడైన శ్రీ హరే (రామచంద్రుని వలె) మనకు గాలివలన అపాయము రాకుండా వాయురక్ష.

వామనావతారంలో ఒక పాదము చాచి ఏ మాత్రం సందులేకుండా ఆకాశమునంతా కప్పివేసిన విష్ణుమూర్తియే మాకు ఆకాశరక్ష. ఆకాశమువలనగాని దానిపై తిరుగు ఖగోళ పదార్ధముల వేటివలనగాని ఆపద లేకుండ రక్షించుగాక! శ్రీ వేంకటాద్రిపైనున్న ఆ సర్వేరుడే సర్వమూ సాధించి కలిగినవాడు. ఆదర పూర్వకముగా ఆయనే సర్వులకు రక్షకుడుగానున్నాడు.

## 1-77

### మున్నుడి

ఇది నరసింహస్వామి భజన. అందమైన కీర్తనగా చెడుతున్నారు అన్నమాచార్యులవారు. సంస్కృతంలో స్వామిని శ్లాఘిస్తున్నారు. పలుమార్లు నరసింహుని సురనుతుడని, ప్రహ్లాదవరదుడని,భీకరాకారుడని, లక్ష్మీకాంతుడని ఎంతోమంది కీర్తించారు కాని స్వామిని 'సుగ్రీవుడు' అని చెప్పటం పదకవితామహుని ప్రావీణ్యం కాక మరొకటి కాదు. సుగ్రీవుడనగానే అందరికీ వానరరాజు భావనలో మెదలి ఏమిటీ రామాయణంలో పిటకాల (పిడకలు కాదండీ) వేట అనిపిస్తుంది. సుగ్రీవుడంటే చక్కటి మెడకలవాడని అర్థం. అంటే నరసింహుడినలా సంబోధించారు అన్నమయ్య.

**చం॥ అనయము భక్తవత్సలుని ఆశ్రితభీతి విభంజనున్ హరిన్**
**వినయముతో నుతించెదరు వేల్పులనాథుడు, బ్రహ్మ, మౌనులున్**
**విను నరసింహవల్లభుని వేంకటనాథునిమారురూపుగా**
**తను భజియించె నన్నమయ దానిని మీకిటు తెల్పధన్యుడన్.**

**రాగం : పూర్ణ చంద్రిక**

నమో నమో లక్ష్మీ నరసింహా
నమో నమో సుగ్రీవ నరసింహా ॥నమో నమో॥

వరద సులభ భక్తవత్సల నరసింహా
నరమృగ వేష శ్రీ నరసింహా
పరమ పురుష సర్వ పరిపూర్ణనరసింహ
గిరిగుహావాస సుగ్రీవ నరసింహా ॥నమో నమో॥

భయహర ప్రహ్లాద పాలన నరసింహా
నయనత్రయారవింద నరసింహా
జయ జయ సురమునిసంస్తుత నరసింహ
క్రియా కలాప సుగ్రీవ నరసింహా ॥నమో నమో॥





అతి కృపానిలయ మోహనరూప నరసింహా
నత పితమహా ముఖ్య నరసింహ
సతత శ్రీ వేంకటేశ్వర దివ్య నరసింహ
కితవారి భంజన సుగ్రీవ నరసింహా ॥నమో నమో॥

### భావామృతం

ఓ లక్ష్మీనరసింహా! నీకు వందనములు. నీకు నమస్సుమాంజలులు. చక్కటి గొంతుక (మెడ) గల ప్రభూ నీకు నమస్కారములు.

బహుసులభముగా భక్తులపై వాత్సల్యముతో ఎన్నో వరములను ప్రసాదించు ఆకారము దాల్చిన అద్భుత శ్రీ నరసింహుడవు. అన్నిటిలోనూ సిద్ధహస్తుడవైన ఓ నరసింహా! నీవు పరమపురుషుడవు. చక్కటి మెడ గల నరసింహప్రభూ! నీవు పర్వత గుహలు నివాసముగా గల స్వామివి (నరసింహ స్వామి ఎప్పుడూ పర్వత గుహలలోనే వెలసియుంటాడు).

తండ్రి హిరణ్యకశిపుని వలన పడరాని బాధలు పడుచున్న బాలప్రహ్లాదుని రక్షించి దానవుని మట్టుబెట్టిన నరసింహా! నీవు భయహరుగవు. పద్మములవంటి మూడు కన్నులు గల నీవు సురులచేతను మునివర్యుల చేతను ఎల్లప్పుడు బాగుగా స్తుతింపబడుచున్నావు. నరసింహా! నీకు జయమగుగాక! దుష్ట శిక్షణ, శిష్టరక్షణ వంటి కార్యక్రమములు నిర్వహించు నరసింహా! నీకు వందనములు.

మోహనాకారుడువైన అనంతకృపానిధీ! ఓ నరసింహా! నీవు బ్రహ్మాది ప్రముఖ వేల్పులచే సన్నుతింపబడెడి నరసింహుడవు. ఎల్లవేళలా వేంకటేశ్వరుని దివ్యావతారమైన నరసింహా! నీవు వంచకుల వంచనను రూపుమాపు నరసింహుడవు. (బహుశా అన్నమయ్య భావనలో నరసింహ స్వామి, ఎన్నోకుయుక్తులతో అనూహ్యమైన వరములతో వంచించి చావుతప్పించుకోవాలనుకొనే వారివంచనలకు విరుగుడు చేసి నిర్మూలించే వాడని అయివుంటుంది).

**మున్నుడి** **1-78**

కొన్ని అన్నమయ్య కీర్తనలు వేదాంతం నేర్పితే కొన్ని వైరాగ్యాన్ని రుచిచూపిస్తాయి. ఇవి అంత తేలికగా అర్థం కావు. కళ్ళు, ముక్కు, చెవులు, నాలుక, చర్మం అనే (పంచేద్రియాలనే) పాపాత్ముల స్నేహం వలన మనిషికి సంసారమనే దానితో భోగిస్తే'కామము','మోహము' అనే కొడుకులు పుట్టారట. వాళ్ళవల్ల నాశనమై, వేంకటపతి దయ వలన భక్తి అనే కూతురుపుట్టి మోక్షందారిలో పడ్డాడంటున్నారు అన్నమయ్య.

**సీ॥ సంసారమిది యెంత 'జాణ' రా మనుజుండు**
**దుఃఖాన్ని నమ్మును సుఖమనంచు**
**పంచేంద్రియములనే పాపాత్ములను గూర్చి**
**సంసార సుఖమనే స్వల్పధరకు**
**అంటగట్టగ 'కామ' మను సుతుండటు బుట్టి**
**ఆర్జించె పాపంబు అనెడి ధనము,**
**యౌవనమను పాపి అతనికి పుట్టించె**
**'మోహంబ'ను సుతుని, బుద్ధిచచ్చె**

**ఆ.వె॥ తుదుకు వేంకటపతి పదమంటగ 'విరక్తి'**
**అనెడి మంచిదైన అతివ బుట్టె**
**మోక్షమార్గ మిచ్చి ముదుమిచ్చెనట అహో!**
**అన్నమయ్య సాటినరయగలమె?**

**రాగం : శ్రీ రాగం**

ఇదివో సంసార మెంత సుఖమో కాని
తుదలేని దుఃఖమను-తొడవు గడియించె ॥ఇదివో॥

పంచేంద్రియంబులను-పాతకులు దనుదెచ్చి
కొంచెపు సుఖంబునకు -గూర్పగాను,
మించి కామంబనెడి- మేటి తనయుండు జని
యించి దురిత ధన-మెల్ల గడియించె ॥ఇదివో॥





పాయ మనియె మహా-పాతకుడు తనుదెచ్చి
మాయంపు సుఖమునకు-మరుపగాను
సోయగపు మోహమను- సుతుడేచి గుణమెల్ల
బోయి యీ నరకమను- పురము గడియించె ॥ఇదివో॥

అతిశయుండగు వేంక-టాధీశుడను మహా
హితుడు చిత్తములోన- నెనయగాను,
మతిలోపల విరక్తి- మగువ జనియించియ
ప్రతి యయి మోక్షసంపదలు గడియించె ॥ఇదివో॥

**భావామృతం**

ఇదివో ప్రజలారా! సంసారమంటే ఎంత సుఖమో కాని, అది చివరికి దుఃఖములనే ఆభరణములు పెట్టుకొన్న ఆడది అని గ్రహించండి.

మనిషి అటుపైన పంచేద్రియములు (చెవులు, కళ్ళు, నాలుక, ముక్కు, చర్మము) అను పాపాత్ముల స్నేహము వలన స్వల్ప శారీరక సుఖానికి ఆశపడితే 'కామము' అనే కొడుకు జన్మించాడు. వాడు ధనసంపాదన అనే వ్యసనం అలవాటు చేసి చివరికి పాపము అనే ధనం మూటగట్టాడు. అధోగతిబట్టాడు, మనిషి.

ఆ తరువాత ప్రాయము (యవ్వనం) అనే పాపాత్ముడి స్నేహం కలిసి మాయ అనే సుఖముతో రమించి 'మోహము' అనే కొడుకు పుట్టాడు. ఇంకా దుర్మతివీడు. ఈ మనుష్యుడి సుగుణాలనన్నిటినీ చెడగొట్టి నరకము అనే నగరాన్ని కొనివాళ్ళ నాన్నకు (అంటే మనిషికి) బహుమతిగా ఇచ్చాడు. చివరికి ఆ పట్నం లో దారి తప్పి భ్రష్టుడయ్యాడు మనుష్యుడు.

చివరికి ఆ వేంకటేశ్వరుడికి ఈ మానువుడిపై జాలి కలిగి 'విరక్తి' అనే మంచి కుమార్తెను పుట్టించి దయ చూపాడు. వాడి మనస్సులో అప్రతిహతమైన మోక్షమనే సంపదపై ధ్యాసకలిగించి వాడికి మోక్షమును ఆ విరక్తి అనే కూతురు సంపాదించి ఇచ్చింది. లేకపోతే వాడిగతి అధోగతే.

## మున్నుడి

రామనామ సంకీర్తన అనగానే అన్నమాచార్యులవారు పరవశించి పరవళ్ళు తొక్కియుంటారు ఆ నాడు. నందకాంశ సంభూతుని ముఖకమలం వికసించి రంజిల్లుతుంది. భ్రమరములవంటి సంగీతప్రియులు రసాస్వాదనలో మైమరచి పోతాం. దేవభాషలో మకరందం విరజిమ్మే ఈ కీర్తనలో రఘుకుల దీపకునికి నమోవాకములర్పించుచూ సర్వేశా! జగదేకనాథా! అంటూ కీర్తిస్తున్నారు. ఇట్లాంటి కీర్తన పాడుకొంటే రామాయణం పారామణ చేసినపుణ్యం తప్పక దొరుకుంది

**మ॥ జలజాతాక్షుడు రామభద్రునకు రంజైనట్టి సంకీర్తనన్**
**పలికెన్ సంస్కృత భాషలోన వినుడీ బంగారుకున్ తావినే**
**అలిమెన్ యేమొకొ అన్నమయ్య భళిరా! అత్యంత హృదంబుగా**
**కొలిచెన్ వేంకటరాయనిన్ అతడెయా కోదండ పాణంచు తాన్**

**రాగం : సారమతి**

నమో నమో జగదేకనాథ తవ సర్వేశ
విమల విశ్రుత లసద్విఖ్యాత కీర్తే ॥నమో నమో॥

రామరఘువర సితరాజీవలోచన
భూమిజారమణ త్రిభువన విజయ
కోమలాంగశ్యామ కోవిదరణరంగ
భీమ విక్రమ సత్యబిరుద ప్రవీణ ॥నమో నమో॥

దళిత దైతేయ కోదండదీక్షాదక్ష
జలజాప్తకుల విభీషణరక్షకా
కలిత దశరథతనయ కౌసల్యానంద
సులభ వానరముఖ్య సుగ్రీవ వరద ॥నమో నమో॥





చారు లక్ష్మణ భరత శత్రుఘ్న పూర్వజ
తారక బ్రహ్మ నిత్యస్వరూప
ధీర శ్రీ వేంకటాధిప భక్తవత్సల
భూరిగుణ సాకేతపురనివాసా ॥నమో నమో॥

## భావామృతం

ఓ సర్వేశా! జగదేకపతీ! నీకు వందనములు చాల ప్రసిద్ధి చెందిన అసమానమైన కీర్తిగల స్వచ్ఛమైన శ్రీ రామచంద్రా! నీకు నమస్కారములు.

ఓ రామా! రఘువంశదీపకా! తెల్లని పద్మదళముల వంటి కన్నులుకలవాడా! భూపుత్రి సీతాపతీ! ముల్లోకములను గెలిచినవాడా!(త్రిభువన విజేత రావణాసురుని నిర్జించాడు కదా!) నల్లని సుకుమార శరీరాంగములు కలవాడా! రణరంగ విశారదా! భయము గొలుపు పరాక్రామము కలవాడా! సత్యము బిరుదై నిలిచిన మహానుభావా! నీకీర్తికి ఇవే నా వందనములు.

రాక్షసులను పీడించిన శ్రీ రామా! దుష్టశిక్షణకై ఎప్పుడూ కోదండమను ధనస్సును ధరించియే వుండెదనని ప్రతిజ్ఞ చేసిన సమర్ధుడా! రవి వంశజా! విభీషణుని రక్షించిన వాడా! దాశరధి అని విఖ్యాతి చెందిన కౌసల్యానందనా! వానరాధినాధుడు వాలిని తేలికగా నిర్జించి వానరముఖ్యుడయిన సుగ్రీవునకు వరముగా రాజ్యమిచ్చిన మహానుభావా! నీకు వందనములు

చక్కని లక్ష్మణ భరత శత్రుఘ్నులకు అన్నగారివైన రాఘవా! నీవు తారక బ్రహ్మవు. నిత్యస్వరూపుడవు. ధీరుడైన శ్రీ వేంకటేశ్వరుడవు నీవే. ఓ భక్త సంరక్షకా! వారిపై వాత్సల్యంతో కాపాడెదవు. గొప్పసుగుణభూషణా! సాకేతపురమున నెలకొనియుండు జగన్నాయకా! నీకు నా నమోవాకములు.

**1-80**

## మున్నుడి

ఐదు వందల ఏళ్ళక్రిందట మన దేశంలో అగ్రకులస్థులు, నిమ్నకులస్థులపై చూపిన వివక్ష, దాష్టీకము అన్నమాచార్యుల వారిని కదలించివేసి ఉంటాయి. ఆయన ఆ హీనకులజులపై నిరాదరణను ఖండించటమే కాక తూర్పారబట్టారు. దీక్షితులు అనిపించుకొని పదిమందికి మంచి చెప్పకుండా, హరి గురించి వినిపించకుండా మడి, దడి అంటే ఆ తిరుమల నాయకుడు మెచ్చడు. 'కాలేజీ డిగ్రీలు' కడుపునింపుతాయేమో కాని జన్మను సార్థకం చేయలేవు. వేదపఠనము, వేదాంత జ్ఞానము, తపోనిష్ఠ మనిషి అంతరంగ శుద్ధికి అవసరమే కాని మానవత్వం సత్ప్రవర్తన వాటి కంటే అత్యవసరం. అదిలేక జీవితం ఉప్పులేని పప్పు వంటిదే.

**ఉ॥ ఎక్కువదే కులంబుమరి హీనకులంబని లేదుచూడగా**
**నిక్కమెరుంగ జీవుడిక నిత్యుడు చావులు లేని వాడురా**
**చక్కని మాట అన్నమయ జానుతెనుంగున చెప్పినాడురా**
**మక్కువ దీర వేంకట రమా విభు గొల్చెనుసుద్దిజెప్పుచున్**

**రాగం : సామంతం**

ఎక్కువ కులజుడైన హీనకుజుడైన
నిక్కమెరిగన మహా నిత్యుడే ఘనుడు ॥ఎక్కువ ॥

వేదములు చదివియును విముఖుడై హరిభక్తి
యాదరించని సోమయాజి కంటే
యేదియును లేని కులహీనడైనను విష్ణు
పాదములు సేవించు భక్తుడే ఘనుడు ॥ఎక్కువ ॥

పరమగు వేదాంతపఠన దొరికియు సదా
హరి భక్తిలేని సన్యాసి కంటే
సరివి మాలిన యంత్య జాతికులజుడైన
నరసి విష్ణుని వెదకు నాతడే ఘనుడు ॥ఎక్కువ ॥



భావయామి వేంకటేశం

వినియు జదివియును శ్రీవిభుని దాసుడుగాక
తనువు వేపుచునుండు తపసికంటే
యెనలేని శ్రీవేంకటేశు ప్రసాదాన్న
మనుభవించిన యాతడప్పుడే ఘనుడు ॥ఎక్కువ ॥

## భావామృతం

మన సంఘంలో అగ్రకులజుడెవడు? హీనకులజుడు యెవడు? ఎవడైతేనేమి? నిజము తెలుసుకొంటే తను ఆత్మనని, వాడు (జీవాత్మ) నిత్యుడు అనీ చావు పుట్టుకలు వాడికి కర్మ అనుభవించుటకు పరమాత్మ కల్పించినవే కాని వాటితో వాడికి 'నిమిత్తం' లేదని తెలుసుకొన్నవాడు మాత్రమే ఘనుడు. ఏ కులం అయితేనేం.

హరిభక్తిపై ఇష్టములేని వాడు వేదము చదివితే ఏం లాభం? అటువంటి హరివిముఖుడైన సోమయాజి (యజ్ఞయాగములు చేసినవాడు) కంటె ఏమీలేని కులహీనడని పిలువబడే విష్ణుపాదదాసుడు, విష్ణుచిత్తుడు ఎంతయో శ్రేష్టుడు. ఇది సత్యం.

మోక్షమార్గం చూపే వేదాంతం నేర్చే సద్భాగ్యం కలిగికూడా వేదాంతసారమైన హరి భక్తి లేని పరివ్రాజకుని (సన్యాసి) కంటే, క్రమములో అంత్యజుడు అనిపించుకొన్న నిమ్నకులజుడు హరిభక్తి కలిగిన వాడైతే విష్ణుని ధ్యేయంగా వెదకునట్టివాడే గొప్పవాడు. ఇదే నిజము.

శ్రీపతి గూర్చి వినుటచేతనో చదువుట చేతనో తెలిసికొని స్వామి దాసునిగా జీవించాలి. అంతేగాని శరీరాన్ని శుష్కింపజేయు తపస్సుల వల్ల ప్రయోజనమేమిటి? శ్రీ వేంకటేశ్వరుని సందర్శించి ఆయన ప్రసాదం స్వీకరించు వాడు ఆ క్షణంలోనే శ్రేష్ఠుడవుతాడు. వాడే కులంవాడైనా, వాడే యోగ్యుడు.

**1-81**

## మున్నుడి

అన్నమాచార్యులవారి ఈ కీర్తన భగవన్నామ సంకీర్తన. సాధారణంగా ఇటువంటి కీర్తనలలో అన్నీ తెలిసిన మాటలే వుంటాయి. దీని భావామృతం చాలా తేలిక. అసలు అక్కరలేదు అనుకోవద్దు. "నెట్టిన గతి" అని ఒక మాట ఈ కీర్తనలో వుంది. అదేమిటో తెలుసుకోవాలంటే నిఘంటువు తెరవక తప్పలేదు నాకు. అందుకే.... దిగితే గాని లోతు తెలీదన్నారు పెద్దలు. ఇంతకీ ఈ కీర్తననెందుకు ఎన్నుకొన్నానంటే... అంతా ఆ శ్రీ హరే అని ప్రహ్లాదుడు చెప్పినదానినే ఇలా అమృతపు జల్లులా కురిపించారన్నమయ్య.

**కం॥ అంతయు నీవే నాకిక**
**చెంతను నీవుండుమంచు శ్రీనామంబుల్**
**ఎంతో సులువుగ ఆ శ్రీ**
**కాంతునకా అన్నమయ్య గానము జేసెన్.**

**రాగం : హిందోళం**

అంతయు నీవే హరి పుండరీకాక్ష
చెంతనాకు నీవే శ్రీ రఘురామా ॥అంతయు॥

కులమును నీవే గోవిందడా, నా-
కలిమియు నీవే కరుణానిధీ
తలపును నీవే ధరణీధరా, నా-
నెలవును నీవే నీరజనాభా ॥అంతయు॥

తనువును నీవే దామోదరా, నా-
మనికియు నీవే మధుసూదనా
వినికియు నీవే విఠలుడా, నా-
వెనుక ముందు నీవే విష్ణుదేవుడా ॥అంతయు॥





పుట్టుగు నీవే పురుషోత్తమా, కొన
నట్టనడుమ నీవే నారాయణా
యిట్టె శ్రీ వేంకటేశ్వరుడా నాకు
నెట్టన గతి ఇంక నీవే నీవే ॥అంతయు॥

## భావామృతం

ఓ శ్రీ హరీ! పుండరీకాక్షా (పద్మనయనా) నాకు అంతానీవే. ఇంకొకటి లేదు. రఘుకులసోమా! శ్రీ రామా! సదా నాసమీపంలో వుండేవాడవు నీవే తండ్రీ!

ఓ గోవిందా! నా కులం అంటూ వేరే ఏమీ లేదు అది నీవే. నా సంపద కూడ నీవే. భూరమణా! నా ఆలోచనకూడ నీవే. ఇక నాస్థానమంటూ ఏదన్నావుంటే ఓపద్మనాభా! అది నీవే ప్రభూ!

ఓ దామోదరా! నా శరీరం వేరెవ్వరిదీ కాదు అది నీస్వంతము. మధుసూదనా! నా జీవితం కూడ నీవే. విఠలదేవుడని కీర్తించబడే పాండురంగా నాలోని వినికిడి శక్తి వేరెవెరు? నీవే కదా! నీవు నాకు కనుపించనంత మాత్రాన నాకు నష్టమేముంది సదా నావెనుక ముందట వుండి నన్ను రక్షిస్తున్నది నీవే కదా! విష్ణుదేవా!

ఓ పురుషోత్తమా! నా పుట్టుక ఎలా సంభవించింది నాకు తెలియదా?నీ వల్లనే ప్రభూ! నారాయణుడు అని కీర్తించబడే నీవే చివరలలోను మధ్యలోను వున్నావు. (పుట్టుక నుండి చావు వరకు మాత్రమే కాక మధ్మ జీవితమంతా నీవలననే నడుచుచున్నది) ఓ శ్రీ వేంకటేశ్వరా! నాకు ఇట్టే (సులభసాధ్యుడవు) నీవే వున్నావు. తప్పనిసరియైన గతి ఇంకా నాకెవ్వరున్నారు తండ్రీ! నీవే.....నీవే.....నీవే.

**1-82**

## మున్నుడి

అన్నమాచార్యుల వారి ఘనత తెలియాలంటే ఈ చిన్న కీర్తన పరిశీలించండి. 'బంటు' అంటే సేవకుడు, భక్తుడు, శిష్యుడు అని నానార్థములున్నాయి. సేవచేసేవాడు, భక్తితో కొలిచేవాడు, యజమానిని గురువుగా భావించి చెప్పిన మాట వినేవాడు – అటువంటి వాడే బంటు. మన రామదూత హనుమంతుడు. ఈ కీర్తనలో ఆ బంటు లక్షణాలు చెబుతున్నారు.రాముడే వేంకటేశ్వరుడని, మారుతిని స్వామికి దాసునిగా కీర్తిస్తున్నారు. ఇంత చిన్న కీర్తనలో, ఆదిలోనే హంసపాదన్నట్లు మొదటిమాటకే అర్థం తెలియదు.....

**చం॥ అతిముతి బంటు యాతడని అంజనసూనుని తానుతించెరా**
**వెఱపను మాటనెంచడని వీనుల విందుగ అన్నమార్యుడున్**
**సిరిపతి వేంకటేశ్వరుని సేవతరించెడివాడనెన్, భళీ!**
**ఎఱుగము యిట్టి కీర్తనము నెవ్వడు పాడెధరాతలందునన్.**

**రాగం : శ్యామ**

అతిముతి హనుమంతుడట్టి బంటు
వెఱపులేని రఘువీరునికి బంటు ॥అతిముతి॥

యేలికను దైవముగా నెంచి కాల్చేవాడే బంటు
తాలిమి గలిగిన యాతడే బంటు
పాలుమాలకయే పొద్దుపని సేయువాడే బంటు
వేళగాచుక వుండేటి వెరవరే బంటు ॥అతి ముతి॥

చెప్పినట్టనే నడచిన యాతడే బంటు
తప్పులేక హితుడై నాతడే బంటు
మెప్పించుక విశ్వాసాన మెలగు వాడే బంటు
యెప్పుడును ద్రోహిగాని హితుడే బంటు ॥అతి ముతి॥





కాని పనులకు లోనుగాని వాడే బంటు
ఆనాజ్ఞ మీరని యాతడే బంటు
నానాగతి శ్రీ వేంకటోన్నతుడైన యతనికి
తానిన్నిటా దాసుడైన ధన్యుడే బంటు ॥అతి ముతి॥

## భావామృతం

సంభ్రమము కలిగించు ఈ హనుమంతుడు అటువంటి వాడని బంటు అంటే ఈయనే అని, భయమను మాటనెరుగని రాఘవునికి నమ్మిన బంటు ఈ స్వామి, అని తెలుసుకోండి.

ఇక ఈ బంటు యొక్క లక్షణములను వినండి. ఇతడు తనయజయానిని దైవంగా భావించి కొలిచే స్వభావం కల బంటు. ఎంతో ధైర్యం కలిగిన వాడీ బంటు. ఏ మాత్రం సోమరితనం లేక ఏ వేళనైనా తన యజమానిని సేవించువాడే ఈ బంటు. అన్ని సమయాలలోను తగిన ఉపాయముతో సిద్ధముగావుండే వాడే ఈ బంటు.

తు.చ తప్పకుండా చెప్పినట్లు నడుచుకొనేవాడు ఈ బంటు. ఏవిధమైన తప్పిదముచేయక హితము చేసేవాడే ఈ బంటు. గొప్పవిశ్వాసమునకు మారు పేరన్నట్లుగా యజమానిని మెప్పించుచు మెలగువాడే బంటు. ఏనాడూ ద్రోహం చేయక మేలు చేసేవాడే బంటు అని పిలువదగ్గవాడు.

లోభానికి లొంగి ఏనాడూ తగని పనులు చేయనివాడే నమ్మిన బంటు అంటే ఆనపెట్టినట్లు ఉత్తరువులను అమలుపరచువాడే సరియైన బంటు. పలు విధములుగా (పైన చెప్పినట్లు) శ్రీ వేంకటేశ్వరుడైన స్వామికి తాను అన్నివిధములుగా దాసుడైన బంటు ఈమహానుభావుడు శ్రీ ఆంజనేయుడు.

**1-83**

## మున్నుడి

వేదములలో దేవతల ప్రీతి కోసం చేసే యజ్ఞకాండ అంతా వివరించబడినది. యాగశాలలో జంతు బలినొసగుట, సామవేదమును గానముచేయుట, సోమపానము చేయుట, ప్రసాదముగా హుతశేషము(పురోడాశము) స్వీకరించుట కుండలధారణ, ఇత్యాది కర్మలెన్ని చేసినా, తత్ఫలితంగా తనువు చాలించాక స్వర్గము జేరి ఎన్నాళ్ళు ఎన్ని సుఖాలను అనుభవించినా... ఆ పుణ్యం తరిగిపోకా తప్పదు, మళ్ళీ భూమిపై జన్మించకాతప్పదు. కాబట్టి ఆ యజ్ఞాల కంటే జ్ఞానయజ్ఞంతో తిరుమలేశుని సేవిస్తే ఆయన స్వయంగా ప్రత్యక్షమై మోక్షమే ఇస్తాడు కదా! ఈ గోల అంతా దేనికి? అంటున్నారు అన్నమాచార్యులవారు. వినండి...

**చం॥ శృతులు ఘనంబుగా క్రతువుసేసెడి వైనము లెన్నిసెప్పియున్**
**హితములు స్వల్పమే, కడకు యేమగు జన్మము తప్పదాయెరా**
**మతిచెడు కర్మకాండ ఘనమా? యనెనీకృతి నన్నమార్యుడున్**
**గతియని వేంకటేశ్వరుని కాలికి మ్రొక్కుడు"జ్ఞానయజ్ఞమౌ"**

**రాగం : ధన్యాసి**

జ్ఞానయజ్ఞ మీగతి మోక్ష సాధనము
నానార్ధములు నిన్నే- నడపె మాగురుడు ॥జ్ఞానయజ్ఞ॥

అలరి దేహమనేటి-యాగశాలలోన
బలమై యజ్ఞానపు-పశువు బంధించి
కలసి వైరాగ్యపు-కత్తుల గోసికోసి
వెలయ జ్ఞానాగ్నిలో-వేలిచెమా గురుడు ॥జ్ఞానయజ్ఞ॥

మొక్కుచు వైష్ణవులనే-మునిసభ గూడ పెట్టి
చొక్కుచు శ్రీ పాదతీర్ధ-సామపానము నించి
చక్కగా సంకీర్తన-సామగానము చేసి
యిక్కువతో యజ్ఞముసే-యించెబో మా గురుడు ॥జ్ఞానయజ్ఞ॥





తదీయ గురుప్రసాద-పురోడాశ మిచ్చి
కొదదీర ద్వయమను-కుండలంబులు వెట్టి
యెదలో శ్రీ వేంకటేశు-నిటు ప్రత్యక్షము చేసె
ఇదివో స్వరూప దీక్ష-యిచ్చెను మాగురుడు ॥జ్ఞానయజ్ఞ॥

## భావామృతం

జ్ఞానయజ్ఞమే బహుసులభమైన మోక్షసాధనమని నిన్ననే మా ఆచార్యులు మాకు చెప్పిమాచే నిర్వహింపజేసినారు. ఆ దీక్షావివరములన్నీ మాకు వారు సెలవిచ్చియున్నారు.

'శరీరము' అనే ఈ యజ్ఞశాలలో, బలమైన 'అజ్ఞానం' అనే పశువును తీసికొనివచ్చి బంధించి,' వైరాగ్యం' అనే కత్తితో దానిని ఖండించి, జ్ఞానము అనే అగ్నిలో మా గురువు గారు దానిని వేల్చినారు.

తదుపరి నమస్కారము వంటి ఉపచారములను గావించుచు పరమభాగవతులైన వైష్ణవులు అనే మునుల సభలో నన్ను జేర్చిరి. పిదప సంతోషముతో మా అందరికీ ' శ్రీపాద తీర్ధము' అను 'సోమపానము' సంకీర్తన అనే సామవేదగానమును వినిపించిరి. ఆ విధానమున గురువులు మాచే యజ్ఞమును చేయించినారు.

అటుపిమ్మట మాగురువు గారు ఆయనకు సంబంధించిన పురోడాశము ('హుతశేషము') గురుప్రసాద రూపమున నొసగిరి. కొఱతలేనట్లుగా 'ద్వయము' అను కుండలములను మాకు పెట్టారు.

(శ్రీ మన్నారాయణ చరణౌశరణం ప్రపద్యే, శ్రీ మతే నారాయణా నమః అను ఈ రెండు మంత్రములే నిజమైన కుండలములు) ఆ విధముగా మా ఆచార్యులు మా హృదయముతో శ్రీ వేంకటేశ్వరుని ప్రత్యక్షము సేయించినారు. ఆ విధముగా ఆయన మాకు 'స్వరూపదీక్షను' ఇచ్చారు.

**1-84**

## మున్నుడి

చిన్నారి పాపాయి కళ్ళు మూసి 'దోబూచి' అంటూ మూసిన చేతులు తీసేస్తే పాపాయి కిలకిలా నవ్వుతుంది. అదిచూచి 'అమ్మ' పరమశించి పోతుంది. చిన్నారి బాలకృష్ణునితో దోబూచిలాడిన గోపెమ్మల భాగ్యవేమని వర్ణించగలం? అన్నమాచార్యుల వారు ఆ 'దొరదొంగ' ని 'తొల్లిటి దొంగ' అంటారు. ఏడుకొండల వాడిని 'దుండగీడు' అనే దమ్ము సాక్షాత్తు ఆ 'నందకాంశజు'నికి గాక అన్యులకు సాధ్యమా? కీర్తన అంతా నిందలాగే కనపడే పొగడ్త.

**ఆ.వె॥తులన సేయగలమె!! "దోబూచు" లాడుచు**
**హరిని గొల్చు భాగ్యమన్నమయ్య**
**కబ్బె, యేమి చెబుదు? ఆయన బోలిన**
**వేంకటేశు దాసులింక లేరు.**

**రాగం : ధన్యాసి**

బండి విరిచి పిన్న పాపలతో నాడి
దుండగీడు వచ్చె దోబూచి ॥బండి విరిచి॥

పెరుగు వెన్నలు ప్రియమున వే-
మరుముచ్చిలించు మాయకాడు
వెరువున దన విధము దాచుకిని
దొరదొంగ వచ్చె దోబూచి ॥బండి విరిచి॥

పడుచు గుబ్బెత పరపుపై పోక-
ముడి కొంగు నిద్ర ముంపునను
పడియుతా (?) వద్ద పవళించి నట్టి
తొడుకుదొంగ వచ్చె దోబూచి ॥బండి విరిచి॥





గొల్లపల్లెలో ఇల్లిల్లూ చొచ్చి
కొల్లలాడిన కోడెగాడు
యెల్లయినా వేంకటేశుడు ఇదె
తొల్లిటి దొంగ వచ్చె దోబూచి ॥బండి విరిచి॥

## భావామృతం

(దుండ గీడు అంటే దుష్టుడు. అంటే 'కీడు' చేసే వాడు అని అర్థం. ఆదిదేవుణ్ణి అంతటి మాట ఎందుకంటున్నారు అన్నమయ్య? గోపెమ్మల్లాగా, మనబోటి సామాన్యుల్లాగా ఆలోచించే వారికి స్వామి లీల అర్థమవుతుందా? ఆయన ఎవ్వరికీ కీడు చేయడు.మన కర్మఫలమే మనకిచ్చినా, అది మన కంటికి కీడులాగే కనిపిస్తుంది. అదే మాయ. ఆ మాయగాణ్ణి దొంగ అంటున్నారు అంతా.... నిజానికి దొంగలెవరు?)

బండి విరిచి పిల్ల పాపలతో ఏవేవో దొంగాటలాడే దుండగీడు వస్తున్నాడు. జాగ్రత్త దోబూచి. (దోంగ భూతం) వస్తాడు.

అతి ఇష్టంగా పెరుగు వెన్నలను మాటిమాటికీ దొంగతనం చేసే మాయలమారివాడు ఈ కుర్రవాడు. ఉపాయంతో తన విధానమేమియో తెలియనీయని ఈ దొరదొంగ (దొంగవలె భ్రమింపచేసే సర్వేశుడు) వచ్చాడు. జాగ్రత్త దోబూచి.

చక్కటి స్తనములున్న (గుబ్బెత) పడుచుపిల్ల పరుపు మీద నిద్ర పోతుంటే చీరముడి ఊడతీసి ఆమె ప్రక్కనే పడుకొన్న దొంగవచ్చాడు, తొడుకు (ఒడిసి పట్టుకొండి). జాగ్రత్త. దోబూచి.

రేపల్లెలో ప్రతి ఇంటిలోను దూరి, ఆ ఇంట్లో వెన్నలను కన్నెలను కొల్లగొట్టిన వాడే ఈ కోడెవయసు కుర్రవాడు. వీడు అన్నీ తానే అయిన శ్రీ వేంకటేశ్వరుడే. ఇదిగో ఈయన అనాదిగా భక్తుల హృదయాలను దొంగతనం చేస్తున్న పెద్ద దొంగ. జాగ్రత్త!! దోబూచి వస్తున్నాడు. బాబోయ్. జాగ్రత్త!

## 1-85

### మున్నుడి

అన్నమాచార్యుల వారు తెలుగుతల్లులకు పెట్టిన మేటి ప్రసాదం ఈ కీర్తన. ఎంత మంది అమ్మలు ఈ పాట తమ పాపాయికి పాడారో చెప్పటం సాధ్యమా? తరచి చూస్తే చిన్నారుల కోసం పాడే పాటల్లో కూడ శ్రీ నివాసుని కీర్తించటం అద్భుతం కదా! దీని భావామృతంలో జాబిల్లి అని చందమామని ఎందుకంటారో వివరించాను. చాల మాటలను మనం అర్థం తెలియకుండానే పర్యాయపదాలుగా వాడేస్తాం, అని నాకు జాబిల్లికి వివరణ ఇస్తున్నప్పుడు తట్టింది.

పాపాయి పాటలో కూడా పరమాత్మ అవతార విశేషములను వర్ణించుట అన్నమయ్య నేర్పు.

**కం॥ జాబిల్లి బిలుతు రమ్మలు**
**"మాబాబుకు పాలు కుడుప పరుగున రావో"**
**సోబనపు వేంకటేశుడు**
**ఈ బాబుని అన్నమయ్య ఇచ్చిన "ఫలమే".**

**రాగం : చక్రవాకం**

చందమామ రావో జాబిల్లి రావో మంచి
కుందనపు పైడికోర వెన్నపాలు తేవో ॥చందమామ॥

నగుమోము చక్కనయ్యకు నలువపుట్టించిన తండ్రికి
నిగమములందుండే అప్పకు మా నీలవర్ణునికి
జగమెల్ల ఏలిన స్వామికి చక్కని ఇందిర మగనకి
ముగురికి మొదలైన ఘనునికి మాముద్దుల మురారి బాలునికి॥చందమామ॥

తెలిదమ్మి కన్నుల మేటికి మంచి తియ్యని మాటల గుమ్మకు
కలికి చేతలకోడెకు మా కతలకారి ఈ బిడ్డకు
కులముద్ధరించిన పట్టెకు మంచి గుణములు కలిగిన కోడెకు
నిలువెల్ల నిండవొయ్యారికి నవనిధుల చూపుల చూచే సుగుణునకు ॥చందమామ॥





సురుల గాచిన దేవరకు చుంచు గరుడు నెక్కిన గబ్బికి
నెరవాది బుద్ధుల పెద్దకు మానీటు చేతల పట్టికి
విరుల వింటి వాని అయ్యకు వేవేల రూపుల స్వామికి
సిరిమించు నెరవాది జాణకు మా శ్రీ వేంకటనాధునికి ॥చందమామ॥

### భావామృతం

ఓ చందమామా! ఇటు వైపుకు ఒక్కసారిరా. చల్లటి జాబిల్లీ (జాను+బిల్లి=జాబిల్లి, అనగా అందమైన పిల్లి, అనగా కుందేలు అంటే... కుందేలు తనలో ఉన్నవాడు, అనగా చంద్రుడు) ఇటు రారాదా! పదియారు వెన్నపూర్తిగా తీయని పాలను మా బాబుకు తీసికొని రారాదా.

మా బాలుడు నవ్వుకవలొలికే ముఖమున్న చక్కనయ్య. బ్రహ్మదేవునికి జన్మనిచ్చిన తండ్రి. వేదములన్నింటిలో కీర్తించబడిన జనకుడు. నీలమేఘచ్ఛాయ గల శరీరం దాల్చిన వాడు జగన్నాథుడు. అందాల బొమ్మ లక్ష్మీదేవికి ప్రియమైన మగడు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు అని పిలవబడే ముగ్గురు దేవుళ్ళకు అది దేవుడు. ఇతడే ముద్దులు మూటగట్టే మా మురారి.

సర్వశ్రేష్ఠుడైన వీడు తెల్లని పద్మముల వంటి కన్నులు గలవాడు. మధురమైన మంచి మాటలు మాట్లడే అలంకార ప్రియుడు. ఒయ్యారము లొలుకు మనోజ్ఞమైన చేతలు గల శృంగారమూర్తి (మోహినీదేవి). లెక్కకు మించిన కథలు (పురాణములు) పుట్టుటకు కారణ భూతడైన. వామన మూర్తి. ఆదిత్యకులమును వుద్ధరించిన గుణవంతుడైన బిడ్డ ఈ బాలుడే (రాముడు). ఈ అబ్బాయి సుగుణాలప్రోవు. నవనిధులను ప్రసాదించు వాడు.

ఈ దేవుడే దేవతలందరినీ రక్షించిన వేలుపు. తెల్లటి గరుత్మంతుని అధిరోహించి ఠీవిగానుండే వాడితడే. యుక్తమైన బుద్ధులు గల పెద్దమనిషి కూడ ఇతగాడే. ఇతను చేసే పనులన్నీ తీర్తినట్లుంటాయి. ఈయనెవరనుకున్నారు? స్వయాన మన్మధునికి జన్మనిచ్చినవాడు. అంతేకాదు అనంతమైన (వేలకొద్దీ) రూపములు గలవాడు. ఇదిగో ఈ మా శ్రీ వేంకటేశ్వరుడు అధికముగా ఐశ్వర్యములను ప్రసాదించు జాణ (నేర్పరి).

## 1-86

### మున్నుడి

శ్రీ మన్నారాయణుని పాదము యొక్క వైభవమును వర్ణిస్తున్నారన్నమయ్య. అతిసరళంగా కనిపించే ఈ అద్భుత కీర్తనలో కూడ 'పామిడి తురగము' ఏమిటో అర్ధంకాలేదు, బాగా ఆలోచించాలి. ఏదో ఒకమెలిక ఉండక తప్పదు అన్నమయ్య కీర్తనలో. మరి అందుకే భావామృతం చదవాలి. తప్పదు...

**సీ॥ ఆ పాదమును బ్రహ్మ అతి భక్తి కడిగెను**
**ఆ పాదమే 'బ్రహ్మ' మాయె తాను**
**ఆ పాదమే గొల్చెనతివయై అవనియు**
**ఆ పాదమును మొక్కి రఖిల సురులు**
**ఆ పాదము జగాలనన్నింటి గొలిచెను**
**ఆ పాదమే 'బలి' నణగ ద్రొక్కె**
**ఆ పాదమే కాచెనా అహల్యను నాడు**
**ఆ పాదముద్రలే 'అహి' తలందు**

**తే॥ ప్రేమతో రమాదేవియే పిసుకు పదము**
**పరమయోగులు గొలుతురు పలు విధముల**
**తిరుమలేశ! నీ పదమదే దివ్యపథము**
**అన్నమయ్య నుతించిన యట్టి పదము**

**రాగం : ముఖారి**

బ్రహ్మ కడిగిన పాదము
బ్రహ్మము తానె నీపాదము ॥బ్రహ్మ కడిగిన॥

చెలగి వసుధ కొలిచిన నీ పాదము
బలితల మోపిన పాదము
తలకక గగనము తన్నిన పాదము
బలరిపుగాచాన పాదము ॥బ్రహ్మ కడిగిన॥





కామిని పాపము కడిగిన పాదము
పాము తలనిడిన పాదము
ప్రేమపు శ్రీసతి పిసికెడి పాదము
పామిడి తురగపు పాదము ॥బ్రహ్మ కడిగిన॥

పరమయోగులకు పరిపరి విధముల
పరమొసగెడి నీ పాదము
తిరువేంకటగిరి తిరమని చూపిన
పరమపదము నీ పాదము ॥బ్రహ్మ కడిగిన॥

### భావామృతం

శ్రీ వేంకటేశ్వరా! నీ పాదము యొక్క మహాత్యం ఎటువంటిదో చెబుతాను విను ప్రభూ! బ్రహ్మదేవుడు నీవు త్రివిక్రముడవై ఒక పాదంతో సమస్త అవనిని దాని అధోలోకాలతో సహా ఆక్రమించి, ఇంకొక పాదంతో భువనాల నన్నింటినీ ఆక్రమించినప్పుడు బ్రహ్మ ఆకాశగంగతో గంగాజనకుడవైన నీపాదమును కడిగాడు. అటువంటి దివ్య పాదము నీది. ఆ నీ పాదమే బ్రహ్మము.

శ్వేతవరాహమూర్తివై హిరణ్యాక్షుని బారి నుంచి రక్షించినప్పుడు భూదేవి కొలిచినది నీ పాదమునే. బలి మహాప్రభో! మూడవ 'అడుగు' నానెత్తిమీద పెట్టుఅన్నప్పుడు విజృంభించి ఆ తలమీదపెట్టిన పాదము నీ పాదమే. బలవంతుడైన శత్రువునంతమొందించక కాచి (ప్రహ్లాదుని అనుగ్రహించుటకు ) రక్షించిన పాదమునీది.

శ్రీరామావతారంలో అహల్యను పునర్జీవితురాలిని చేసినది, ఆమె పాపములను కడిగివేసినది నీపాదమే.

శ్రీకృష్ణావతారంలో కాళింగుని తలలను త్రొక్కినది కూడ నీపాదమే. ఆ పాదమునే లక్ష్మీదేవి ప్రేమ కలిగినదై పిసుకుతున్నది. అదే హయగ్రీవుడవైన నీ అద్భుత పాదము.

పరమ యోగులందరూ నిన్ను శరణని నీ అనుగ్రహం కోరితే వారు దేనికర్హులో నిర్ణయించి ఎవరికేది ఇవ్వాలో ఆ 'ముక్తి' వారి కొసగునది నీపాదమే. పవిత్రమైన వేంకటాచలమొక్కటే స్థిరమైనది అని చూపినది నీపాదమే. స్వామీ! అట్టి ఈ పాదమే మోక్షమంటే. ఇంకొకటి వేరుగా నున్నదా?

**1-87**

## మున్నుడి

అలమేలు మంగమ్మ విలాసమును, వైభవమును వర్ణించి స్వామికి చెబుతున్నారన్నమయ్య. సరస శృంగార కీర్తనలనెన్నో పాడిన అన్నమయ్య ఇందులో ఆ దేవి సౌందర్యాన్ని వర్ణిస్తున్నారు. వన్నెలకుంకుమ వసంతమాడిందట ఆ దేవి స్వామితో. మన్మథుని రథమున హంసలను నిలిపిందిట. ఆచార్యులవారి పదచాతుర్యాన్ని ఏమని పొగడను? నా అదృష్టం కొద్దీ అన్నమయ్య కవితా సొబగులను మీకు అందించే చిరు ప్రయత్నం చేస్తున్నాను. పదవవంతు ఫలితం దక్కినా అది నా భాగ్యమే.

**చం॥ ఒకపరి చూడవయ్య విరిబోడిని యీ అలమేలు మంగనో**
**సకల గుణాభిరామ! హరి! జాణవు వేంకటశైలనాయకా!**
**వికసిత పద్మనేత్ర! కనువిందుగ యీలలితాంగి వన్నెలన్**
**ఇకనెరిగింప నాకవునెయెంచగ నన్నయ? పాడి చూడరో**

**రాగం : నాటకురంజి**

చూడవయ్య నీ సుదతి విలాసము
వేడుక కాడవు విభుడవు నీవు ॥చూడవయ్య॥

పున్నమి వెన్నెల పోగులు పోసి
సన్నపు నవ్వుల జవరాలు
వన్నెల కుంకుమ వసంతమాడీ
ఇన్నిటా కళలతో ఈ మెరుగుబోడి ॥చూడవయ్య॥

పాటించి తుమ్మెద పౌజులు దీర్చీ
కాటుక కన్నుల కలికి యిదే
సూటి జక్కువల జోడలరించీ
నాటకపు గతుల నాభిసరసి ॥చూడవయ్య॥





అంగజు రథమున హంసలు నిలిపి
కంగులేని ఘన గజగమన
ఇంగితపు శ్రీవేంకటేశ నిన్నెనసె
పంగెన సురతపు పల్లవాధరి ॥చూడవయ్య॥

## భావామృతం

ఓ వేంకటేశ్వరా! నీముద్దుగుమ్మ, అలమేలు మంగమ్మ విలాసము (ప్రియ సందర్శనా పారవశ్యము), ఒక్కసారి చూడవయ్యా! నీవేమో విలాసపురుషుడవు. ఆపైన తాళికట్టిన భర్తవు. (నీకే కదా! ఆ సొగసులన్నీ).

ఆమె ఎటువంటి ప్రియురాలను కొన్నావు? పౌర్ణమినాటి వెన్నెలను కుప్పగా పోసినంత చల్లగా, చిరునవ్వులొలికించే ప్రియురాలామె. రంగురంగుల గులాలు చల్లి నీతో వసంతోత్సవంలో పాలుపంచుకొన్నదామె. మెరుస్తున్న దేహంకల ఆమె అన్నికళలతోనూ నిన్ను అలరించినది.

ఆమె ముంగురులు సరియైన పద్ధతిలో నిలిచిన తుమ్మెదల వరుసలలాగ వున్నవి. ఈమె కాటుక దిద్దిన కన్నులుగల భామిని. తిన్నని చక్రవాకములవంటి వక్షోజముల జంటగల సుందరాంగి. పద్మమువంటి నాభిగల ఈమె నాట్యగతులను తిలకించు ప్రభూ.

మన్మథుని రథముపై నుండే హంసలను ఈమె స్వయంగా నెలకొల్పినదేమో. ఏమాత్రం బెదురులేని గజరాజు యొక్క నడక కలిగియున్నది ఈదేవి. వివేకవంతుడవైె తిరుమలనాథా! లేచిగురుటధరములు గల ఆ దేవి, పంగెన (ఏనుగును మోసంతో బంధించు గడ్డి కప్పిన పెద్దగొయ్యి) వంటి సురతిని తేల్చెడి జాణ.

**1-88**

## మున్నుడి

శ్రీవేంకటేశ్వరుని చేతిలోని సుదర్శన చక్రమును సంకీర్తిస్తున్నారు అన్నమాచార్యులవారు. మన కలియుగంలో స్వామికి దానితో పెద్ద పనితగలటంలేదు. ఎందుకంటే మనం పుణ్యం అనే మాట నెరుగని పాపులం. ఆ రోజుల్లో శాపవశాన హరికి దూరమై, తిరిగి ఆయన కరుణతో పరపరా తలలు నరికించుకొని హరిని మరల చేరుకున్నారు. మనలాంటి వాళ్లకి దారిలో తిరిగే 'లారీ' చక్రాలే దారి. ఎరిగి ఎరిగి నేరాలు చేసే వారికి హరికృప నెరుగతరమే!! మరి... సుదర్శనచక్ర వైభవాన్ని అన్నమయ్య సంకీర్తనలో వినండి తరించండి. ఇవ్వాళ నేనేం 'రాసినా' 'ర' కారమే వస్తోంది.

**కం॥ వరమది హరి శరణందిన**
**అఱిముఱి తిరురమణు కరపు అరిభీకరమై**
**పరపర తరుగును శిరముల**
**సరినెరుగని అన్నమయ్య చక్రము బొగిడెన్**

**రాగం : నాట**

చక్రమా హరి చక్రమా
వక్రమైన దానవుల వక్కలించవో ॥చక్రమా॥

చుట్టి చుట్టి పాతాళము చొచ్చి హిరణ్యాక్షుని
చట్టలు చీరిన ఓ చక్రమా
పట్టిన శ్రీహరిచేత పాయక ఈ జగములు
ఒట్టుకొని కావగదవో ఓ చక్రమా ॥చక్రమా॥

పానుకొని దనుజుల బలుకిరీట మణుల
సానలు తీరిన ఓ చక్రమా
నానా జీవముల ప్రాణములు గాచి ధర్మ
మూని నిలుపగదవో ఓ చక్రమా ॥చక్రమా॥





వెరచి బ్రహ్మాదులు వేదమంత్రముల నీ
వరుటుకొనియాడే రో చక్రమా
అఱిముఱి తిరువేంకటాద్రీశు వీధుల
ఒరపుల మెరయుదువో ఓ చక్రమా ॥చక్రమా॥

**భావామృతం**

ఓ సుదర్శన చక్రమా! హరిహస్త భూషణమైన పరాక్ర విక్రమా! వక్రబుద్ధిగల రాక్షసులపై తిరుగుబడి సంహరించుము. చక్రమా! ఓ చక్రమా! (నిన్ను కీర్తించెదను)

గిరగిర తిరుగుచు పాతాళలోకమున చొరబడి హిరణ్యాక్షుడు అను రాక్షసుని "చుట్టలు తీరిచి" (చంపి) వేసిన చక్రమా! శ్రీహరి తన హస్తమున నిన్ను ధరించగా ప్రతిజ్ఞపూనినట్లు వదలక జగములనెల్ల రక్షించుచున్న సుదర్శనమా! (నీకు సాటిలేరు).

పూనుకొని (ఆరోజులో 'పానుకొని' అనే వారేమో) అసురుల అసంఖ్యాకమైన కిరీటములలోని మణులను సానబట్టిన (సానలు తీరిన) ఓ చక్రమా! అనేకములైన జీవులను (గజేంద్రుని నుంచి అంబరీషుని వరకు) ప్రాణములను కాపాడి ధర్మమును నిలబెట్టినావు గదా! (విష్ణుభక్తుడైన అంబరీషునిపై కోపించి దుర్వాస మహాముని ఒక భూతాన్ని పంపించాడు సంహరించమని భీతిల్లిన అంబరీషుడు శ్రీహరిని శరణు వేడాడు. తన భక్తుని రక్షించుటకు శ్రీహరి తన సుదర్శన చక్రం ప్రయోగించాడు. అది భూతాన్ని క్షణంలో సంహరించి దుర్వాసుని వెంటబడింది. దానినుంచి మునిని రక్షించటం తమవల్ల కాదన్నారు. హరుడు బ్రహ్మాది దేవతలు. శ్రీహరికూడా తనపని నెరవేరే దాకా సుదర్శనాన్ని ఆపలేనని అంబరీషునే శరణు వేడమన్నాడు. అంబరీషుడు ప్రార్థిస్తే అప్పుడు శాంతించింది సుదర్శనం. అది అంతగొప్పది)

ఆనాడు భీతిల్లిన బ్రహ్మాది దేవతలు వేదమంత్రాలతో నీ వురట్లు (గొప్పతనం) కొనియాడారు కదా! ఓ చక్రమా సంభ్రమము కలుగునట్లు తిరుమలనాధుని హస్తభూషణమై ప్రతాపముతో బహిర్గతమై మెరిసిపోతున్న సుదర్శనమా! (మమ్ము రక్షింపుము)

**1-89**

## మున్నుడి

అన్నమాచార్యులవారు కలశాపురం సందర్శించిన తరుణంలో అక్కడ వెలసిన హనుమంతుని కీర్తిస్తూ చెప్పిన మనోజ్ఞమైన కీర్తన ఇది. మనకళ్ల యెదుట ఆ వాయునందనుడు రాక్షసుల్ని సంహరించినట్లు, ఆకాశమంత ఎత్తు పెరిగి సూర్యభగవానునివద్ద వేదం నేర్చుకొంటున్నట్లు, సువర్ణ సదృశరూపంతో కవచకుండల ధారియై వేంకటేశ్వరుడే తన రాముడనే భావనతో ఆయన బంటువలె నిలిచినట్లు అనిపించే ఈ కీర్తనలో 'సుతువద్ద' స్వామి వేదాలు నేర్చినట్లున్నది. రాగిరేకుల వ్రాతల్లో తేడాయేమో?

**ఉ॥ మేను పదారు వన్నెగల మేలిమిదై కలశాపురంబులో**
**పూనివసించు యీ హనుమపూర్వగిరీశుని మేటి శిష్యునిన్**
**దానవ వైరినిన్ కదు ముదంబున అన్నయకీర్తనంబుతో**
**తానిక వేంకటేశ్వరుని దాసునిగా తలపోసి కొల్చెరా**

**రాగం : వరాళి**

పదియారు వన్నెల బంగారు కాంతుల తోడ
పొదలిన కలశాపుర హనుమంతుడు ॥పదియారు॥

ఎడమచేతబట్టె నిదివో పండ్లగొాల
కుడిచేత రాకాసి గుంపుల గొట్టె
తొడిబడ నూరుపులతో తూరుపుమొగమైనాడు
పొడవైన కలశాపురి హనుమంతుడు ॥పదియారు॥

తొక్కె అక్షకుమారుని తుంచి యడగాళ్ళ సంది
నిక్కించెను తోక ఎత్తినింగిమోవను
చుక్కలు మోవపెరిగి సుతు(సూర్యు) వద్ద వేదాలు
పుక్కిట బెట్టె కలశాపురి హనుమంతుడు ॥పదియారు॥





గట్టి దివ్యాంబరముతో కవచకుండలాలతో
పట్టపు శ్రీవేంకటేశు బంటు తానాయె
అట్టెవాయువునకు అంజనిదేవికిని
పుట్టినాడు కలశాపుర హనుమంతుడు ॥పదియారు॥

## భావామృతం

ఈ ఆంజనేయుని శరీర ఛాయ పదియారు వన్నెల పుత్తడిది. కాంతులు వెదజల్లుతున్నది. ఈయన కలశాపురంలో వర్ధిల్లుతున్నాడు.

వాడియైన పండ్లున్న 'పండ్లగోల' అను ఆయుధమును తన ఎడమచేతితో పట్టుకొని, కుడిచేతితో రాక్షసుల గుంపును కొట్టి సంహరించుచున్నాడు. వేగముగా చలియించే ఉచ్ఛ్వాశ నిశ్వాసములతో తూర్పువైపున తనమొఖమును జూపుచున్న ఈ కలశాపురి హనుమంతుడు ఎంతో పొడగిరియైనవాడు.

రావణాసురుని కుమారుడైన అక్షకుమారుని లంకలో తన కాళ్లతో తొక్కి, ఎడమగా జేసిన కాళ్లసందున ఇరికించి సంహరిస్తూ చూ తన తోకను బిర్రుగా జేసి ఆకాశమువైపు ఎత్తి నిలబెట్టినాడు. నక్షత్రములను తాకునంత ఎత్తు పెరిగి సూర్యుని వద్ద వేదాలు పుక్కిట బెట్టి (నోటిద్వారా విన్నది విన్నట్లుగానే గ్రహించి) వెనువెంటనే నేర్చేసుకొన్నాడీ కలశాపురి హనుమంతుడు.

దివ్య వస్త్రాలంకార భూషితుడై కవచ కుండలధారియై గొప్పగా ఈ పవనసుతుడు శ్రీవేంకటేశ్వరుని పట్టపు బంటువలె అయి యున్నాడు. అట్లే ఈ కలశాపురీశుడైన హనుమంతుడు వాయుదేవునికి, అంజనాదేవికి జన్మించిన ముద్దుల కుమారుడు.

**1-90**

## మున్నుడి

వైరాగ్యం తారాస్థాయిని చేరినప్పుడు పరమాత్మునికి 'శరణు' అన్నవారి నోటివెంట వచ్చే ఆవేదననే అన్నమయ్య అద్భుతమైన కీర్తన రూపంలో ఆలపిస్తున్నారు. రకరకములైన బంధములలో కట్టివేసి బ్రతికున్నంతకాలమూ నాది, నాది, నావాళ్లు అంటూ ఒకే యావతో ఈ సంసార సాగరంలో కొట్టుమిట్టాడుతూ మనిషి రోజుకి ఒక్క సారన్నా మనస్ఫూర్తిగా "నారాయణా! నన్ను రక్షించు" అనడు. అనలేడు. ఎన్ని చీకాకులు కలిగినా వాటికేవో తాత్కాలిక పరిష్కారాలకోసం చూస్తాడేకాని మధ్యలో వచ్చినవారు మధ్యలోనే పోతారని శాశ్వతుడు శ్రీవేంకటేశ్వరుడు మాత్రమేనని గ్రహించలేడు. అదే స్వామి మాయ...

**చం॥ వినుతిని జేసె వేదములు విష్ణుడవంచు గిరీంద్రధారి నిన్**
**వినుము మదీయ ప్రార్థనలు వేదన సల్పెడి కర్మబంధముల్**
**దునిమి విరాగి జేయుమిక తోయజనాభుడ! వేంకటేశ్వరా!**
**గొనకొని అన్నమయ్య హరిగొల్చెను అద్భుత కీర్తనంబుతో**

**రాగం : హిందోళ**

నిగమ నిగమాంతవర్ణిత మనోహర రూప
నగరాజ ధరుడా శ్రీనారాయణా ॥నిగమ॥

దీపించు వైరాగ్య దివ్యసౌఖ్యంబియ్య
నోపక కదా నన్ను నొడబరపుచు
పైపైనె సంసార బంధముల కట్టేవు
నా పలుకు చెల్లునా నారాయణా ॥నిగమ॥

చీకాకు పడిన నాచిత్తశాంతము సేయ
లేకకా నీవు బహులీల నన్ను
కాకు సేసెదవు బహు కర్మముల బడవారు
నా కొలది వారలా నారాయణా ॥నిగమ॥





వివిధ నిర్బంధముల వెడల ద్రోయక నన్ను
భవసాగరముల దడ బడ జేతురా
దివిజేంద్రవంద్య శ్రీతిరువేంకటాధీశ
నవనీతచోర శ్రీనారాయణా ॥నిగమ॥

## భావామృతం

వేదముల చేతను వేదాంతములచేతను వర్ణించబడిన మనోజ్ఞమైన రూపముగల ఓ శ్రీమన్నారాయణా! గోవర్ధనధారీ! శరణు.

వైరాగ్య భావన నిజమైన పరమసుఖదాయకము. కాని నీవు అది నామనస్సులో వెలుగొందనీయక నన్ను ప్రతి విషయానికి సమ్మతింపజేయుచు అనేక సంసార బంధాల్లో కట్టి పడేస్తావు. పోనీ అవైనా శాశ్వత బంధాలా అంటే కాదు. అన్నీపైపైన బంధాలు. కట్టిపడేసేవే కానీ వేరు కాదు. అలాగని నామాట చెల్లుతుందా అంటే అదీలేదు. నాకీ బంధం బాగుంది ఇట్లాగే ఉంటాననంటే ఉండనిస్తావా, అది మధ్యలో పుటుక్కున తెంపేసి మేము "లబోదిబో" అని మొత్తుకొనేట్లు చేస్తావు. నారాయణా! నాకెందుకయ్యా ఈ అనవసరమైన సంసారబంధం?

ఈ బంధాల వ్యథతో నేను చీకాకు పడి మనశ్శాంతిని కోల్పోతాను. అప్పుడు నిన్ను అసలు తలవను. నీలీల నాకేమో అర్థం కాదాయె. ఏవేవో పరిష్కారాల కోసం మానవులు ఏవేవో కర్మలు చేస్తారు. అటువంటివాళ్లు నావంటి వారలా ప్రభూ! నారాయణా (నేను నీ శరణార్థిని కానా?)

నేను దిక్కులేనివాడిని. నీ శరణు జొచ్చినవాడిని. నన్ను వివిధములైన నిర్బంధాలలో పడద్రోసి, దారితెన్నూ లేని ఈ సంసార సాగరంలో తడబడిపోవునట్లు చేసి పరీక్షించుట న్యాయం కాదయ్యా! దేవేంద్రాదులచే సేవించబడి ఆరాధించబడే ఓ తిరుమలాధీశా! వేంకటేశ్వరా! వెన్నదొంగా! శ్రీమన్నారాయణా! శరణు. నామాట నమ్ము. "అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ"

**1-91**

## మున్నుడి

తుమ్మెద ప్రతి పూవుపై వాలి మకరందం గ్రహించి తేనెపట్టు పెడుతుంది. దాన్ని మానవులు తమ స్వార్థం కోసం పొగబెట్టి వెళ్లగొట్టి దొంగిలిస్తారు. అది మళ్లీ ఇంకొక తేనెపట్టు పెడుతూనే ఉంటుంది. వేంకటేశ్వరుని తుమ్మెదగా భావించి జానపదుల బాణీలో పాడుతున్నారన్నమయ్య. మేము స్వార్థపరులమే కాని అనాదిగా జీవకోటి ఆర్తత్రాణ పరాయణుడు గావున తొల్లింటి వలెనే రక్షించు తండ్రీ! అని కీర్తిస్తున్నారు అన్నమయ్య. ఇంత చిన్న కీర్తనలో నర్మగర్భమైన పదములు కోకొల్లలు. ఒకసారి పరికించండి. తాళ్లపాక వారి చాతుర్యం 'సంగ్రహించండి'.

**ఆ.వె॥ అన్నమయ్య ఊహ అద్భుతంబుర చూడ**
**తుమ్మెదాయెను వరదుండు తాను,**
**జానపదుల శైలి చక్కటి కీర్తన**
**భావమెరిగి దీని పాడరయ్య!**

**రాగం : శ్రీరాగం**

తొల్లింటి వలె గావు తుమ్మెదా
వొల్లవుగా మమ్మునో తుమ్మెదా ॥తొల్లింటి॥

తోరంపు రచనల తుమ్మెదా కడు
దూరేవు గొందులే తుమ్మెదా
దురినా నెఱగవు తుమ్మెదా
వోరగా చూడకువో తుమ్మెదా ॥తొల్లింటి॥

తొలి ప్రాయపు మింద తుమ్మెదా కడు
తొలిచేవు చేగలే తుమ్మెదా
తొలకరి మెరుగవే తుమ్మెదా
ఉలికేవు మముగని వో తుమ్మెదా ॥తొల్లింటి॥





దొరవు వేంకటగిరి తుమ్మెదా
తురుమేల చెనకేవు తుమ్మెదా
దొరకె నీ చనవులు తుమ్మెదా
ఒఱులెరింగిరి గదవో తుమ్మెదా ॥తొల్లింటి॥

## భావామృతం

అనాదిగా జీవకోటికి తగిన ఆహారాన్నిచ్చి బ్రతికే కిటుకుల్ని నేర్పి, తరువాతి తరాన్ని పుట్టించే 'సామర్థ్యం' ఇచ్చి పోషిస్తున్న దెవరు? ఆ తిరుమలేశుడే. ఓ తుమ్మెదా! (తిరుమలేశా!) మమ్మల్ని ఇదివరలో వలెనే రక్షింపుము. మమ్మల్ని విడిచిపెట్టవు గదా! తుమ్మెదా! (అంతపని చేయకు తండ్రీ!)

ఓ తుమ్మెదా! నీవన్నీ స్థూలమైన రచనలు. ఆషామాషీకాదు. ఆర్తజన రక్షణకోసం ఎన్నెన్నో మారుమూల ప్రదేశాలకు పోతావు (ఎక్కడో కొలనులో మొసలికి చిక్కిన గజేంద్రుని రక్షించటానికి వెళ్లలేదూ?). ఆక్షణంలో పాపపుణ్యాలను లెక్కసేయవు. నీపని నీవు చేస్తూనే మాబోటి దీనులింకా ఎవరన్నా ఉన్నారేమోనని వోరచూపులు చూస్తూనే ఉంటావు. తుమ్మెదా! (అందుకే నిన్ను జగన్నాథుడన్నారు)

ఓ మగ తుమ్మెదా! నీవిప్పటి వాడవా? అనాదివి. మా బలమునంతా హరించి వేస్తావు. మేము సాధించిన వన్నీ తొలకరినాటి మెరుపుల వలె క్షణ భంగురాలని మేమే గ్రహించేట్లు చేస్తావు. దిక్కుతోచక మేము ఏడుస్తుంటే నువ్వు మాకోసం చలించిపోతావు. తుమ్మెదా! (నిన్ను అర్థం చేసికొనుట మా వలన అవుతుందా?)

ఇంతకీ నీవెవరవు? నీవు వేంకటాద్రిపై నుండే దొరగారివే తుమ్మెదా! నీవు మా తప్పుల్ని ఎందుకు యెంచుతావు? వద్దు ఆ పనిచేయకు. ఇప్పుడు మాకు నీవద్ద స్వాతంత్ర్యం లభించింది కదా! ఇక ఏం చేయాలో అందరికీ తెలిసిపోయిందే తుమ్మెదా? (ఎలుగెత్తి ప్రార్థించండి... "శరణంటిమయ్యా మిమ్ము పురుషోత్తమా...")

**1-92**

## మున్నుడి

శ్రీరామచంద్రునిపై ఎన్నో అమరమైన కీర్తనలు చెప్పారన్నమయ్య. రామాయణాన్ని అట్టి కీర్తనలలో రాముని గుణగణాలు వర్ణిస్తూ పదే పదే చెప్పటం తాళ్లపాక వారి ప్రత్యేకత. ఏ ఊరు సందర్శించవలసి వస్తే ఆ వూరిలోని దైవమూర్తిని శ్రీవేంకటేశ్వరునిగానో లేక ఆయన దాసునిగానో సంకీర్తిస్తారు. చిత్తూరు జిల్లాలోని 'వావిలిపాడు' (వాయల్పాడు) లో వెలసిన వీరరామచంద్రుని దర్శించి ఆయన చెప్పిన సంస్కృత కీర్తన ఇది. 'సంయమినాథ వరదుడ'ని రామయ్య నెందుకన్నారో తెలుసునా? 'తరణి సంభవ సైన్యదక్షకు'డంటే.. భావామృతం పరిశీలించండి తప్పదు. ఇదే రాముని సేవ అంటే..

**చం॥ వరరుహలోచనుండు రఘువంశసుధాంబుధి పూర్ణచంద్రునిన్**
**సురగణ సేవితున్, దనుజ సూదను, రాముని, రావణాంతకున్,**
**వరదుని, అన్నమయ్య సురభాషనుతించెను కీర్తనంబుతో**
**పరవశులైరి మాన్యులగు పావనియున్ తిరుశైలనాధుడున్**

**రాగం : నటభైరవి**

రాజీవ నేత్రాయ రాఘవాయా నమో
సౌజన్య నిలయాయ జానకీశాయ ॥రాజీవ॥

దశరథ తనూజాయ తాటక దమనాయ
కుశిక సంభవ యజ్ఞ గోపనాయ
పశుపతి మహాధనుర్భంజనాయ నమో
విశద భార్గవ రామ విజయకరణాయ ॥రాజీవ॥

భరిత ధర్మాయ శూర్పణఖాంగ హరణాయ
ఖరదూషణాది రిపు ఖండనాయ
తరణి సంభవసైన్య దక్షకాయ
నిరుపమ మహా వారిధి బంధనాయ ॥రాజీవ॥





హతరావణాయ సంయమినాథ వరదాయ
అతులిత అయోధ్యా పురాధిపాయ
హితకర శ్రీవేంకటేశ్వరాయ నమో
వితత వావిలిపాటి వీరరామాయ ॥రాజీవ॥

## భావామృతం

రాజీవములు (పద్మములు) వంటి కన్నులుగల ఓ రఘురామా! మంచితనమునకు నిలయమైన శ్రీరామచంద్రా! సీతామనోహరా! (నీకు వందనములు)

ఓ దశరథ తనయా! తాటక అను రాక్షసిని సంహరించిన వాడా! కౌశికుడైన విశ్వామిత్రుని యాగమును రక్షించినవాడా! పరమేశ్వరుని వింటిని రెంటికి విరిచిన మహానుభావా! భార్గవరామునిపై విజయమును ప్రకటించినవాడా! (నీకు వందనములు)

ధర్మములచే సంపూర్ణుడవైన ప్రభూ! శూర్పణఖ అంగములను (ముక్కుచెవులను) హరించినవాడా! ఖరదూషణాది దానవ సంహారా! సముద్రమునుండి ఉద్భవించిన అసంఖ్యాక సైన్యమును చీల్చి చెండాడిన అసహాయశూరా! సరిపోల్చలేని గొప్పసేతుబంధన మొనరించిన శ్రీరామా! (నీకు వందనములు)

రావణాసుర భంజనా! మునిజన వరప్రదాతా! సరిపోల్చనసాధ్యమైన అయోధ్యాపురాధిపా! నీవే హితప్రదాతవైనమా శ్రీవేంకటేశ్వరుడవు. అధికుడవైన 'వావిలిపాటి' వీరరామచంద్రమూర్తివి నీవే ప్రభూ! అట్టినీకు (వందనములు తండ్రీ!)

## మున్నుడి

అవకాశం చిక్కినప్పుడల్లా అన్నమయ్య శ్రీహరి దశావతారవిశేషాలను వర్ణిస్తుంటారు. ఒక్కొక్కప్పుడు ఆ వర్ణన యెంత నర్మగర్భంగా వుంటాయంటే పెద్దలు వివరించి చెబితే గాని మనబోటి సామాన్యుల కర్థంకాదు. ఈ కీర్తనలో అమ్మ అలమేలుమంగని కీర్తిస్తూ ఇన్ని అవతారాలెత్తినేడు వేంకటేశ్వరుడైన ఆ మహానుభావుడు నీపై మక్కువతో అక్కున చేర్చుకోగానే ఇట్లే అలరించే నాంచారివమ్మా! అని కీర్తిస్తున్నారు. భావామృతంలో నా పరిమిత జ్ఞానంతో వివరణ ఇచ్చాను. కానీ ఇంకా లోలోపలి అర్థాలున్నాయేమో! మనమెంత..

**శా॥ కొమ్మా! శ్రీహరియెత్తెనాడు పదియౌ కొంగ్రొత్త రూపంబులన్**
**అమ్మమ్మా!! యిటు చెప్పవీలగునె ఓ అమ్మణ్ణి నాంచారి! మా**
**అమ్మా! నీ విభు ఆజ్ఞ చేత చెబితిన్ అందించితిన్ 'భావమున్'**
**సమ్మానంబంది అన్నమయ్య కృపచే సాధించితిన్ 'మున్నుడిన్'**

**రాగం : భైరవి**

అమ్మమ్మ యేమమ్మ అలమేల్పంగ నాంచారమ్మా
తమ్మియింట నలరు కొమ్మ ఓ యమ్మ ॥అమ్మమ్మ॥

నీరిలోన తల్లడించీ నీకే తలవంచీ
నీరికింద పులకించీ నీ రమణుండు
నోరికొన చెమరించీ కోపమే పచరించీ
సారెకు నీ అలుక ఇట్టే చాలించవమ్మా ॥అమ్మమ్మ॥

నీకుగానే చెయిచాచీ నిండాకోపమె రేచీ
మేకొని నీ విరహాన మేను నెంచేని
యీకడాకడి సతుల హృదయమే పెరరేచీ
ఆకు మడిచియ్యనైనా ఆనతియ్యవయ్యా ॥అమ్మమ్మ॥





చక్కదనములె పెంచీ సకలము కాదలంచీ
నిక్కపు శ్రీవేంకటేశుడు నీకే పొంచేని
మక్కువతో అలమేల్మంగ నాంచారమ్మా నీ
అక్కున నాతని నిట్టె అలరించవమ్మా ॥అమ్మమ్మా॥

## భావామృతం

ఏమమ్మా! అలమేల్మంగ నాంచారీ! అమ్మమ్మా! (అసాధ్యురాలవు గదమ్మా!) పద్మంలో నివాసమైయున్న కొమ్మవు (యువతివి) గదమ్మా నీవు.

ఓ తల్లీ! మీ శ్రీవారి వైభవాన్ని ఏం వర్ణించగలం? ఆయన నీటిలో తల్లడిల్లిపోయేట్లు చేసి (సోమకాసురుని చంపుటకు మత్స్యావతారం ఎత్తి) తరువాత నీకే తలవంచి వరమాల వేయించుకొన్నాడు. నీ రమణుడు ఆ తరువాత నీరికిందపులకించాడు. (సముద్రము అడుగున పులకించిన విధమున కూర్మమై తన వీపుమీద మంధర గిరిని మోశాడు). తననోటి మీద వహించి (భూదేవిని కరుణాంతరంగుడై రక్షించే వరాహమూర్తి అయి యున్నాడు.) విపరీతమైన కోపమును ప్రసరింపజేసినాడు. (నరసింహస్వామియై హిరణ్యకశిపుని సంహరించాడు). ఎవరెవరితోనో తగాదాలు పెట్టుకొంటూ అవస్థలు పడుతున్నాడని మాటిమాటికీ నీ అలుకలు చాలించవమ్మా!

నిజమే ననుకో.. నీవులేకుండా ఎవరెవరి దగ్గిరనో చేయిచాచి భవతీ భిక్షాందేహి అన్నాడు (వామనమూర్తి). కోపావేశంతో రెచ్చిపోయాడు. (పరశురాముడై ఇరవై ఒక్కసార్లు భూమిపై రాజు అనేవాడు లేకుండా మారణకాండ చేశాడు). సమ్మతించి నీవిరహం అనుభవించి మరీ నిత్యమూ దుఃఖించాడు. (శ్రీరామచంద్రుడు). మధురమైన వేణునాదంతో అమాయకురాళ్లైన యువతుల హృదయాలను ప్రేరేపించి (శ్రీకృష్ణుడు) యున్నాడు. ఆ స్వామికి భక్తితో తాంబూలం ఇద్దామని మా ఆశ. కాస్త అనుజ్ఞనియ్యవమ్మా!

చక్కదనములు కలిగిన మంచి (జ్ఞానమును) పెంచియున్నాడు. (బుద్ధభగవానుడు). సర్వాధికృత పొంది సకలము కాదలచి (కల్కి అవతారం) విరాజిల్లాడు. నిజమైన శ్రీ వేంకటేశ్వరుడు నీకోసం నిరీక్షించి ఓ అలమేలు మంగ (అలర్‌మేల్ మంగై అనగా పద్మంపై నిలిచిన యువతి) నాంచారీ! నీపై అనురాగంతో నీ కౌగిట చేరిన ఆ జగన్నాథుని క్షణంలో ఇట్టే మైమరిపిస్తావు కదమ్మా!

**1-94**

## మున్నుడి

జానపద కీర్తనలు చెప్పటంలో అన్నమాచార్యులవారు అద్వితీయులు. తేలు దగ్గరనుంచి నీలకంఠుని వరకు, చీమదగ్గిరనుంచి శ్వేతాశ్వాన్ని అధిరోహించిన కల్కిభగవానుని వరకు, పిల్లి దగ్గరనుంచి బల్లిదుడు వేంకటేశ్వరుని వరకు అన్నీ ఆ శ్రీమన్నారాయణుడే సుమా! ఎండైనా, నీడైనా (బయటనైనా, ఇంట్లోనైనా) ఆ ఏడుకొండలవాడే మా ఇలవేల్పు అని గట్టిగా చెబుతున్నారన్నమయ్య. ఈ జానపదుల కీర్తనలో నాగరీకులమనుకొనే నాబోటి వారికర్థంకాని పదములు ఎక్కువగానే ఉన్నాయి. పరిశీలించండి.

**ఉ॥ ఈశ్వరుడొక్కడే పిలుపు ఏదయినన్ పలికేది ఆయనే**
**శాశ్వతుడైన శ్రీహరియు శంకరుడొక్కటె బేధమున్నదా?**
**విశ్వము నిర్వహించునది విష్ణుడు, అన్నయ కీర్తనంబులో**
**అశ్వమునెక్కు 'కల్కి'యును ఆ తిరువేంగళరాయుడే అనెన్.**

**రాగం: నీలాంబరి**

ఎండగానీ నీడగానీ ఏమైనగానీ
కొండలరాయుడే మా కులదైవము ॥ఎండగానీ॥

తేలుగానీ పాముగానీ దేవపట్టయినాగానీ
గాలిగానీ ధూళిగానీ కాని ఏమైనా
కాలకూట విషమైన గక్కున మింగిన నాటి
నీలవర్ణుడే మా నిజదైవము ॥ఎండగానీ॥

చీమగానీ దోమగానీ చెలది యేమైన గానీ
గాముగానీ నాముగానీ కానీ యేమైన
పాములనిన్నిటి మింగే బలుతేజి పైనున్న
ధూమకేతువేని మా దొరదైవము ॥ఎండగానీ॥





పిల్లిగానీ నల్లిగానీ పిన్న యెలుకైనగాని
కల్లగాని పొల్లగాని కాని ఏమైనా
బల్లిదుడై వేంకటాద్రి పైనున్న యాతడే మ
మ్మెల్లకాలమును నేలే యింటిదైవము ॥ఎండగానీ॥

## భావామృతం

ఇంటా బయటా ఎక్కడనైనా మన దిక్కెవరు? మనందరికీ ఇలవేల్పెవరు? వేరే చెప్పాలా! ఇంకా ఎవరు? ఆ ఏడుకొండలరేడు తిరుమలనాథుడే కదా!

తేలు (కుట్టి బాధించేది) గానీ, పాము (కాటువేసి చంపేది) గానీ, దేవలోకంలో జన్మించిన ఎవరైనా గానీ, గాలి అయినాగానీ ధూళియైనాగానీ ఆఖరికి కాలకూట విషాన్ని మ్రింగి లోకాలను రక్షించుటకు తెల్లటివాడు నీల వివర్ణునిగా మారిన పరమశివుడు కూడ ఈ కొండలరాయుడే సువా!

గాముగానీ (సూర్యభగవానుడ కానీ) నాముగానీ (జొన్నవంటి పైర్లు కొడవలితో కోసినపుడు కోసుదేలిన భాగం చిగురించి మొలకలొస్తాయి. వాటిని పశువులు తిని మరుణస్తాయి) అట్లా చేసే అంతకుడు కూడా ఆ నల్లనయ్యాయే. దుష్ట శిక్షణాచారదురంధరుడై గొప్పవేగముగల అశ్వమునెక్కి అందరినీ తుదముట్టించిన పెను ఉత్పాతము (ధూమకేతువు) వేరేవరో కాదు, కల్కిరూపుడైన ఆ శ్రీమన్నారాయణుడే.

పిల్లిగానీ, చటుక్కున కుట్టి పారిపోయే నల్లిగానీ, చిట్టెలుకగానీ, అబద్ధం కానీ, పొరపాటు గానీ ఏదైనా వేరెవ్వరూ కాదు. అందరికంటే సర్వసమర్థుడై పవిత్రమైన వేంకటాద్రిపై నెలకొని యున్న ఆ మహానుభావుడే సర్వకాల సర్వావస్థలలో మమ్మల్ని రక్షించే మా ఇలవేల్పు.

**1-95**

## మున్నుడి

'నిందాస్తుతి' అని ఒక అద్భుతమైన ప్రక్రియను కవులు యెన్నుకున్నారు. పైపైన చూస్తే ధిక్కరించి చిన్నచూపుగా మాట్లాడినట్లున్నా తరచి చూస్తే అది కీర్తించుటయే. ఈ కీర్తనలో అన్నమయ్య నిందాస్తుతి ప్రయోగించారు. ఎంత చమత్కారమో చూడండి. నన్ను అడుగడుగునా రక్షించటానికి జగద్రక్షుడు నీవున్నావు. మరి నీకు దిక్కెవరయ్యా! నేను భక్తితో పూజించుటకు నీవు కలవు. కానీ నీకెవరున్నారు? వరాలిచ్చి నన్ను అనుగ్రహించుటకు నీవు వున్నావు. నీకెవరు వరాలిస్తారు? పోవయ్యా! నీకంటే నేనే నయం. ఔరా!!!

**చం॥ ఘనుడను నిన్ను మించితిని కాదన జాలవు వేంకటేశ్వరా!**
**పనిచి వరాలనిచ్చి యెడబాయక నాజత నీవు వుండగా,**
**కనుగొననైతి నీకెవరు కాపు పరాత్పర! అన్నమయ్యనెన్**
**వినుటకు ధిక్కరింపు, మరి విజ్ఞత నెంచిన కీర్తనంబహో!!!**

## రాగం దేసాళం

నేనే పో ఘనుడను - నీకంటెను
దానవారి నీవు నాకు - దైవమవుగాన ॥నేనేపో॥

నేరుపున నాకైతే-నీదిక్కుగలదు గాని
చేరి నీ కావలదిక్కు - చెప్పి చూపగలదా
అరయ నీవైతే నాకు - నాధారము గలవు గా
నూరకే నీ కాధారము - వున్నదా యెక్కడను ॥నేనేపో॥

నిన్నుగొల్చిన సలిగె - నేడు నాకు గద్దు గాని
సన్నుతి నీకు నొకరి - సలిగున్నదా
పెన్నిధి నిన్ను దలచే - పేరు నాకు గద్దు గాని
వున్నదా నీకు దలచ - నొకరి పేరైనను ॥నేనేపో॥





ఈవులెల్ల నాకైతే - నియ్యగలవు గాక
ఆవల నీ కీవు లియ్య - నన్యు లున్నారా
శ్రీవేంకటేశ నాకు - జీవాంతరాత్మవు నీవు
భావించనంతరాత్మ య-ప్పటి నీకు నున్నదా ॥నేనేపో॥

## భావామృతం

అసురులకు భయంకరుడవైన నీవే నాకు అండగా దైవమై యున్నావు. (మరి నీకే దైవముని లేదు కదా!) కాబట్టి నీకంటె నేనే గొప్పవాణ్ణి పోవయ్యా!

నేర్పుగా దిక్కే నీవై నాకున్నావు. మరి నీకు అక్కడ ఇదిగో నా దిక్కు అని చూపించుకోటానికి ఎవరున్నారయ్యా! నేను ఈయన నా ఆధారం అని చెప్పుకోగలను. మరి నీకెవరు ఆధారం? ఏదో ఒక ఆధారం అంటూ ఉన్నదా? లేదు. మరి నేనే నయము కదా!

నిన్ను నేను సేవిస్తాను కాబట్టి నాకు నీ ఆశ్రయం వున్నది. నాకేదిగులులేదు, నేడు. మరి నీ సంగతో? నీవేవరివి స్తుతిస్తావు? నీకు ఆశ్రయమంటూ ఏమన్నా వున్నదా? లేదు కదా! నాకు పెన్నిధివలె నీనామం వున్నది. అదీగాక అనంతమైన నామాలు. మరినీవు ఎవరి నామస్మరణ చేయగలవు? అందువల్ల నీవు ఎవర్ని తలవగలవు? కాబట్టి నేనే నయం నీకంటె.

నాకేం కావలసినా ఇచ్చుటకు సర్వసమర్థుడవైన నీవు ఉన్నావు. నీవెవరినడుగుతావు? నీకు ఈయగలవాడెవడున్నాడు. ఆ వైపున? ఓ వేంకటేశ్వరా అంతర్యామివై నాకు నీవు సదా నాలోవున్నావు. నీకు అంతరాత్మే లేదు. నీకు హితము లెవరు చెప్పగలరు? నీవు శాశ్వతుడవు, నిరంకుశుడవు, జగన్నాయకుడవు, స్వామివి అయినప్పటికీ నేనే నీకంటే గొప్పవాడిని.

**1-96**

## మున్నుడి

'లాలి' అంటే ఉయ్యాల అని అర్థం. ఉయ్యాల వూపుతూ పాడే పాటలు లాలిపాటలు. తల్లిపాపాయిని నిద్రబుచ్చటానికి లాలీ లాలీ అంటుంది. ఉయ్యాల లూగునాన్నా అని 'లాల' కి అర్థం.

ఈ కీర్తనలో గోపికలు బాలకృష్ణుని నిద్రబుచ్చుతున్నారు. గండడు అంటే పురుషుడు అని అర్థం. గండవరుడంటే పురుషోత్తముడు, పరాక్రమ విక్రముడు అని అర్థాలున్నాయి. ఈ కీర్తనలో అన్నమయ్య విధిగా వాడే వేంకటేశుని మకుటం కనిపించదు. "గండవరేశ!" అని కీర్తనని ముగిస్తారు అన్నమయ్య. ఆఖరి చరణంలో 'గండవరేశ' స్థానంలో 'వేంకటనాథ' అని పెట్టుకొంటే ఆలోటు కనిపించదని నా భావన.

ఇంత అమృత పేయమైన కీర్తనలో వివరణ ఇంత అధ్వానంగా వుందని మీరు భావిస్తే ఆలోపం నాదే. ఎందుకంటే ఏదో టూకీగా భావం చెప్పటం నా అభిమతం కాదు. ప్రతిపదానికి వివరణ ఈయాలనే నా తపన. ఆ ప్రయత్నంలో పాఠకులకి కొంత ఇబ్బంది కలిగినా తరచి తరచి చదివితే నా తిప్పలన్నీ దేనికో మీకు అర్థమవుతుంది.

ఇక మొదలుపెట్టండి 'భావయామి వేంకటేశమ్' లో ఇది ఆచార్యులవారి అద్భుత సృష్టి. రసవత్తరంగా పాడగల అందరికీ నా వందనములు.

**సీ॥ లాలిపాటలు పాడి రమణీయముగ నాడు**
**అన్నమయ్య నిదుర హరిని బుచ్చె**
**ఏనాటి పుణ్యమో ఈ రీతి వివరించి**
**జన్మ సాఫల్యంబు జరుపుకొంటి**
**దూరపు కొండలు తోపును నునుపుగా**
**దరిబోయి చూడంగ తరులు గిరులు**
**ఈ కీర్తనంబులున్ ఇదెతీరు చూడరో**
**వివరమీయ దలంచ వెత్తి బుట్టు**





**ఆ.వె॥ వేంకటేశుకరుణ వెలయంగ పాడిరి**
**నాడు అన్నమయ్య నేడు నేను**
**అట్టి సద్గురుడిని గట్టిగా ప్రార్థించి**
**అందజేయుచుంటి నా వివరము**

**రాగం : మధ్యమావతి**

లాలనుచు నూచేరు లలన లిరుగడల
బాల గండవర గోపాలు నిను చాల ॥లాలనుచు॥

ఉదటుగుబ్బల సరము లుయ్యాల లూప
పదరి కంకణరవము బహుగతుల మ్రోగ
వొదిగి చెంపల కొప్పు లొక్కింత వీగ
ముదురు చెమటల నళికములు తొప్పదోగ ॥లాలనుచు॥

సొలపు తెలికన్నుగవ చూపు లిరువంక
మలయ రవళులకు పలుమాఱును బెళంక
కొలది కోవిలగములు క్రోలు మదనాంక
ములగ్రేణి సేయు రవముల వడి దలంక ॥లాలనుచు॥

సరసపదములు జంగచాపు చేపాయ
గురులీల మీగాళ్ల గుచ్చెళ్లు రాయ
కలమూలముల కాంతి కడుజాయ చేయ
సరస నురు కుసుమ వాసన లెదురు డాయ ॥లాలనుచు॥

కొలది నునుమేను లతకూన లసియాడ
మెలకువతొ నొకరొకరి మెచ్చి సరిగూడ
తలలూచి చొక్కి చిత్తరు బొమ్మలాడ
అలరి యెల్లరు మోహనాకృతులు చూడ ॥లాలనుచు॥

లలిత తాంబూలరస కలితంబులైన
తళుకు దంతములు కెంపుల గుంపులీన
మొలక వెన్నెలడాలు ముసురుకొని తోన
చెలగి సెలవుల ముద్దు చిరునవ్వు లాన॥లాలనుచు॥

మలయమారుత గతులు మాటికి చెలంగ
పలుకు కపురపుతావి పైపై మెలంగ
బలు గానలహరి యింపుల రాల్లరంగ
బలసి వినువారి చెవి బడలిక తొలంగ ॥లాలనుచు॥

లలనాజనాపాంగ లలిత సుమచాప
జలజ లోచనదేవ సద్గుణ కలాప
తలపు లోపల మెలగు తత్వ ప్రదీప
భళిర వేంకటనాథ పరమాత్మ రూప ॥లాలనుచు॥

**('వేంకటనాథ'** కు బదులుగా **గండవరేశ** అని మూలం)

**భావామృతం**

'లాలీ' 'లాలీ' అంటూ అతివలు ఇరువైపులా నిలిచి ఊయల నూపుదురు. ఓ బాల పరాక్రమ విక్రమా! గోపాలబాలా! నిన్ను చాల చక్కటి విధమున ఊయలమాపుచున్నారు.

అట్లా ఊయలనూపుతుంటే గర్వముగా నుప్పొంగిన ఆ భామల గబ్బిగుబ్బలు కూడ ఊయలలూగుచున్నవి. ఊరకనే ధ్వని చేయు కంకణముల పలురకములైన సవ్వడులు చేయుచున్నవి. చెంపలపై ఒరుసుకొని కొప్పులు కొద్దిగా వదులయినవి. అధికమైన చెమటతో తనువులు వారికి మిక్కిల తడిసిపోయినవి. అయినా వారు ఊయలనూపుచునే యున్నారు.

పరవశించిన తెల్లని కన్నులతో వారు ఇరు ప్రక్కలా (ఊయల ఊగుతుంటే) చూపులు తిప్పుతున్నారు. అటూ ఇటూ మరలే చూపులకనుగుణంగా కళ్ల తళుకులు





మారుతున్నాయి. గాలి సవ్వడి కూడ అలాగే మారుతున్నది. ఆలయమునకు పోవుచున్న జవ్వనులు మన్మథావస్థను పొందుటచే (గోపాల బాలుని చూచి) చలించిపోయి రకరకములైన రవములను సేయుచున్నారు. కోమలములైన పాదములపై పిక్కలను దాటిన వస్త్రపు చాపుతో మోకాళ్లపై కుచ్చెళ్ల రాసుకొంటున్నవి. కరమూలముల మెఱపు చక్కని కాంతి జిమ్ముచున్నది. అవి చక్కటి కుసుమ సువాసనలు వెదజల్లుచున్నాయి. ఆ లీల అద్భుతముగా నున్నది.

నునుపైన చిన్న శరీరములు గల లేబ్రాయపు అమ్మాయిలు కొద్దిగా మేల్కొని ఆ తరువాత ఒకరినొకరు మెచ్చుకొంటూ గుంపుగా కూడి, తలలు ఊపి పరవశించి బొమ్మలవలె మోహనమైన తమ ఆకారములను చూపుచు నిలబడి పోయారు. (కృష్ణుని చూచి మోహ పరవశులై పోయారు).

లేబ్రాయపు అమ్మాయిల సంగతలా ఉంటే, ఇక ప్రౌఢ యువతుల సంగతెలా యున్నదో వినండి.. మధురమైన తాంబూల రసముతో మిళితమైన వారి దంతములు కెంపుల గుంపులవలె తళుకులను ప్రసరిస్తున్నాయి. లేత వెన్నెల కాంతి ముసురు కొనినట్లున్న చిరునవ్వు, ముద్దొచ్చే పెదవుల చివర ఆడుచున్నట్లున్నది.

ఇక గోపికలు పాడే ఆ లాలిపాట ఎలా వున్నదో వినండి. మలయమారుతం హాయిగా మాటి మాటికీ వీస్తున్నట్లున్నది. కర్పూరపు పలుకుల మధుర సువాసన వెదజల్లుచున్నట్లుంది. అద్భుతమైన ఆ గానలహరికి రాళ్లు అరిగి కరిగిపోతున్నట్లున్నది. ఆ గానం విన్నవారి చెవుల బడలికంతా మటుమాయమై అణగారి పోవుచున్నది.

లలనలందరికీ తిలకము వలె శోభాయమానమైన మన్మథరూపా! పద్మనయనా! సద్గుణ భూషణా! దేవదేవా! చిత్తములలో ప్రకాశించు తత్త్వ విభావరిని ప్రసాదించు మహాత్మా! భళిరా! భళి! ఓ వేంకటనాథా! ఓ గండవరేడా! (పురుషోత్తమా!) పరమాత్మ స్వరూపా! భళి!

## 1-97

### మున్నుడి

శ్రీవేంకటేశ్వరునికి ప్రతి శుక్రవారము అభిషేక మహోత్సవం జరుగుతుంది. తిరుమలలో కన్నులపండువగా జరిగే స్వామివారి అభిషేక వైభవాన్ని కళ్లకు గట్టినట్లు వర్ణిస్తున్నారన్నమయ్య. మనబోటి వాళ్ళు జీవితంలో ఏ ఒక్కసారో కన్నులారా స్వయంగా చూడగలిగే ఆ ఉత్సవం దేవతలు కూడా బారులు తీరి నింగి నుండి తిలకిస్తారట. అప్పుడు దేవదుందుభులు మ్రోగుతాయట. ఆ శృంగారాలొలికే దేవుని కనులారా దర్శించి సేవించండంటున్నారన్నమయ్య. ఈ కీర్తనలో తేలికగా అర్థం కాని మాటలు బాగానే ఉన్నాయి. చదివి ఆ విశేషాలు తెలుసుకోండి.

**ఆ.వె॥ స్వామి సేవయైన స్నానంపు ముచ్చట**
**తెలిపి రన్నమయ్య తేటతెలుగు**
**కీర్తనంబు లోన కేశవు గొలిచిరి**
**ఎన్ని మెలికలున్న విందులోన!!**

**రాగం : ఖరహరప్రియ**

దేవదుందుభులతోడ తేటతెల్లమైనాడు
సేవించరో యిదే వీడే సింగార దేవుడు ॥దేవ॥

బంగారుమేడలలోన పన్నీట మజ్జనమాడి
అంగము తడియొత్తగా నదె దేవుడు
ముంగిట పులుకడిగిన ముత్యమువలెనున్నాడు
కుంగని రాజసముతో కొండవంటి దేవుడు ॥దేవ॥

కాంతులు మించిన మాణికపు తోరణములకింద
అంతట కప్పురము చాతుకదే దేవుడు
పొంతల నమృతమే పోగైనట్టున్నవాడు
సంతతము సంపదల సరిలేని దేవుడు ॥దేవ॥





తట్టుపుణుగు నించుక దండిసొమ్ములెల్లాబెట్టి
అట్టె అలమేల్మంగ నరుతగట్టి
నెట్టన నమ్మినవారి నిధానమై వున్నవాడు
పట్టపు శ్రీవేంకటాద్రిపతియైన దేవుడు ॥దేవ॥

### భావామృతం

నింగిలో దేవతలంతా నిలిచి ఈ అభిషేకోత్సవాన్ని కన్నుల పండుగగా చూస్తూ దేవదుందుభులను మ్రోగిస్తున్నారు. అప్పుడీ శృంగార పురుషుడు ప్రకాశమానమవుతున్నాడు. ఇదిగో ఈయనే.. రారండి మీరంతా ఈ స్వామిని సేవించండి.

ఈ స్వామికెన్నో బంగారు మేడలున్నాయి. ఆ మేడలో ఈయనకు పన్నీటితో స్నానం చేయించారు. అవయవముల కంటిన తడిని జాగ్రత్తగా తుడిచి వేస్తున్నారు. అదిగో చూడండి. ఈయన కడిగిన ముత్యమువలె నున్నాడు. ఆ కడుగుట కూడ ఊరకనే నీటితో కాదు అవి పులుకడిగిన ముత్యములు. అంటే చింతపండు పులుసు వేసి మరీ కడిన ముత్యాలు. అందుకని మిలమిలా మెరిసిపోతున్నాయి. ఇకపోతే పర్వత సమానుడైన ఉన్నతుడు కాబట్టి ఏమాత్రం తగ్గని రాజసం వుట్టిపడుతుంటే ఈ దేవుడు మనోహరంగా ఉన్నాడు చూడండి.

ఈయన వెలుగులు వెదజల్లే మాణిక్యపు మకర తోరణముల క్రింద చక్కగా కర్పూరం అద్దుకొన్నమేని శోభతో విరాజిల్లుతున్నాడు. దేవుడు అంటే ఈయననే. అమృతమంతా యొకచోట చేర్చినట్లున్న ఈయనను అతి సమీపమునుండి తిలకించండి. అంతులేని సంపదలు కల ఈ సాటిలేని దేవుని తిలకించి తరించండి.

చేతులతో తట్టి, ఒత్తుతూ తయారుచేసిన పునుగు జవ్వాది ఈస్వామి ఒంటినిండా అద్ది యున్నారు. రంగులీను రత్నాభరణాలతో విశేషంగా అలంకరించారు. అదేవిధంగా సిద్ధంగా ఉన్న అలమేల్మంగమ్మను ఈయన "అరుతగట్టు" కొన్నాడు (అంటగట్టుకొన్నాడు) ఈయన ఒక నియమబద్ధంగా నమ్మినవారికి కొంగుబంగారమైన మహానుభావుడు. వేంకటాద్రిమీద ఈయన వేంకటపతియై పట్టాభిషిక్తుడైన మహానుభావుడు.

## 1-98

### మున్నుడి

శ్రీరామునికి శరణు జొచ్చి బ్రతకండి అని సలహా ఇస్తున్నారు అన్నమాచార్యులవారివీ. శరణంటే ఆనాడు రావణాసురుని కూడా క్షమిస్తానన్న శరణాగత రక్షకుడా మహానుభావుడు. ఓ దైత్యులారా! విచారం యెందుకు? ఆయనన శరణంటే రక్షిస్తాడు రండి అంటున్నారు. నేటి కలియుగంలో ఆయనే తిరుమల శ్రీవేంకటేశ్వరుడైనాడు. ఈయనకూడా దుర్బుద్ధి కలిగి, మంచివారిని పీడించే రాకాసి మూకను ఏదో ఒకతీరున పగసాధించి తనమేటి పొదలోవున్న బాణాలతో కొడతాడు పారిపోండి అంటున్నారు.

**ఉ॥ రాముని కోరుడీ శరణు రక్షనుగైకొని బ్రతుకుడీవెసన్**
**ఏమిటికిన్ విచారమిక ఏపున బారరొదైత్యులాల! యీ**
**భూమిని వేంకటేశ్వరుడు పుణ్యులగాచును రామబాణమున్**
**ధీమతియగీ ధరించెనని తెల్పెను కీర్తనమన్నమార్యుడున్.**

### రాగం : సామంతం

రామునికి శరణంటె రక్షించీ బ్రదుకరొ
యేమిటికి విచారాలు యికదైత్యులాల ॥రాముని॥

చలవ దాటికి జదిపిన బాణము
లవిమారీచ సుబాహులపై బాణము
మెలగి పరశురాముమేట్లేసిన బాణము
తళతళమెరసీనితలరో యసురులు ॥రాముని

మాయా మృగముమీద మరివేసిన బాణము
చేయిచాచి వాలినేసిన బాణము
తోయధిమీద నటు తొడిగిన బాణము
బాయలుదేరుచున్నది చనరోదైతేయులు ॥రాముని॥





తగ కుంభకర్ణుని తలద్రుంచిన బాణము
జిగిరావణు బలిమార్చిన బాణము
మిగుల శ్రీవేంకటేశు మేటిపొద(ది) బాణము
పగసాధించీ నిక బారరో రాకాసులు ॥రాముని॥

### భావామృతం

ఓ దైత్యులారా! శ్రీరామచంద్రునికి మ్రొక్కి శరణు అంటే రక్షిస్తాడు. ఏమిటికి విచారాలు (ఇంకా ఆలోచనలెందుకు? అలా చేసి సన్మార్గులై హాయిగా బ్రతకండి. ఆయన దగ్గర ఏఏ బాణాలున్నాయో మీకు తెలియునా? వినండి.

చలమునన్ తాటకిన్ చంపిన బాణము (తాటకి చలించిపోయింది ఆబాణం దెబ్బకు), లలి (ఉత్సాహముతో) మారీచ సుబాహులను మట్టుబెట్టిన బాణము, మెలగి (జాగరూకతతో) పరశురాముని మెట్లేసిన (గర్వమడచిన) బాణము, తళతళ మెరసిపోతున్నాయి. ఓ అసురులారా! తలరో (ఆలోచించడ్రా!)

మాయలేడిమీద వేసిన బాణము, సారించి వాలిని వధించిన బాణము, సాగరునిపై కోపించి సంధించిన బాణము, చాయలుదేరుచున్నది (శోభించుచున్నవి). ఓ దైత్యులారా! చనరో (పోండిరా పోండి).

ఆనాడు రామరావణయుద్ధములో తగినట్లు, కుంభకర్ణుని తల తెగనరికి బాణము, జిగి (కాంతులు వెదజల్లుతూ) రావణుని పరిమార్చిన (వధించిన) బాణము, నేడు తిరుమలలో శ్రీవేంకటేశ్వరుని మేటి (మేలైన) పొది (అంబులపొదిలో) వున్న ఈ బాణము పగసాధించునది. కనుక, ఇక పారరో (పారిపోండ్రా) ఓ రాకాసుల్లారా! త్వరపడండి, పారిపోండి.

**1-99**

## మున్నుడి

మన నాగరికత అంతమవనంతవరకు అజరామరంగా వుండే అద్భుతమైన పెండ్లి పాట ఇది. జగన్మాతను సిగ్గులొలికే పెండ్లికూతురుగా దర్శించగలుగుట సాధ్యమయ్యే పనేనా? ముత్తైదువులందరూ మురిపెంగా చూస్తూ ఏయ్ అమ్మాయ్. మీ ఆయన పేరు చెప్పందే లోపలికి పోనీయం అంటే.. సిగ్గుల మొగ్గయై పోయిందట ఈ అమ్మలగన్నయమ్మ. (ఈ మాటలు వ్రాస్తుంటే ఆనందంతో కళ్లువర్షిస్తున్నాయి నాకు) స్వామి సాక్షిగా సత్యం చెబుతున్నాను. వేంకటేశ్వరుని నా ఊహల్లో భావిస్తున్నాను. ఇంకా నేనేం చెప్పగలను. ఈ క్షణాన నా ఊపిరి ఆగిపోతే.. చాలదా?

**ఆ.వె॥ రమణి పిడికిటను తలంబ్రాలు బట్టుచు**
**విభుని శిరసుపైన వేసె తాను**
**పెండ్లి తంతు కనులపెట్టెను అన్నయ్య**
**వరునిపైన జూపు మరలదాయె**

**రాగం : శ్రీరాగం**

పిడికిట తలంబ్రాల పెండ్లి కూతురు, కొంత
పెదమరలి నవ్వీనె పెండ్లికూతురు ॥పిడికిట॥

పేరుగల జవరాలె పెండ్లికూతురు, పెద్ద
పేరుల ముత్యాల మెడ పెండ్లి కూతురు
పేరంటాండ్ల నడిమి పెండ్లి కూతురు, విభు
పేరు కుచ్చ సిగ్గుపడీ పెండ్లి కూతురు ॥పిడికిట॥

బిరుదు పెండెము వెట్టె పెండ్లికూతురు, నెర-
బిరుదు మగని కంటె పెండ్లికూతురు
పిరిదూరి నప్పుడే పెండ్లికూతురు, పతి
పెరరేచీ నిదివో పెండ్లికూతురు ॥పిడికిట॥





పెట్టెనె పెద్దతురుము పెండ్లికూతురు, నేడె
పెట్టెడు చీరెలు గట్టె పెండ్లికూతురు
గట్టిగ వేంకటపతి కౌగిటను వడి-
పెట్టిన నిధానమైన పెండ్లికూతురు ॥పిడికిట॥

## భావామృతం

తనపిడికిళ్ళలో తలంబ్రాలను పట్టుకొన్న ఈ పెండ్లికూతురు కొంచెము పెడమొగము పెట్టి (తనవిభుని తలచుకొని) నవ్వినది.

ఈ జవరాలు (యువతి) చాలగొప్ప పేరుగల అమ్మాయి (సాక్షాత్తు శ్రీమహాలక్ష్మి) తన మెడలో పెద్ద ముత్యాల పేరు గల పెండ్లి కూతురు ఈమె, చాలామంది పేరంటాండ్ల మధ్య ఈ పెండ్లికూతురు ఆమె భర్త పేరు ఏమిటి అని అడిగినంతనే చెప్పుటకు చాల సిగ్గుపడుచున్నది.

ఈ పెండ్లి కూతురు గొప్ప పెండెములను కాళ్ళకు ధరించినది. ఈమె భర్తకు ఎన్నో బిరుదులున్నాయి. ఈమె భర్త తన మెడలో మాంగల్యం కట్టగానే పెరరేచిపోయింది. (భర్తకు ప్రేరేపణ కలిగించసాగినది) అటువంటి సౌభాగ్యదాయిని అయిన పెండ్లి కూతురు ఈ అలమేలు మంగమ్మ.

ఈమె పెద్ద కొప్పును ధరించినది. ఈ పెళ్లి రోజుననే ఈమె పెట్టెడు చీరెలు కట్టుకొనినది. శ్రీ వేంకటేశ్వరుని బిగి కౌగిటిలో ఈ పెండ్లి కూతురు స్థిరపడిన ఐశ్వర్యమువలె ప్రసిద్ధి చెందినది. ఈ శ్రీమహాలక్ష్మి అయిన అలమేల్మంగను సేవించి తరించండి.

## 1-100

### మున్నుడి

అన్నమాచార్యులవారి ఈ అద్భుత కీర్తన వినని తెలుగువాడు ఉండే అవకాశమేలేదు. జగద్విఖ్యాతమైన ప్రతిగాయకుని నోట పలికిన అమృతధార ఈ కీర్తన. ఆ స్వామికి మనమీద అనుగ్రహం కలిగితే మన వెంటబడి మరీ మనని తనవైపు తిప్పుకొంటాడు. నాకు నీ వక్కరలేదయ్యా బాబూ! అనినా వదలడు. ఎట్లాగో అట్లా మనని తనవైపు తిప్పుకొంటాడు. తన సర్వస్వం ఇచ్చి మనవెన్ను కాస్తాడు. ఆయన ఏడు కొండల కంటే పెద్దవైన కోర్కెలు తీరుస్తాడు. అడుగడుగునా ఆపదలు తీరుస్తాడు. ఇదిచక్కగా నిరూపించడానికి ఎన్నో ఉదాహరణలిస్తున్నారు అన్నమయ్య. భక్తిలేకపోతే వజ్రాల కిరీటాలు చేయించినా.. ఉత్తి... దండగ.

**ఉ॥ కొండలలోన నిల్చుకొని 'కోనలయేటికి' రాయుడీతడై**
**అండగ నాదుకోగలడు 'ఆపద' బాపును భక్తి మ్రొక్కినన్**
**కొండల వంటి కోరికలు కొల్లగ తీర్చును అన్నమయ్యనెన్**
**దండగ డాబు దర్పములు దగ్గర రాదుర 'కోట్లు' బెట్టినన్**

### రాగం : హిందోళం

కొండలలో నెలకొన్న కోనేటి రాయడు వాడు
కొండలంత వరములు గుప్పెడువాడు ॥కొండలలో॥

కుమ్మరదాసుడైన కురువరతి నంబి
ఇమ్మన్న వరములెల్ల నిచ్చినవాడు
దొమ్ములు సేసినయట్టి తొండమాంజక్కుర వర్తి
రమ్మన్నచోటికి వచ్చి నమ్మినవాడు ॥కొండలలో॥

అచ్చపు వేడుకతోడ అనంతాళువారికి
ముచ్చిలి వెట్టికి మన్ను మోచినవాడు
మచ్చిక దొలక తిరుమల నంబితోడుత
నిచ్చనిచ్చమాటలాడి నచ్చిన వాడు ॥కొండలలో॥





కంచిలోన నుండ తిరుకచ్చి నంబిమీద కరు-
ణించి తనయెడకు రప్పించినవాడు
యెంచనెక్కుడైన వేంకటేశుడు మనలకు
మంచివాడై కరుణ పాలించినవాడు ॥కొండలలో॥

### భావామృతం

ఏడుకొండలపైన కోనేటిగట్టున వెలసిన కోనేటి రాయుడు శ్రీవేంకటేశ్వరుడు ఆయన ప్రత్యేకతేమిటంటే భక్తితో వేడుకొంటే ఆ మహానుభావుడు తన కొండలంత వరములను తన భక్తులపై గుమ్మరిస్తాడు.

కురువరతి నంబి అనే కుమ్మరిదాసుడు, స్వామిని తనకు ఈ వరం కావాలి ఆ వరం కావాలి అని యెన్ని వరాలు కోరుకొంటే అన్ని వరాలిచ్చాడు. మరి ఆయన పూజకి పూలులేకపోతే బంకమట్టితో పూలుచేసి స్వామీ! స్వీకరించు అని భక్తితో సమర్పించాడు. ఎంత అనుగ్రహమో కదా!! తన చిన్నమామగారైన తొండమాన్ చక్రవర్తి తనకి ఆనంద నిలయం కట్టించాడని తన శంఖచక్రాయుధాలు ఆయనకిచ్చి, తన బావమరిది వైపు తను నిలిచి యుద్ధంచేసి చివరికి రాజీ కుదిర్చి తొండమానుడు ఎక్కడికి రమ్మంటే అక్కడికి వెళ్ళాడు. ఇంత భక్తవాక్పరి పాలకుడుంటాడా? అసాధ్యం.

అనంతాళ్వారు అనే భక్తుడు స్వామికే దొంగతనం నేరానికి మట్టిమోసే శిక్షవేస్తే వేడుకగా స్వీకరించి మట్టిమోసి ఆయనను అనుగ్రహించి ఆ తరువాత పుష్పకైంకర్యం స్వీకరించినవాడు ఈ దయామయుడు. అనునయంగా తిరుమలనంబి అనే భక్తునితో ప్రతిరోజు ప్రత్యేకంగా మాట్లాడి అనుగ్రహించిన వాడీ తిరుమలేశుడు.

నేను కంచిలోనే వుంటాను. తిరుమల రానేరానని భీష్మించుకొన్న తిరుకచ్చినంబి అనే భక్తుని అనుగ్రహించుటకు తనే స్వయంగా కంచివెళ్ళి మాయోపాయంతో తన తిరుమలకి రప్పించుకొనిన చతురుడు ఈ శ్రీనివాసుడు. స్వామి కరుణ అంచనా వేయటం అసాధ్యం. మనం ఆయన శరణాగతులం కావున తను మంచివాడై ఈ శ్రీవేంకటేశ్వరుడు దయతో మనల్ని శ్రద్ధగా పరిపాలిస్తుంటాడు.

## మంగళహారతి

'భావయామి వేంకటేశమ్' లో వంద కీర్తనలు పూర్తిచేసి ధన్యుణ్ణి జేసిన వేంకటరమణునికి నా ఆనందభాష్ప సమేత మంగళనీరాజనములు. ఆయన హృదయాధిరూఢయైన అలమేల్మంగమ్మకు అన్నమాచార్యులవారు మధురాతి మధురమైన మంగళహారతి పాడుతున్నారు. వినండి. అమ్మవారి కిసలయ చరణాలకు, రంభోరువులకు అరిది జఘనములకు నీరాజనములిచ్చి ఆ శ్రీవేంకటేశ్వరునే పులకించి మైమరచిపో జేసిన ఆచార్యులనేమని పొగడుదునో కదా!

**ఉ॥ క్షీరసముద్రరాజసుత, శ్రీహరి కన్నుల వెల్గు లక్ష్మినిన్**
**నీరజవాసినిన్ కొలిచి నీమముతో వ్రతముల్ అనేకముల్**
**పేరిమిజేతురీ జనులు మేలగు కీర్తనలిట్లు పాడుచున్**
**కూరిమి అన్నమయ్య కృతి గొల్వరె వేంకటనాథురాజ్ఞినిన్**

**రాగం : మోహన**

క్షీరాబ్ధి కన్యకకు శ్రీమహాలక్ష్మికిని
నీరజాలయమునకు నీరాజనం ॥క్షీరాబ్ధి॥

జలజాక్షి మోమునకు జక్కువ కుచంబులకు
నెలకొన్న కప్పురపు నీరాజనం
అలివేణి తురుమునకు హస్తకమలంబునకు
నిలువు మాణిక్యముల నీరాజనం ॥క్షీరాబ్ధి॥

చరణ కిసలయములకు సకియ రంభోరులకు
నిరతమగు ముత్తేల నీరాజనం
అరిది జఘనంబునకు అతివ నిజనాభికిని
నిరతి నానావర్ణ నీరాజనం ॥క్షీరాబ్ధి॥





పగటు శ్రీవేంకటేశు పట్టపు రాణియై
నెగడు సతికళలకును నీరాజనం
జగతి నలమేల్మంగ చక్కదనములకెల్ల
నిగుడు నిజ శోభనపు నీరాజనం ॥క్షీరాబ్ధి॥

**భావామృతం**

క్షీరసాగరమున జన్మించుటజేత క్షీరసాగరకన్య అయిన శ్రీమహాలక్ష్మికి పద్మవాసిని అయిన అలమేల్మంగమ్మకు మంగళహారతులివిగో!

పద్మనేత్రియైన పద్మావతీ దేవి యొక్క వదనమునకు జక్కువపిట్టలను బోలిన స్తనయుగ్మముపై అంటిన కర్పూరముతో వెలసిన కర్పూర నీరాజనమిదియే. ఈ అలినీలకుంతల (నల్లనిముంగురులు గల రమణి) చక్కటి కొప్పునకు, కమలముల వంటి (తామరపువ్వుల వంటి) చేతులకు మాణిక్యములతో నిలిచిన నీరాజనము ఇదే.

చిగురుటాకులవంటి పాదములకు, అరటి బోదెల బోలిన ఊరువులకు ఆసక్తితో నొసంగు ముత్యాల మంగళహారతి ఇదియే. దుస్సహమైన మొలకు, హరినారి నాభికీ పలువన్నెల మంగళహారతి సమర్పింతుము.

అలంకారములచే ప్రకాశించు శ్రీవేంకటనాథుని పట్టపు రాశి ఈ అలమేల్మంగమ్మ. పదునారు కళలతో వర్ధిల్లు ఈ సతి శ్రీమహాలక్ష్మి యొక్క దివ్య రూపమే కదా! లోకమాతయైన ఈమెకు భక్తి పూర్వకమైన నీరాజనము ఇదివో. లోకాలను పరిపాలించే మా తల్లి అలమేల్మంగమ్మ సౌందర్యమునకు విస్తృతమైన మంగళ నీరాజనములను సమర్పించుచున్నాను.

**శ్లో॥ శ్రీవైకుంఠ విరక్తాయ స్వామి పుష్కరిణీ తటే**
**రమయా రమమాణాయ వేంకటేశాయ మంగళ**

శ్రీపద్మావతీ సమేత శ్రీశ్రీనివాస
పరబ్రహ్మణే నమః
శ్రీశ్రీశ్రీశ్రీ